

**శ్రీమతే రామానుజాయ నమః**
**శ్రీమద్వరవరమునయే నమః**

# సాంప్రదాయిక వ్యాస మాలిక- 19

**11-08-2023**



**నరసింహ స్వామి, అహోబిలం**




**'పండితరత్న'**
**డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అழగ శింగరాచార్యులు**


**సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు**

# విషయసూచిక

# 1. శ్రీభాష్యకారదివ్యసూక్తివిశేషానుభవం

(కాంచీ ప్రతివాది భయంకరమ్ అణ్ణంగరాచార్యస్వామివారి ద్రావిడవ్యాసానికి అనువాదం)

శ్రీకృష్ణపరమాత్మ వాస్తవంగా అవతరించి, వాస్తవమైన అర్థాలను పొదిగి, వాస్తవంగా గీతాశాస్త్రాన్ని అవతరింపజేశాడు– అని శ్రీభగవద్రామానుజ దాసులమైన మనం నమ్ముతున్నాము. స్వామి శ్రీరామానుజులు అనుగ్రహించిన గీతాభాష్యం అవతారికలోను, పైన పలు శ్లోకాల భాష్యంలోనూ ఈ నమ్మకమే మనకు ఉర్జితం అవుతున్నది. శ్రీమత్ శంకరాచార్యస్వామి రచించిన భాష్యంలోని ప్రక్రియ దీనికి విరుద్ధంగా ఉన్నది. వారు, తమ భాష్యంలో "భగవాన్ స్వమాయయా దేహవానివ, జాత ఇవ చ లోకానుగ్రహం కుర్వన్ వక్ష్యతే" అని వ్రాయడాన్ని మనం గమనించవచ్చు. దీనివల్ల భగవంఫతుడు వాస్తవంగా దేహపరిగ్రహం చేయలేదు– అని, నిజమైన అవతారం చేయలేదు అని, మాయతో ఏదో జనాలను భ్రమింపచేశాడని శంకరాచార్యులవారు అభిప్రాయపడుతున్నట్లుగా తెలుస్తున్నది. ఈ విధంగా వీరు అభిప్రాయపడడానికి ఒక కారణాభాసం ఉన్నది. అది ఏమి? అంటే, గీతలో తరువాత భగవానుడు నాలుగవ అధ్యాయంలో తానే తన అవతారాన్ని గూర్చి పలికే సందర్భంలో "ఆత్మమాయయా సంభవామి" అని ఉన్నది. దీనికి వాస్తవమైన అర్థం ఏదో, అది భగవద్రామానుజభాష్యంలో ప్రమాణప్రదర్శనపురస్సరంగా నిరూపింపబడింది. "ఆత్మమాయయా– ఆత్మీయయా మాయయా. 'మాయావయునం జ్ఞానమ్' ఇతి జ్ఞానపర్యాయోఽత్ర మాయాశబ్దః. తథా చాభియుక్తప్రయోగః. 'మాయయా సతతం వేత్తి ప్రాణినాం చ శుభాశుభమ్' ఇతి. ఆత్మీయేన జ్ఞానేన, ఆత్మసంకల్పేనేత్యర్థః." అని గీతాభాష్యంలో అక్కడ స్వామి అనుగ్రహించిన శ్రీసూక్తులను. వైదికనిఘంటువును, దానిని అనుసరించిన అభియుక్త ప్రయోగాన్ని చూపి, సంకల్పరూపజ్ఞానమే ఇక్కడ మాయాశబ్దార్థం –అని శ్రీరామానుజులు నిర్ణయించారు. ఇదే మహర్షి అభిప్రాయానికి చాలా, తగిన ప్రామాణికమైన అర్థం. శ్రీవిష్ణుపురాణంలో (6–5–8) "ఇచ్ఛాగృహీతాభిమతోరుదేహః" అని మాయాశబ్దస్థానంలో ఇచ్ఛాశబ్దాన్ని నిస్సందేహంగా ప్రయోగించి, భగవానుడు తన ఇచ్ఛతోనే తనకు అభిమతమైన పలు దివ్యమంగళ విగ్రహాలను పరిగ్రహించి, అవతరిస్తున్నాడు –అని చెప్పబడింది.

ఇక్కడ శంకరాచార్యులవారు– " సంభవామి– దేహవానివ భవామి, జాత ఇవ, ఆత్మమాయయా– ఆత్మనః మాయయా, న పరమార్థతః లోకవత్" అని వివరించారు.

అరణ్యంలో నీరు లేకపోయినప్పటికీ అక్కడ నీరు ఉన్నట్లుగా అది చూపిస్తుంది కదా ఆ విధంగానే భగవంతుడు కూడా, తాను నిజానికి దేహపరిగ్రహం చేయనివాడు కనుక, తాను దేహపరిగ్రహం చేయకపోయినప్పటికీ, ఆ విధంగా దేహపరిగ్రహం చేస్తున్నట్లుగా మాయతో ప్రదర్శిస్తున్నాడు– అని శంకరాచార్యులవారి అభిప్రాయం. "మాయా" అనే పదానికి "అసత్యం" అనేదే వీరు గ్రహించిన అర్థం. తరువాత, నాలుగవ అధ్యాయంలోని తొమ్మిదవ శ్లోకంలో "జన్మ కర్మ చ మే దివ్యమ్, ఏవం యో వేత్తి తత్త్వతః, త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సో ఽ ర్జున" అనే సూక్తిలో భగవంతుడు స్వయంగా "నా అవతారాలను, అవతార లీలలను సత్యాలని ఎవడు తెలుసుకుంటున్నాడో, అతడు వర్తమానదేహాన్ని విడచిపెట్టి, మళ్ళీ వేరొక జన్మను పొందకుండా, నన్నే పొందుతాడు" అని చెప్పాడు. " మే జన్మ కర్మ చ తత్త్వతః యో వేత్తి" అని ఉండడాన్ని స్వమతప్రతికూలంగా భావించిన శంకరాచార్యులవారు చాలా చాతుర్యంగా వేరు విధంగా అన్వయాన్ని చూపించారు. తత్త్వతః" అనేదానిని ", యో వేత్తి "అనే చోట కలుపకుండా, "తత్త్వతః దేహమ్" అని ఉత్తరార్ధంలో అన్వయించి అర్థాన్ని చెప్పారు. వారు ఇంత శ్రమం ఎందుకోసం పడ్డారంటే, , సంభవామి ఆత్మ మాయ అని ఉండే చోట మాయా శబ్దానికి, తాము గ్రహించిన అర్థమే సరి అయిన అర్థం– అనే ఒక అభినివేశం వల్లనే.

ప్రామాణికులు ఇక్కడ మధ్యస్థంగా ఆలోచించి గమనించాలి. తైత్తిరీయ యజుర్బ్రాహ్మణంలో కాఠకం అనే భాగంలోని మూడవ ప్రశ్నలో " యావంతః పాంసవో భూమే సంఖ్యాతాః దేవమాయయా" అని అధ్యయనం చేయబడుతున్నది. భూమిలో ఉండే మట్టి రేణువులు అన్నీ దేవతల మాయచేత లెక్కపెట్టబడినవిగా ఇందులో చెప్పబడుతున్నది. ఇక్కడ "మాయా" శబ్దానికి ఇతరులు చెప్పే అర్థం ఎంత మాత్రం పొసగదు– అనేది స్పష్టం. భూమిలో ఉండే మట్టి కణాలను మానవుల జ్ఞానంతో లెక్కించడం సాధ్యం కాకపోయినప్పటికీ, దేవతల జ్ఞానంతో లెక్కించటానికి సాధ్యంగానే ఉన్నందున, ఇక్కడ "దేవమాయయా" అని పదానికి దేవతల జ్ఞానంతో– అనేదే అర్థం– అని అందరూ నిరాక్షేపంగా అంగీకరించినదే. విద్యారణ్యులు మొదలైన వేదభాష్యకారులు కూడా ఈ విధంగానే ఇక్కడ అర్థాన్ని వివరించారు అందుచేత "మాయా" అనే దానికి "మిథ్యా" అని అర్థాన్ని గ్రహించడం తగినది కాదు– అని తెలుస్తున్నది.

అసురులు, రాక్షసులు మొదలైనవారు చేసే పనులను "మాయా" అని చెప్పడం ఉన్నది. అక్కడ "మిథ్య" అనే అర్థం లేదు. "ఆశ్చర్యకరం" అనే అర్థాన్ని ఉద్దేశించే అక్కడ

మాయాశబ్దప్రయోగం చేయబడింది శ్రీపిళ్లైలోకాచార్యులవారు తత్త్వత్రయమనే గ్రంథంలో అచిత్ప్రకరణంలో (10) "మాయై ఎన్గిఱదు విచిత్రసృష్టియై ప్పణ్ణుకైయాలే" అని అనుగ్రహించిన సందర్భంలో, వ్యాఖ్యానంలో శ్రీమణవాళ మహామునులు " అసురరాక్షసాదుల కార్యాలు ఆశ్చర్యకరంగా ఉండడాన్నిబట్టి మాయా శబ్దంతో చెప్పేటట్లుగానే, దీనిని కూడా, అంటే, ప్రకృతిని కూడా "మాయ" అని అనడం ఎందుకంటే, విచిత్రసృష్టిని చేస్తున్నందువల్ల, అంటే, ఒకదానివలె ఇంకొకటి ఉండకుండా ఉండే విధంగా, ఆశ్చర్యాన్ని కలిగించే పలు కార్యాలను జనింపచేయడం— అని అనుగ్రహించడం ఈ సందర్భంగా అనుసంధేయం. " దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా" (7–14) అనే శ్లోకంలోని భాష్యంలో శ్రీరామానుజులు దీనిని చాలా విశదంగా నిరూపించారు.

"అస్య మాయాశబ్దవాచ్యత్వమ్ అసురరాక్షసాదీనామివ విచిత్రకార్యకరత్వేన. ———ఆతో మాయాశబ్దో న మిథ్యార్థవాచీ. ఐంద్రజాలికాదిష్వివ. కేనచిత్ మంత్రౌషధాదినా మిథ్యార్థవిషయాయాః పారమార్థిక్యా ఏవ బుద్ధే రుత్పాదకత్వేన మాయవీతి ప్రయోగః. తథా మంత్రౌషధాదిరేవ తత్ర మాయా" అని మొదలైన దివ్యసూక్తులు అక్కడ అనుసంధించదగినవి మాయాశబ్దంయొక్క వాస్తవార్థాన్ని తెలియలేక, తప్పయిన అర్థాలను గ్రహించడంవల్లనే మాయావాదుల వాదాలు చాలా చాలా వృద్ధి చెందాయి.

శ్రీకృష్ణుడు అవతరించడం అసత్యం, దేహపరిత్యాగం చేయడం కూడా అసత్యం— అని చెప్పే పక్షంలో, గీతాశాస్త్రం అవతరించడం కూడా అసత్యమనే చెప్పినట్లు అవుతుంది. అసత్యమైన శాస్త్రం మన ఉజ్జీవనానికి ఏ విధంగా సాధనం అవుతుంది?

భగవద్గీతలోని రెండవ అధ్యాయంలో 12వ శ్లోకంనుండి గీతాశాస్త్రం ఆరంభం అవుతున్నది— అని చెప్పవచ్చు. దానికి ముందు ఉన్న భాగం అంతా అవతారికగా ఏర్పడింది. ఆ 12వ శ్లోకం ఏ విధంగా ఉన్నది? అని చూడాలి. " న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః, న చైవ న భవిష్యామో సర్వే వయమతః పరమ్" అనేది ఆ శ్లోకం. దీని అర్థం ఏమంటే— "సర్వేశ్వరుడను అయిన నేను దీనికి ముందు గడచిన అనాదికాలంగా ఉన్నవాడనే. ఓ అర్జునా! నీవు,

ఈ ప్రభువులు అనే క్షేత్రజ్ఞులు కూడా ఇంతకుముందు ఉన్నవారే. ఇంతకు ముందు ఉండడం మాత్రమే కాకుండా, ఇక రాబోయే కాలం అంతా కూడా నేను, మీరు ఉండబోయేవారే "అని అర్థం. సర్వేశ్వరుడనై, పరమాత్మ అయిన నేను నిత్యుడను— అని అనడంలో ఏ విధంగా

సందేహం లేదో, ఆ విధంగానే క్షేత్రజ్ఞులై, జీవాత్మలైన మీరు కూడా నిత్యులు– అని అనడంలో సందేహం లేదు– అని, భగవానుడు స్వయంగా నోరు తెరిచి అన్నాడు. దీనివల్ల సర్వేశ్వరుడైన భగవంతుని కంటే జీవాత్మలకు ఉండే భేదం, ఆ జీవత్మాల మధ్య పరస్పరం ఉండే భేదం పారమార్థికం– అని భగవంతుడు స్వయంగా, వ్యక్తంగా చెప్పినట్లు ఏర్పడుతున్నది. ఈ శ్లోకం విశిష్టాద్వైత సిద్ధాంతానికి మూలమై ఉన్నదని తెలియవచ్చు. మన భాష్యకారులు ఈ శ్లోకానికి అనుగ్రహించిన భాష్యం చాలా విపులంగా ఉన్నది.

దీనికి ముందు అర్జునుడు "పృచ్ఛామి త్వామ్ ధర్మసమ్మూఢచేతాః, యచ్ఛ్రేయః స్యాత్ నిశ్చితం బ్రూహి తన్మే శిష్య స్తే ఽ హం శాధి మాం త్వాం ప్రపన్నమ్" అని తత్త్వార్థాలను తెలియనందు వల్ల తాను మోహాన్ని పొందినట్లుగాను, తన మనసులోని కలత తీరేటట్లుగా తత్త్వార్థాన్ని నిశ్చయించి అనుగ్రహించాలని పలికి, పాదాలలో పడి ప్రార్థించాడు. అటువంటివానికి తత్త్వోపదేశం చేయగా, ఈ గీతాశాస్త్రం అవతరించింది, గీతాచార్యుడు కలత చెందినవానికి ఉపదేశం చేసేటప్పుడు, స్పష్టమైన విషయాలను ఉపదేశిస్తాడు తప్ప, అస్పష్టమైన, దోషాలను కలిగిన విషయాలను చెప్పడు కదా. అందుచేత, ఈ శాస్త్రంలో చెప్పబడే అర్థాలు అన్నీ కూడా పూర్తిగా పారమార్థికాలు– అని వైదికులు భావిస్తారు. అందులోనూ, ఆరంభశ్లోకమైన ఇందులో చెప్పబడిన విషయం ఉపనిషత్తులు మొదలైనవాటిలో వడికట్టిన అర్థంగానే ఉండి ఉండాలి. ఇందులో జీవాత్మ పరమాత్మల భేదం మొదలైనవి చెప్పబడినవి అన్నీ అపారమార్థికాలుగా ఉండడంలో ఏ మాత్రం ఔచిత్యం లేదు. అందుచేత, ఈ నిరూపణాలద్వారా స్వామి శ్రీరామానుజులు ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, గీత మొదలైనవాని అర్థాలను అర్జవంతో తెలిసికొని నిశ్చయించారు– అనేది నిష్పక్షపాతంగా ఆలోచించేవారికి కరబదరికా న్యాయంలో సుస్పష్టం అవుతుంది. ఈ గొప్పతనం గొప్పగా ప్రకాశించేటట్లుగానే యతిరాజసప్తతిలో "యథాభూతస్వార్థా యతినృపతిసూక్తిః విజయతే" అని వేదాంతదేశికులవారిచే యుక్తంగా చెప్పబడింది.

★★★★★

# ౨. చక్రవర్తివలె కోల్పోవడానికి పనికి వస్తుంది

(కాంచీ ప్రతివాదిభయంకరం అణ్ణంగరాచార్య స్వామివారి ద్రావిడ వ్యాసానికి అనువాదం)

ముముక్షుప్పడి చరమశ్లోక ప్రకరణంలో "చక్రవర్తియైప్పోలే ఇఝక్కైక్కు ఉఱుప్పు" (దశరథ చక్రవర్తి వలె కోల్పోవడానికి పనికి వస్తుంది) అని అనుగ్రహించిన శ్రీపిళ్ళైలోకాచార్యులవారు దశరథ చక్రవర్తిని కోల్పోయినవానినిగా పలికారు. దీనిని గూర్చి వివరిస్తాను.

శ్రీరామాయణం అయోధ్యాకాండలో దశరథ చక్రవర్తియొక్క సత్యవాదిత్వ వృత్తాంతం చాలా అతిశయాన్ని కలిగి ఉన్నది. చక్రవర్తి సత్యవాది అయినందువల్ల, కైకేయి వర ప్రార్థనను మరచిపోలేక, కాదనలేక, శ్రీరాముని అరణ్యానికి పంపించి, సత్యవాదిత్వ మహా కీర్తిని పొందాడు– అని చెప్పబడుతున్నది. కైకేయి యొక్క వర ప్రార్థనను గూర్చిన వృత్తాంతాన్ని ముందుగా వివరిస్తాను.

దండకారణ్యంలో వైజయంతం అనే పట్టణంలో నివసించేవాడు, తిమిధ్వజుడు అనే మాఱు పేరును కలిగినవాడు, ఇంద్రుని జయించినవాడు అయిన శంబరాసురుని, ఇంద్రుని ప్రార్థనను అనుసరించి జయించడం కోసం కైకేయితో పాటు వెళ్లిన దశరథ చక్రవర్తి, ఆ అసురుని ఎదిరించి చేసిన గొప్ప యుద్ధంలో అతని చేత గాయపడి మూర్ఛను పొందినప్పుడు, ఆ చక్రవర్తిని ఆ అసురులు వధించకుండా ఉండేటట్లు కైకేయి యుద్ధరంగంలో నుండి తీసికొని పోయి రక్షించగా, మూర్ఛ నుండి తేరుకున్న దశరథుడు తనకు కైకేయి చేసిన మహోపకారానికి చాలా సంతోషించి, తాను ఆమెకు ఆమె కోరిన రెండు వరాలను ఇస్తానని మాట ఇచ్చాడు. ఆమె వాటిని అప్పుడే కోరుకోకుండా, తరువాత తనకు కావలసినప్పుడు అడిగి పొందుతాను– అని చెప్పింది. సీతాకళ్యాణం తరువాత, చాలా కాలం గడిచి, దశరథుడు శ్రీరామునకు యువరాజ పట్టాభిషేకం చేయాలని ప్రయత్నం చేస్తున్నప్పుడు, మంథర పన్నాగంతో మనస్సులో మార్పును పొందిన ఆ కైకేయి, దశరథ చక్రవర్తిని చూసి, పూర్వం అతడు తనకు మాట ఇచ్చిన రెండు వరాలకు ఫలంగా తన కుమారుడైన భరతునకు పట్టాభిషేకం చేయాలని, కౌసల్యాకుమారుడైన శ్రీరాముని 14 సంవత్సరాల కాలం అరణ్యాలకు పంపించాలని పలికి బలవంతం చేయగా, ఆమె మాటలను విని చాలా బాధపడిన దశరథుడు, సత్యవాది అయినందున, పూర్వం ఆమెకు వరం ఇచ్చిన మాటను తప్ప లేక శ్రీరాముని వనవాసానికి అంగీకరించాడు– అనేది కథాక్రమం.

ఇక్కడ మనం ముఖ్యంగా గమనించి చూడవలసినది ఒకటి ఉన్నది. కైకేయికి దశరథుడు వరం ఇచ్చిన కాలం చాలా పురాతనం. ఆ వరం "ఇటువంటి వరం" అని నిర్దేశించి చెప్పబడలేదు కూడా. అది ఆ విధంగా ఉండగా, ప్రకృతంలో అయితే, శ్రీరామునకు చక్రవర్తి తానే స్వయంగా రాజ్యప్రదానం చేయడం జరిగింది. అయోధ్యాకాండం మూడవ సర్గలో (39వ శ్లోకం)

"జ్యేష్ఠాయా మసి మే పత్న్యా సదృశ్యాం సదృశః సుతః,
ఉత్తమః త్వం గుణశ్రేష్ఠో మమ రామాత్మజః ప్రియః,
త్వయా యతః ప్రజా శ్చేమాః స్వగుణై రనురంజితాః,
తస్మా త్త్వం పుష్యయోగేన యౌవరాజ్య మవాప్నుహి"

అనే ఈ శ్లోకాలు దశరథ చక్రవర్తిచేత శ్రీరామునకు రాజ్యప్రదానం చేయబడిన విషయాన్ని స్పష్టంగా చెబుతున్నాయి. ఇంత మాత్రమే కాదు. మళ్ళీ కూడా సుమంత్రుని పంపించి, శ్రీరామచంద్రుని పిలిపించి, కొంచెం కూడా ఆలస్యం లేకుండా చాలా శీఘ్రంగా రాజ్యపటాభిషేకం చేసికొనేటట్లుగా దశరథుడు బలవంతం చేసిన విషయం కూడా తరువాత నాలుగవ సర్గలో చాలా వివరంగా చెప్పబడింది. ఈ విధంగా ఒక సారికి పలుమార్లు శ్రీరాముని పిలిపించి రాజ్యప్రదానం చేసిన తరువాత, దీనికి విరోధం లేని విధంగా కైకేయియొక్క వరాన్ని అతడు నెరవేర్చాలి తప్ప, శ్రీరామునకు ఇచ్చిన మాటను ఉపమర్ధించి, వేరుగా ప్రవర్తించడంలో ఏదైనా ఔచిత్యం ఉన్నదా? అని గమనించి చూడాలి.

కైకేయికి రెండు వరాలు ఇచ్చిన కాలంలోనే వరస్వరూపం నిశ్చయింపబడి ఉన్నట్లయితే, దానికి ప్రాబల్యం చెప్పడానికి అవకాశం ఉన్నది. శంబరాసుర యుద్ధ కాలంలో "కైకేయీ! నీవు కోరిన రెండు వరాలను పొందు " అని చక్రవర్తి చేత చెప్పబడింది. "అయోధ్యా రాజ్యాన్ని నా కుమారునకు ఇవ్వాలి, కౌసల్యాపుత్రుని వనాలకు పంపించాలి "అని అప్పుడే కైకేయి చేత అడుగబడి ఉంటే, ఆ వరప్రదానం ప్రాబల్యాన్ని పొంది ఉంటుంది అప్పుడు శ్రీరాముడు కానీ, భరతుడు కానీ పుట్టలేదు కనుక, ఆ విధంగా కోరడానికి అవకాశం లేకుండా పోయింది. శ్రీరామునకు యువరాజ పట్టాభిషేకం చేయాలని ప్రయత్నించినప్పుడే, ఆ వార్తను తెలుసుకొని, " నా కుమారునకు రాజ్యం ఇవ్వాలి, శ్రీరాముని వనవాసిని చేయాలి" అని కైకేయి అడిగి ఉన్నట్లయితే, ఆ మాట ఒప్పుతుంది. శ్రీరామునకు రాజ్యం ఇస్తానని మాట ఇచ్చి పూర్తి అయినది. అతడు కూడా రాజ్యాన్ని పొందడానికి తగిన కార్యకలాపాలను అనుష్ఠించి పూర్తి అయినది. ఈ స్థితిలో, కైకేయి వచ్చి, ఏనాడో తనకు

మాట ఇవ్వబడిన రెండు వరాలకు ఫలంగా రామ వివాసాన్ని కోరినట్లయితే, దీనిని దశరథుడు నెరవేర్చి తీరవలసిన ఆవశ్యకత ఏమున్నది? ఆమె కోరికను ఒక విషయంగా లెక్కించకుండా, " కైకేయీ! నీవు కోపగృహంలోనే పడి ఉండు. "అని చెప్పి లేచిపోయి, శ్రీరామ పట్టాభిషేకం మహోత్సవాన్ని ఏ లోటు లేకుండా నెరవేరిస్తే, అప్పుడు చక్రవర్తి యొక్క సత్యవాదిత్వానికి ఏదైనా లోటు వస్తుందా? ఏమి రాదు. "సగం రాజ్యం శ్రీరామునకు చెందనీ, సగం రాజ్యం భరతునకు చెందనీ" అని చెప్పవచ్చు. ఇంకా పలు విధాలుగా చెప్పవచ్చు. శ్రీరామునకు ఇచ్చి వేసిన రాజ్యాన్ని లేకుండా చేసి, అతనిని అరణ్యాలకు వెళ్లేనట్లుగా చేయడం చక్రవర్తిని అసత్యవాదిగా చేస్తుందే తప్ప, సత్యవాదిగా చేస్తుందా? అని శంకించే అవకాశం ఉన్నది.

శ్రీరామాయణ మహార్ణవంలో లోతుగా దిగి, అద్భుతమైన విచారణలను చేస, పరమార్థాలను గ్రహించగలిగిన మహామతులు ఇక్కడ సంప్రతిపన్నమైన శంకాపరిహారాన్ని చేయాలి. నాకు తెలిసినంతవరకు కొన్ని విషయాలు ఇక్కడ ప్రస్తావన చేస్తాను.

"చక్రవర్తియైపోలే ఇఴక్కైక్కు ఉఱుప్పు" అని పలికిన చోట వ్యాఖ్యానంలో శ్రీమణవాళ మహామునులు " ఇంతకు ముందే వరప్రదానాన్ని చేసి, ఇప్పుడు కాదనడం ఉచితం కాదు –అని తలచి, ఆభాసమైన సత్య ధర్మాన్ని ఆశ్రయించి, " రామో విగ్రహవాన్ ధర్మః" అనే శ్రీరామునితో కలసి ఉజ్జీవించి, పొందదగిన ప్రాప్యాన్ని కోల్పోయిన చక్రవర్తి వలె" అని అనుగ్రహించారు.

ఇక్కడ "ఆభాసమైన సత్యధర్మం"– అనేదానికి రెండు విధాలైన తాత్పర్యాలు ఉన్నాయి. "సత్యం పలకడం"అనేది ధర్మం అయినప్పటికీ, ఒకవైపు తట్టలో భగవంతుని పెట్టి, మరొక వైపు తట్టలో సత్యాన్ని పెట్టి గమనించి చూసినప్పుడు, సత్య వచనం అనేది భగవంతుని కోల్పోవడానికి తగినది అయితే, అది నిజమైన సత్యధర్మం కాదు. అది ఆభాసమైన ధర్మమే– అనేది ఒక తాత్పర్యం.

దశరథుని సత్యవాదిత్వం వస్తుస్థితిలో ధర్మం కాదు, ధర్మాభాసమే, అది అసత్య పర్యవసితమే – అనేది ఇంకొక తాత్పర్యం.

"సర్వ ధర్మాన్" అనేదానికి అర్థం వివరించేటప్పుడు, వీటిని ధర్మం అనడం భ్రమించిన అర్జునుని అభిప్రాయంతో. – అనే పలికిన రీతిలో దశరథ చక్రవర్తిని సత్యవాది అని అనడం, భ్రమించిన అతని అభిప్రాయంతో– అని చెప్పవచ్చు.

గీతాశాస్త్రాన్ని ప్రకాశనంచేయడానికి సమయం కోసం వేచి ఉన్న శ్రీకృష్ణ పరమాత్మ యుద్ధసన్నద్ధుడై యుద్దరంగంలోకి వచ్చి నిలచిన అర్జునుని భ్రమను పొందేటట్లుగా చేసినట్లుగానే, దేవకార్యాన్ని నిర్వహించడం కోసం వనప్రస్థాన కుతూహలిగా ఉండే శ్రీరామ చంద్రమూర్తి తన మనస్సు నెరవేరడం కోసంగా దశరథ చక్రవర్తికి ఆధర్మంలో ధర్మబుద్ధిని, ధర్మంలో అధర్మ బుద్ధిని కలిగించాడు– అని చెప్పడంలో ఏ లోటు లేదు.

"కాశీలో దొంగతనం చేయడం కోసం కంచిలో కన్నం చేయడం" అనే ఒక వినోదమైన మాట వ్యవహారంలో ఉన్నది. ఆ క్రమంలో పురాణ కథలు ఏర్పడి ఉన్నాయి. " వేండి త్తేవర్ ఇరక్క వందు పిఱందదుమ్" (దేవతలు ప్రార్థించగా ఈ లోకానికి వచ్చి జన్మించడం కూడా) అనే విధంగా దేవతల ప్రార్థనను ఒక నెపంగా చేసికొని పరమ పురుషుడు ఈ భూలోకంలోకి వచ్చి అవతరించాలని అభిప్రాయపడడానికి చాలా దినాలు ముందుగానే, కొన్ని సందర్భాలు జరిగేటట్లు చేస్తాడు. శంబరాసుర యుద్ధంలో దశరథునకు పరాజయం కలిగే అవకాశమే లేదు. అది ఏర్పడేటట్లు, అప్పుడు అతనికి కైకేయి సహాయం చేసేటట్లు, అప్పుడు ఆమెకు అతడు రెండు వరాలు ఇచ్చేటట్లుగా ముందుగా చేయడం అనేది అంతా భగవంతుని కృత్యమే. కైకేయి వరాన్ని అడిగేటప్పుడు భరతుడు అయోధ్యలో ఉండి ఉన్నట్లయితే, శ్రీరామునకు వనవాసం ఏర్పడే అవకాశం లేదు కదా. ఆ విధంగా సత్య సంకల్పుడైన అతని సంకల్పం మూలంగా జరిగిన వాటిలో ఇప్పుడు మనం తెలుసుకొని విచారించి చెప్పడానికి ఏమి ఉన్నది కనుక! పారమార్థిక దృష్టిలో దశరథుడు సత్యవాది కాడు– అని చెప్పడంలో ఏమీ లోటు లేదు. అందువల్లనే అతనిని గూర్చి శ్రీరామానుజులు పలికిన దివ్యసూక్తి ఒకటి ప్రసిద్ధంగా ఉన్నది. " దశరథచక్రవర్తికి నరకమే లభించడం తగినది. భగవంతుని ఆనృశంస్యంచేత అతడు స్వర్గానికి పోయాడు, అంతే " అనేది ఆ సూక్తి.

★★★★★

# 3. శ్రీరంగరాజస్తవంలో కవితాచాతురి

(ఉ. వే. శ్రీమాన్ ఎస్. కృష్ణస్వామి అయ్యంగార్, తిరుచ్చి)

శ్రీపరాశరభట్టార్య: శ్రీరంగేశపురోహితః |
శ్రీవత్సాంకసుతః శ్రీమాన్ శ్రేయసే మేఽస్తు భూయసే ॥

శ్రీరామానుజాచార్యులవారి ముఖ్యశిష్యులైన కూరేశులనే శ్రీవత్సాంకమిశ్రుల కుమారులు శ్రీపరాశరభట్టర్. వీరు, శ్రీరంగంలో నెలకొని ఉండే శ్రీరంగనాథుని గూర్చి రచించిన స్తవం శ్రీరంగరాజస్తవం. ఇది, 127 శ్లోకాలను కలపూర్వశతకంతో, 105 శ్లోకాలను కల ఉత్తరశతకంతో కూడుకొన్నది. తమ తండ్రిగారైన కూరేశులవలె భట్టర్ కూడా చాలా గొప్ప కవి. ఉత్తమకవిత్వ పోకడలు ఈస్తుతిలోని శ్లోకాలలో గోచరిస్తాయి. వాటిలో కొన్ని విన్నపింపబడుతున్నాయి.

శ్రీరంగానికి చుట్టూ ప్రవహించే కావేరీనదిని వర్ణించే సందర్భంలో "తెళివిలా క్కలజ్ఞల్ నీర్ శూழ் తిరువరఙ్గమ్" అని తొండరడిప్పొడి ఆళ్వార్లు తిరుమాలై ప్రబంధంలో పల్కినట్లుగా, కావేరీజలం కలత చెంది, ప్రవహించడానికి ఒక అందమైన హేతువును భట్టర్ ఉత్ప్రేక్షిస్తున్నారు. నదులకన్నిటికి సముద్రుడు నాథుడని అనడం కవి సమయం. శ్రీరంగనాయకి అనే లక్ష్మీదేవి సముద్రుని పుత్రిక. అందువల్ల కావేరీ నది ఆమెకు తల్లి. ఆమె తన, కలత చెందిన నీటి అలల రూపంలోని హస్తాలతో ముత్యాలను, రత్నాలను కుప్పలు కుప్పలుగా గ్రహించి, రావడాన్ని చూస్తే, ఆ తల్లి తన కుమార్తెకు, అల్లునకు కానుకగా వాటిని తీసికొనివస్తున్నట్లు తోస్తున్నది. "వధువు తండ్రి నదులకు రాజు. తీసికొని తల్లి అయిన తాను గంగకంటే పవిత్రురాలు. పుత్రిక సంపదలకు అన్నిటికి అధినేత్రి అయిన శ్రీదేవి. ఇక, అల్లుడు అయితే అన్ని లోకాలకు ప్రభువైన శ్రీరంగనాథుడు. ఈ విధంగా ఉండేటపుడు, నేను నా అలలనే చేతులతో తీసికొనివచ్చే ఈ కానుకలు చాలవుకదా! – అని కావేరీనది అనే తల్లి కలత చెందినదట. ఈ అందమైన భావాన్ని ప్రకటించేదే ఈ క్రింది శ్లోకం.

దుగ్ధాబ్ధిర్జనకో జనన్యహమియం శ్రీరేవ పుత్రీ వరః
శ్రీరంగేశ్వర ఏతదర్హమిహ కిం కుర్యామితీవాకులా!
చంచచ్చామర చంద్రచందన మహామాణిక్య ముక్తోత్కరాన్
కావేరీలహరీకరై ర్విదధతీ పర్యేతి, సా సేవ్యతామ్ ||

నంబెరుమాళ్ అని ప్రసిద్ధిచెందిన ఉత్సవమూర్తికి కుడివైపు, ఎడమవైపు శ్రీదేవి, భూదేవులనే దివ్యదేవేరులు వేంచేసి ఉండడాన్ని దర్శించిన భట్టర్ కు తామరపూవులతో నిండిన ఒక తటాకంలో రెండు హంసలు క్రీడిస్తున్నట్లు తోచింది. నేత్రాలు, హస్తాలు, పాదాలు – అనే తామర పూలను కల్గినదై, పచ్చని తిరుమేని అనే నాచును కల్గినదైన ఒక పరిమళతటాకంగా భగవంతుని 'వాశత్తడమ్పోల్' ఇత్యాదిగా నమ్మాళ్వార్లు కీర్తించిన రీతిని దృష్టిలో పెట్టుకొని, ఆ తటాకంలో శ్రీదేవి, ఆమె నీడవంటి భూదేవి హంసలుగా క్రీడిస్తున్నారు – అని అన్నారు. ఆ శ్లోకం క్రింది విధంగా సాగింది:

ఉత్ఫుల్ల పంకజతటాకమివోపయాని
శ్రీరంగరాజ మిహ దక్షిణసవ్యసీమ్నోః |
లక్ష్మీం విహారరసికా మిన రాజహంసీం
ఛాయామివాభ్యుదయినీ మవనీం చ తస్యాః ॥

నంబెరుమాళ్ అనే ఉత్సవమూర్తికి వెనుక పెరియపెరుమాళ్ అనే మూలమూర్తి, రెండు వైపుల ఇద్దఱు దేవేరులు, ముందుగా గరుడుడు వేంచేసి ఉండడాన్ని దర్శించగానే, ఈ విధంగా నల్గురిచే నాల్గు వైపుల అనుభవింపబడే అందాన్ని కలవాడై, చిఱునవ్వును కల ముఖంతో, శ్రీహస్తాలలో ధరించిన దివ్యాయుధాలతో లోకంలోని అందఱికి అభయాన్ని ఇచ్చే నంబెరుమాళ్ళు భట్టర్ శరణు పొందే శ్లోకమే ఈ క్రింది శ్లోకం:

అగ్రే తార్ క్ష్యేణ పశ్చాదహిపతిశయనే నాత్మనో పార్శ్వయో శ్చ
శ్రీభూమిభ్యా మతృప్త్యా నయనచులకనైః సేవ్యమానామృతౌఘమ్|
వక్త్రేణావిఃస్మితేన స్ఫురదభయగదాశార్ ఙ్గచక్రాసిముఖ్యైః
విశ్వస్మై తిష్ఠమానం శరణ మశరణా రంగరాజం భజామః ॥

శ్రీరంగరాజస్తవంలో ఉత్తరశతకం భగవద్రామానుజుల విశిష్టాద్వైత తత్త్వాలను, వేదవాక్యాలను, ఆళ్వార్ల పాశురాలను వివరించే రీతిలో దర్శనమిస్తుంది. లోకంలో ఒకదానిని విడచి ఇంకొకటి ఉండనందున, దేహం, ఆత్మ ఒకటిగా వ్యవహరింపబడుతున్నాయి. కారణవస్తువు, కార్యవస్తువు ఒకటిగా వ్యవహరింపబడుతున్నాయి. జాతిగుణ కర్మలు వాటిని కల ద్రవ్యంతో ఒకటిగా వ్యవహరింపబడుతున్నాయి. ఆ విధంగానే, ఈ లోకం అంతా సర్వాత్మ అయిన భగవానునకు శరీరంగాను, సర్వకారణుడైన అతనికి కార్యంగాను, విశేష్యమైన అతనికి విశేషణంగాను, అపృథక్సిద్ధంగాను ఉన్నందున భగవంతుడు లోకాన్ని తానని అభిమానిస్తున్నాడు. అందువల్ల వేదాలు "లోకం అంతా పరమాత్మయే" అని

అంటున్నాయి. అందుచేత, "బ్రహ్మాన్ని మాయ ఆవరించినందున జగత్తు మిథ్య" అని కాని, "శరీరమనే ఉపాధితో పరిచ్ఛేదింపబడిన బ్రహ్మమే జీవుడు"అని కాని, "బ్రహ్మమే చేతనాచేతనాలుగా పరిణమిస్తున్నది" అని కాని చెప్పవలసిన అక్కరలేదు- అని ఈ క్రింది శ్లోకం ద్వారా పల్కుతున్నారు, భట్టర్.

దేహో దేహిని కారణే వికృతయో జాతిర్గుణాః కర్మ చ
ద్రవ్యే నిష్ఠితరూపబుద్ధివచనా సా స్యాత్ తథేదం జగత్ |
విశ్వం త్వయ్యభిమన్యసే జగదిషే తేనాద్వితీయ స్తతః
మాయోపాధివికారసంకరకథా కా నామ రంగేశ్వర! ॥

"సర్వం ఖల్విదం బ్రహ్మ", "ఐతదాత్మ్యమిదం సర్వమ్", "తత్త్వమసి శ్వేతకేతో! " మొదలైన ఉపనిషద్వాక్యాలు, "సకల మిద మహం చ వాసుదేవః" మొదలైన పురాణవాక్యాలు బ్రహ్మాన్ని, జగత్తును ఒకటిగా చేసి పల్కుతున్నాయి. దీనికి గల కారణాన్ని పరిశీలించి చూచినపుడు "లోకాన్ని రక్షించడం, సృష్టించడం, ఆయా కార్యాలలో ప్రవర్తింపజేయడం, ప్రళయసమయంలో తన ఉదరంలో లయింపజేసికోవడం, ఒక్కొక్క వస్తువులోను లోపల ప్రవేశించి నియమించడం, అంతటా వ్యాపించడం ఇత్యాది సర్వవ్యాపారాలను భగవానుడు జగత్తును ఉద్దేశించి (జగత్తు కోసంగా) చేస్తున్నాడు. కనుక, లోకం అంతా అతనికి స్వాధీనమైన (శేషమైన) శరీరమవుతున్నది. అందుచేతనే, జగత్తు, పరమాత్మ ఒక్కటే అని ప్రమాతలలో గొప్పవారైన శ్రీరామానుజులు మొదలైనవారు నిర్ణయించారు – అని భట్టర్ ఈ క్రింది శ్లోకంలో వేదాంతసారాన్ని అనుగ్రహించారు.

స్థిత్యుత్పత్తిప్రవృత్తి గ్రసననియమనవ్యాపనై రాత్మన స్తే
శేషోఽశేషః ప్రపంచో వపురితి భవత స్తస్య చాభేదవాదాః. ,
సర్వం ఖల్వైతదాత్మ్యం సకలమిద మహం తత్త్వమస్యేవమాద్యాః |
వ్యాఖ్యాతా రంగధామప్రవణ! విజయిభిః వైదికైః సార్వభౌమైః॥

ఉత్తరశతకంలో భగవానుని పలు అవతారాలను భట్టర్ వర్ణించారు. మీనరూపి అయిన భగవానుడు ఒక నావలో మనువుతో కలసి చరాచరాలైన జీవరాసులను పెట్టుకొని, అవి ప్రళయజలంలో మునిగిపోకుండా తీసికొనిపోయేటపుడు, వాటికి భయం కలుగని రీతిలో వాటితో వినోదంగా సంభాషిస్తూ, పయనం సాగించినట్లు శుక్లయజుర్వేదానికి చెందిన శతపథబ్రాహ్మణం తెల్పుతున్నది. ఈ వృత్తాంతాన్ని భట్టర్ ఈక్రింది శ్లోకంలో ప్రస్తావించారు.

మీనతను స్త్వం నావి నిధాయ స్థిరచరపరికరమము మను భగవన్!
వేదసనాభిస్సోక్తివినోద్రైః అకలిత లయభయలవ మము మవహః॥
కలియుగంలో చివరలో శ్రియఃపతి కల్కిరూపిగా అవతరించి, దుష్టులను సంహరించి, భూభారాన్ని తగ్గిస్తాడని పురాణాలు పలికే విషయాన్ని ప్రస్తావించి, "ఇపుడు ఉండే దుష్టులను కూడా ఆవిధంగా సంహరించు" అని భట్టర్ ప్రార్థిస్తున్నారు, ఈ శ్లోకంలో:

కల్కితను ర్ధరణీం లఘుయిష్యన్
కలికలుషాన్ విలునాసి పురా త్వమ్।
రంగనికేత! లునీహి లునీహీతి
అఖిల మరుంతుదమద్య లునీహి॥
గజేంద్రరక్షణ వృత్తాంతాన్ని వర్ణించేటపుడు "ఆదిమూలమా! " అని మొసలి బారిన పడిన గజేంద్రుడు ఘోషించగానే, అతివేగంగా, అతనిని రక్షించడంకోసం, బయలుదేరాడు, భగవానుడు. ఆ విధంగా బయలుదేరినపుడు అలవాటు ప్రకారం సేనాధిపతి విష్వక్సేనుడు అవలంబంగా చాచిన హస్తాన్ని గ్రహించకుండా, తీసికొని రాబడిన పాదులకను ధరించకుండా, దేవేరులు తికమకపడగా, వాహనోచితాలైన అలంకారాలు ఏమీ లేకుండా ఉండే గరుడుని ఎక్కి, చాలా వేగంగా వెళ్ళిన భగవానుని వేగానికి నమస్కారం – అని చమత్కరిస్తున్నారు, ఈక్రింది శ్లోకంలో భట్టర్:

అతంత్రిత చమూపతిప్రహితహస్త మస్వీకృత
ప్రణీతమణిపాదుకం కిమితి చాకులాంతఃపురమ్ |
అవాహనపరిష్క్రియం పతగరాజ మారోహతః
కరిప్రవరబృంహితే భగవతః స్త్వరాయై నమః॥
జీవస్వరూపాన్ని, పరమాత్మస్వరూపాన్ని తెలిపే పలు పలు సంస్కృత ద్రావిడ వేదవాక్యాలను తమ శ్లోకాలలో అక్కడక్కడ పొదిగి, వాటిని భట్టర్ వివరిస్తారు. "యస్యామతం తస్య మతం మతం యస్య న వేద సః" అని, "పరమాత్మను పరిచ్ఛేదించి తెలియలేనివాడే ఆ పరబ్రహ్మాన్ని తెలిసినవాడవుతున్నాడు. ఎవడు, పరమాత్మను పరిచ్ఛేదించి తెలిసినవాడనని పల్కుతున్నాడో, అతడు వాస్తవానికి తెలియనివాడే"అని ఘోషించే కేనోపనిషన్మంత్రాన్ని, "పుకళ్ందోమ్ పళ్ళిప్పోమ్ పుకழ்ோమ్ పళ్ళియోమ్" అని "భగవానుని పూర్తిగా స్తుతించినట్లు పల్కడం అతనిని నిందించినట్లవుతుంది. అతనిని పొగడలేము అని విరమించడమే అతనిని పొగడినట్లవుతుంది. అతనిని పొగడలేము – అని

విరమించడమే అతనిని పొగడినట్లవుతుంది" అని ఘోషించే ద్రావిడవేదమైన 'పెరియ తిరువందాది' పాశురాన్ని భట్టర్ పూర్వశతకంలో ఈ క్రింది శ్లోకంలో పల్కి, వివరించారు:

అమతం మతం మత మథామతం స్తుతం
పరినిందితం భవతి నిందితం స్తుతమ్।
ఇతి రంగ రాజ ముదజూఘుషత్రయీ
స్తుమహే వయం కిమితి తన్న శక్నుమః॥

సూర్యునిలో ఉండే తేజస్సును కీర్తించే గాయత్రీమంత్రాన్ని, "ఆప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః", "తస్య యథా కప్యాసం పుండరీక మేవమక్షిణీ" అని స్వర్ణమయమైన తిరుమేనితో కూడిన సూర్యనారాయణుని పుండరీకాక్షునిగా పలికే ఛాందోగ్యోపనిషత్తు మంత్రాన్ని,

తేజఃపరం తత్సవితు ర్వరేణ్యం
ధామ్నా పరేణాప్రణఖాత్ సువర్ణమ్ |
త్వాం పుండరీకేక్షణమామనంతి
శ్రీరంగనాథం తముపాసిషీయ॥

అనే శ్లోకంలో ప్రస్తావించి, అవి శ్రియఃపతి అయిన శ్రీరంగనాథుని స్తుతించేవి కనుక అతనిని ఉపాసిస్తున్నాము – అని అన్నారు.

"చక్షుర్మిత్రస్య వరుణస్యాగ్నేః" అని దేవతలకు నేత్రభూతుడని, "సూర్య ఆత్మా జగత స్తస్థుషశ్చ" అని సమస్త జగత్తును నియమించే ఆత్మ– అని సంధ్యావందన మంత్రాలలో అనుసంధింపబడేవాడు శ్రీరంగనాథుడే కనుక, "పశ్యేమ శరద శ్శతమ్" అని సంధ్యావందనమంత్రంలో వంద ఏండ్లపాటు దర్శించదగినవాడని చెప్పబడేవాడు శ్రియఃపతిగా పురుషసూక్తంలో అనుసంధింపబడే అతడే– అనే విషయాన్ని –

ఆత్మాస్య గంతుః పరితస్థుష శ్చ
మిత్రస్య చక్షు ర్వరుణస్య చాగ్నేః
లక్ష్మ్యా సహోత్పత్తికగాఢబంధం
పశ్యేమ రంగే శరద శ్శతం త్వామ్॥ II
అని వివరించారు.

తైత్తిరీయ యజుర్వేదబ్రాహ్మణంలో "యస్యాస్మి న తమంతరేమి" అని "పరమాత్మకు శేషవస్తువై ఉండే నేను అతనిని విడచి ఉండను" అని పలికే వేదవాక్యాన్ని "యోఽహ మస్మి

స సన్ యజే" "నేను ఏ విధంగా ఉన్నానో, ఆవిధంగా ఉండే పరమాత్మను శరణాగతి జ్ఞానరూపమైన యాగంతో ఆరాధిస్తాను" అని పలికే వేదవాక్యాన్ని కూర్చి, వాటిని శ్రీరంగనాథుని పరంగా భట్టర్ ఈక్రింది శ్లోకంలో అనుసంధించారు:

యస్యాస్మి పత్యు ర్న తమంతరేమి
శ్రీరంగతుంగాయతనే శయానమ్ |
స్వభావదాస్యేన చ యోఽహ మస్మి
స సన్ యజే జ్ఞానమయై ర్మఖై స్తమ్ II

నమ్మాళ్వార్లు ఆధర్వణవేదసారమైన పెరియతిరువన్దాది ప్రబంధంలో– "ముదలామ్ తిరువురువమ్ మూన్ఱెన్బర్, ఒన్ఱే ముదలాకుమ్ మూన్ఱుక్కు-మెన్బర్, ముదల్వా! నికరిలకు కారురువా! నిన్నకత్తదన్ఱే పుకరిలకు తామరైయిన్ పూ" "కొందఱు, త్రిమూర్తులు పరతత్త్వమంటారు. మఱి కొందఱు ఆ త్రిమూర్తులు ముగ్గురు ఒకరే అని, ఆ మూడు మూర్తులకు మూలమైన నాల్గవమూర్తి ఉన్నదని అంటారు. కారుమబ్బు రంగువంటి రంగును కల జగన్మూలమా! లోకాన్ని సృష్టించిన బ్రహ్మను తనలో కల్గిన తామరపూవు నీ నాభినుండి పుట్టినందున వాస్తవానికి నీవే పరతత్త్వం" అని చేసిన పరతత్త్వనిర్ణయాన్ని

త్రయో దేవా స్తుల్యా స్త్రితయ మిద మద్వైత మధికం
త్రికాదస్మాత్తత్త్వం పరమితి వితర్కాన్ విఘటయన్ I
విభోర్నాభీపద్మో విధిశివనిదానం భగవతః
తదన్యద్భ్రూభంగీపరవదితి సిద్ధాంతయతి నః॥

అని అనుసంధించారు. ఇంతవరకు, సకలశాస్త్రాలలో పారంగతులైన శ్రీపరాశరభట్టరు గల మేధావిలాసాన్ని, కవితాప్రణయన చాతుర్యాన్ని లేశమాత్రంగానే ప్రస్తావించడం జరిగింది. విస్తరిస్తే మహాభారతమే కాగలదు.

★★★★★

# 4. భగవానుని శ్రీచరణాల ప్రాముఖ్యమ్

భగవంతుని దివ్యమంగళ విగ్రహంలో శ్రీపాదాలనుండి మస్తకం వరకు ఉండే దివ్యాంగాలు అన్నీ చాలా అందమైనవి, భక్తుల మనసులను ఆకర్షించగలిగినవికదా. ఈ విధంగా ఉండేటప్పుడు, ఎందువల్ల ఆ స్వామి శ్రీ చరణాలకే అంతటి ప్రాధాన్యం ఇవ్వబడుతున్నది? భగవంతుని బాహువులను, నేత్రాలను, శిరస్సును, వక్షస్సును, ఈ విధంగా ఉండే ఎన్నో దివ్యంగాలను ఆళ్వారులు కీర్తించినప్పటికీ కూడా, ఆ స్వామి శ్రీచరణాలకే ఎక్కువ ముఖ్యత్వాన్ని ఇచ్చినట్లుగా వారి సూక్తులలో మనకు కనబడుతుంది. ఇది ఎందువల్ల? అనేది ఒక ప్రశ్న.

ఎక్కడ శరణాగతిని గూర్చిన ప్రస్తావన ఉన్నప్పటికీ, అది శ్రీచరణాలలోనే చేసినట్లుగా శ్లోకాలలో కానీ, మంత్రాలలో కానీ, ఆళ్వారుల సూక్తులలో కానీ కనిపిస్తున్నదే. భగవంతుని శరణాగతి చేసే క్రమాన్ని తెలియజేసే ద్వయ మంత్రంలోకూడా "చరణౌ శరణం ప్రపద్యే" అని ఉన్నది. (చరణౌ– అంటే, రెండు పాదాలు అని అర్థం. శరణం అంటే, రక్షకంగా ఉపాయంగా అని అర్థం) దీనికి సమాధానాన్ని కొంచెం ఆలోచిద్దాం.

"ఉలగముళంద పొన్నడియే ఆడైందు ఉయ్ న్దేన్" లోకాలను కొలిచిన బంగారు పాదాలను ఆశ్రయించి ఉజ్జీవించాను) " నాగణై మిశై నంబిరాన్ చరణే శరణ్" (ఆదిశేషునిపై శయనించిన మన స్వామి చరణాలే మనకు శరణం), " లోకవిక్రాంతచరణౌ శరణం తే౽ వ్రజం విభో! " (స్వామి లోకాల లో అంతటా వ్యాపించిన నీ రెండు పాదాలను శరణు పొందాను) అని ఈ విధంగా శరణాగతిని చేసే సందర్భాలలో అంతటా కూడా ఆ శరణాగతి భగవంతుని శ్రీపాదాలలోనే చేస్తున్నట్లు కనిపిస్తుంది. ప్రపన్నులమైన మనకు ముఖ్యమైనది శరణాగతియేకదా. ఆ శరణాగతి అనేది శ్రీచరణాలలో చేయవలసి ఉన్నందున, ఆ విధంగా అందరూ శ్రీచరణాలనే ముఖ్యంగా పలుకుతున్నారు. ఇది మొదటి విషయం.

"అడియేన్ "అని మనలను నిర్దేశించుకుంటాము. "మనం అందరం భగవంతునకు దాసులము" అని మనలను చెప్పుకుంటాము. " అడియేన్ "అంటే ఏమి? అడిలో (పాదాలలో) వాలేవాడు, పాదాలకు సేవలు చేసేవాడు– అని అర్థం. "అడియేన్ "అనే పదం సిద్ధించాలన్నా, ప్రయోజనం కలిగినది కావాలన్నా, పాదాలలో పడినప్పుడే అది సిద్ధిస్తుంది. ఇది రెండవ విషయం. కనుక, " అడియేన్ "అనే పదానికి, పాదాలకు ఈ విధంగా అవినాభావ సంబంధం ఉన్నది.

ఒక తల్లి ఉన్నది. ఆమె దగ్గర పాలను తాగే చంటి బిడ్డ ఉన్నది. తల్లి, తన బిడ్డకు చాలా సన్నిహితమైనది, ఇష్టమైనది అయినప్పటికీ, మన పూర్వాచార్యులు చంటి బిడ్డను నిర్దేశించేటప్పుడు ", స్తనంధయప్రజ" అని అంటారు. తల్లి దగ్గర పాలను తాగే బిడ్డకు, తనకు ఆ పాలు ఆ తల్లి శరీరంలో ఏ భాగంలో లభిస్తుందో అక్కడే మిక్కిలి అభినివేశం ఉంటుంది. ఆ విధంగానే, మనం కూడా ఏ జ్ఞానం లేని చంటి బిడ్డలంవంటివారం. మనం కోరే రక్షణ దేనినుండి లభిస్తుందో, , దాని పట్ల మనకు మిక్కిలి అభినివేశం ఉంటుంది. " విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః" అని అంటూ వేదంలో భగవంతుని శ్రీచరణాలనుండి మధుప్రవాహం స్రవిస్తున్నదని. అదే శరణాగతునకు ముఖ్యమైనది అని చెప్పబడుతున్నది. ఈ మధుప్రవాహం ఏది? అంటే, అది ఆ భగవంతుని కృపాప్రవాహమే. అదే కదా మనకు రక్షకం, ఉజ్జీవకం అవుతున్నది. పరమాచార్యులైన యామునులు కూడా " తవామృతస్యందిని పాదపంకజే నివేశితాత్మా కథ మన్యదిచ్ఛతి" (స్వామీ! అమృతాన్ని స్రవించే నీ పాదపద్మాలలో ఆసక్తిని కలిగిన మనస్సు కలవాడు వేరొక ఏ విషయాన్ని ఇష్టపడతాడు కనుక! ) అని అన్నారు. తల్లి తన బిడ్డకు పాలను ఇచ్చే చోటు ఆ బిడ్డకు ఉద్దేశ్యం అయినట్లుగా, , భగవంతుని కృప వెలువడే స్థానం అయిన శ్రీచరణాలు మనకు మిక్కిలి ఉద్దేశ్యం, రక్షకం మనకు ఆశ్రయించటానికి తగిన చోటు. ఇది మూడవ విషయం.

ఇక, చివరి విషయం ఏమంటే, భగవంతుని దివ్యావయవాలలో ఒక్కొక్క దివ్యాంగం ఒక్కొక్క గుణాన్ని వ్యక్తం చేస్తుంది. మనం, భగవంతుని శరణాగతి చేయాలి అని ప్రయత్నించినప్పుడు, మనం అంతకు ముందు చేసిన దోషాలను చూచి మనం భయపడకుండా ఉండేటట్లు ఆ స్వామి అభయహస్తం చేస్తుంది. "అంజేల్ ఎన్ఱు కైకవియాయ్" ("భయపడవద్దు" అని నీ అభయహస్తాన్ని చూపించు) అని అన్నారు, ఆళ్వారులు కూడా. ఈ విధంగా వాత్సల్య గుణాన్ని భగవంతుని అభయముద్రను కలిగిన కుడి చేయి ప్రదర్శిస్తున్నది. భగవంతుని ఉన్నతమైన కిరీటం " భగవంతుడే నీకు స్వామి నీవు ఆ స్వామి సొత్తు. నీవు అతనికి దాసుడవు. నిన్ను ఏనాడు అతడు విడచిపెట్టడు. తప్పక కాపాడతాడు" అని తెలుపుతుంది. సొత్తుదారుడు తన సొత్తును ఏనాడు విడిచిపెట్టడు కదా. ఆ విషయాన్ని మనం భగవంతుని కిరీటం ద్వారా గ్రహించవచ్చు తరువాత, "భగవంతుడు చాలా పెద్దవాడు, మనం చాలా చిన్నవారం, మనం ఆ స్వామి దగ్గరకు ఏ విధంగా చేరగలం? "అని మనం సందేహ పడినప్పుడు, భగవంతుని చిరునవ్వు ఆ సందేహాన్ని తీర్చి, అతని దగ్గరకు మనలను చేరుస్తుంది. భగవంతుడు మనలను చూసి మందహాసం చేస్తాడు. ఆ మందహాసం మనకు ఏమి తెలుపుతుంది? అంటే, " నేను

నీవాడను కదా! నీకు స్నేహితునివంటి వాడను" అనే భావాన్ని భగవంతుడు తన చిరునవ్వుతో తెలియజేస్తాడు. ఇక చివరిగా, మనం ఆ స్వామిని ఆశ్రయించాలంటే ఆ స్వామిలో మనం సౌలభ్యాన్ని దర్శించగలగాలి. అప్పుడే మనం ఆ స్వామి దగ్గరకు సులభంగా చేరగలం. అటువంటి సౌలభ్య గుణాన్ని భగవంతుడు తన శ్రీచరణాల ద్వారా తెలియజేస్తాడు. ఆ గుణాన్ని మన దర్శించినప్పుడే మనం ఆ స్వామిని ఆశ్రయించగలం. ఆళ్వార్లు ఒక పాశురంలో " తిణ్ కழల్ శేరే" అని అన్నారు. భగవంతుడు ఒక వేళ మనలను విడిచి పెట్టినప్పటికీ, ఆ స్వామి శ్రీచరణాలు మాత్రం మనలను ఏనాడూ విడచిపెట్టవు. అటువంటి దృఢమైన స్వభావాన్ని కలిగినవి –అని ఈ సూక్తి ద్వారా ఆళ్వారులు తెలియజేశారు. భగవంతుడు ఏనాడూ తన భక్తులను విడచిపెట్టని అచ్యుతుడు. ఒకవేళ అతడు విడచిపెట్టినప్పటికీ, లక్ష్మీదేవి విడచిపెట్టదు. ఆమె కూడా ఒకవేళ విడిచిపెట్టినప్పటికీ, స్వామి శ్రీచరణాలు మాత్రం మనలను ఏనాడు విడిచిపెట్టవు– అని అంటున్నారు, ఆళ్వార్లు. భగవంతుడు తాను వేంచేసి ఉండే ఆసనపద్మంలో తన శ్రీపాదాలను దృఢంగాఊని ఉన్నాడు. ఆ విధంగా, గట్టిగా తన పాదాలను ఉండడంలో ఏమి తాత్పర్యం? అంటే, "ఏ సమయంలోను ఈ చరణాలు నిన్ను విడిచిపెట్టవు "అని తెలియజేయడమే. ఈ విషయమే మనకు భగవంతుని శ్రీచరణాలను సేవించినప్పుడు గోచరిస్తుంది. లోకంలో "తప్పక రక్షిస్తారు" అనే అర్థాన్ని చెప్పడం కోసం "ఎవరిని చేయి విడువరు" అనే ఒక ప్రయోగాన్ని చేసే అలవాటు ఉన్నది. ఎందుకంటే, సహాయం చేయడం అనేది చేతితోనే కదా. కానీ, భగవంతుని విషయంలో అయితే, దీనిని వేరు విధంగా చెప్పవలసి ఉన్నది. "భగవంతుని చేయి ఎవరినీ విడచిపెట్టదు " అని కాకుండా, " భగవంతుని శ్రీ చరణం ఎవరిని విడిచిపెట్టదు" అని చెప్పాలి. ఎందుకంటే, భగవంతుడు తన శ్రీపాదాలతో కదా ప్రపన్నులను రక్షిస్తాడు. అందువల్ల భగవంతుని శ్రీచరణాలు ఎవరిని విడచిపెట్టవు, తప్పక రక్షిస్తయి–అని ఆళ్వార్ల సూక్తి.

ఈ విధంగా భగవంతుని దివ్యమంగళ విగ్రహం అంతా మనకు ప్రాప్యమై ఉన్నప్పటికీ, ఆ రూపంలో ఉండే శ్రీచరణాల విషయంలో మనం మిక్కిలి భక్తిని, అభినివేశాన్ని ప్రదర్శిస్తాము. ఇదే భగవంతుని శ్రీపాదాలకు కల ప్రాముఖ్యం. స్వస్తి.



# 5. మాధవనామవైభవమ్

"దేవో నామసహస్రవాన్", " ఆయిరమ్ పేరుడైయాన్" అని భగవంతుడు సహస్రనామాలను కలిగినవాడుగా కీర్తింపబడుతున్నాడు. ఇక్కడ సహస్రపదం "అనేకం" అనే అర్థాన్ని చెబుతుంది తప్ప, కేవలం వేయి అనే అర్థాన్ని చెప్పదు. అందువల్ల భగవంతుడు లెక్కలేనన్ని పేర్లను కలిగినవాడు. అటువంటి భగవంతుని నామాలలో మాధవ నామం ఒకటి. ఈ నామంలో ఉండే కొన్ని విశేషాలను ఇప్పుడు అనుసంధానం చేసికొందాం.

మాధవ నామానికి అనేకమైన అర్థాలు ఉన్నాయి. అందులో కొన్ని ఆశ్చర్యాన్ని కలిగించేవి, మధురమైనవి కూడా ఉన్నాయి. మా అని లక్ష్మీదేవికి పేరు. ధవః అంటే, పతి అని అర్థం. మాధవః అంటే, లక్ష్మీదేవికి పతి అని అర్థం. " మాధవనెన్నెన్ను ఓదవల్లీరేల్ తీదొన్నుమడైయా ఏదమ్ శారావే" అని ఆళ్వార్లు మాధవ నామానుసంధానవైభవాన్ని తెలియజేశారు. " మాధవః "అనే నామాన్ని ఉచ్చరిస్తే చాలు, ఏ విధమైన చెడులు మనను చేరవు. దోషాలు అంటవు– అని ఈ అళ్వార్ల సూక్తిలోని తాత్పర్యం.

మా అంటే విద్య. ఉపనిషత్తులలో భగవంతుని పొందడానికి ప్రధానంగా 32 బ్రహ్మ విద్యలు చెప్పబడ్డాయి. ఇవి అన్నీ ఉపాసనా మార్గాలు, భక్తిమార్గాలు. దహర విద్య, శాండిల్య విద్య, అంతరాదిత్య విద్య, సద్విద్య –అని ఈ విధంగా ఇవి చాలా ఉన్నాయి. ఇవి మా అనే శబ్దంచేత చెప్పబడతాయి. అటువంటి బ్రహ్మవిద్యలకు స్వామి అయినవాడు, కనుక, మాధవః అని చెప్పబడుతున్నాడు. భగవంతుడు వీటిని తన శిష్యుల ద్వారా లోకంలో ప్రచారం అయ్యేటట్లు చేస్తున్నాడు. ఈ విధంగా బ్రహ్మవిద్యలకు అధిపతి, వాటిని లోకంలో పలువురి ద్వారా ప్రచారం చేయిస్తున్నాడు కనుక, భగవానుడు మాధవుడు అవుతున్నాడు. ఈ అర్థంలో మా శబ్దానికి లక్ష్మి అని అర్థం కాకుండా, వేరే అర్థం చెప్పబడింది.

ఇక, మూడవ అర్థాన్ని గమనిద్దాం. " మౌనాత్ ధ్యానాచ్చ యోగాచ్చ" అని ఈ మాధవ నామం మూడు విధాలుగా వివరింపబడింది. మా అనేది మౌనాన్ని తెలుపుతుంది. ఇక్కడ మౌనం అంటే పూర్తిగా మాట్లాడకపోవడం –అని అర్థం కాదు చాలా పరిమితంగా మాట్లాడడం– అని అర్థం. ఎల్లప్పుడూ మాట్లాడుతూ ఉంటే, ఆ విధంగా మాట్లాడే మాటలకు విలువ ఉండదు కదా. రహస్యాలను భద్రంగా కాపాడడం కోసం ఈ విధంగా పరిమితంగా మాట్లాడడం –అనే ఈ మౌనం పనికి వస్తుంది. భగవంతుడు దీర్ఘంగా మాట్లాడినట్లు మనకు ఎక్కడ కనిపించదు, ఒక్క భగవద్గీతను ఉపదేశించిన సందర్భంలో

తప్పు. నోరు తెరచి పలికితే ఏదో ఒక వరాహ చరమ శ్లోకం, శ్రీరామచరమ శ్లోకం, ద్వయ మంత్రం, తిరుమంత్రం, అంతే.

రెండవది ధ్యానం. ధ్యానం అంటే, ఇక్కడ, తన గొప్పతనాన్ని తాను మననం చేస్తూ ఉండడం. "ఆత్మానం వాసుదేవాఖ్యం చింతయన్" అని ఈ విషయం శాస్త్రాలలో చెప్పబడింది. లేక, " ఏ విధంగా ఈ జగత్తును రక్షించాలి? "అనే యోగచింతన. "ఉఱంగువాన్ పోల్ యోగు శెయ్ ద పెరుమాన్ " అని ఆళ్వార్లు అన్నారుకదా, ఈ విధంగా తన కళ్యాణ గుణాలను గూర్చి, జగద్రక్షణనుగూర్చి ఎల్లప్పుడూ భగవంతుడు ధ్యానంలో ఉంటాడు. భగవంతుడు ఆదిశేషునిపై నిద్రిస్తూ ఉన్నట్లు కనిపిస్తాడు. కానీ, వాస్తవానికి నిద్రించడు. ఎల్లప్పుడూ జగద్రక్షణ చింతననే చేస్తూ ఉంటాడు. ఇది ధ్యానం.

ఇక, మూడవది యోగం. యోగం అంటే, అనుష్ఠానం, ఆచరణ. కర్మయోగం జ్ఞానయోగం, భక్తియోగం– ఇవన్నీ చేసే ప్రయత్నాల ప్రకారాలుకదా. భగవంతుడు ఈ జగత్తును రక్షించడం కోసం ప్రయత్నాలను చేస్తూ ఉంటాడు. ఈ లోకంలో మనలను అనేక విధాలైన ఆపదల నుండి కాపాడడం కోసం, జన్మ పరంపరనుండి విముక్తిని పొంది, పరమపదాన్ని పొందడం కోసం భగవంతుడు చేసే ప్రయత్నాలు ఇక్కడ యోగం అని చెప్పబడుతున్నాయి. భగవానుడు సృష్టి ఆరంభంలో ఈ జగత్తును సృష్టిస్తున్నాడు. ప్రలయకాలంలో తనలో పెట్టుకుని దాస్తున్నాడు, మళ్ళీ, కొంతకాలం తర్వాత సృష్టిస్తున్నాడు. శాస్త్ర ప్రదానాన్ని చేస్తున్నాడు. ఈ లోకంలో ఎన్నో విధాలైన అవతారాలను ఎత్తుతున్నాడు. ఇవి అన్ని భగవంతుడు చేసే యోగాలు, అంటే, ప్రయత్నాలు.

మౌనం, ధ్యానం, యోగం– అనే ఈ మూడు చేరి ఉన్నందువల్లనే మాధవః అనే ఒక విలక్షణమైన పేరు భగవంతునకు కలిగింది. ఈ విధంగా మాధవ నామానికి లక్ష్మీదేవికి ప్రభువు అని, ఉపాసనా మార్గాలు అయిన బ్రహ్మ విద్యలను ఉపదేశించి, వానిని లోకంలో ప్రచారం చేసేవాడై, వాటికి ప్రభువై ఉండేవాడు అని, మౌనం, ధ్యానం, యోగం అనే ఈ మూడు చేరి ఉన్నవాడు అని, ఈ విధంగా ఉండే వివిధమైన, విలక్షణమైన అర్థాలను మాధవ నామం తెలుపుతున్నది.

కేశవాది ద్వాదశ నామాలలో మాధవ నామం కూడా ఒకటి. ఈ విధంగా పలు విధాలైన, అందమైన అర్థాలను కలిగిన. మాధవ నామంచేత కీర్తింపబడే ఆ స్వామి మనలను ఎల్లప్పుడూ రక్షించాలి.

★★★★★

# ౬. దశరథుడు అరణ్యాలకు పోకుండా ఎందుకు ప్రాణాలను వదిలి పెట్టాడు?

శ్రీరాముడు సీతతో, లక్ష్మణునితో పాటుగా అరణ్యాలకు వెళ్లాడు. అప్పుడు భరతుడు, శత్రుఘ్నుడు అయోధ్యలో లేరు. వారు కేకయ దేశంలో మేనమామ యుధాజిత్తు గృహంలో ఉన్నారు. అందుచేత వారు శ్రీరామునితో పాటు అరణ్యాలకు పోయే ప్రసక్తి లేకుండా పోయింది. శ్రీరాముని విషయంలో అంతు లేని ప్రేమను కలిగి ఉండేవాడుకదా, దశరథుడు. అతడు శ్రీరాముని విడచి ఉండలేనివాడు అయినప్పుడు, శ్రీరాముడు అరణ్యాలకు వెళ్ళేటప్పుడు అతనితో పాటు అరణ్యాలకు ఎందుకు వెళ్ళలేదు? ఆ పని చేయడం మానివేసి, అయోధ్యలోనే ఉండి, శ్రీరాముని విశ్లేషం వల్ల భరించలేని బాధను అనుభవి, చివరకు ప్రాణాలను వదిలిపెచ్చాడే. ఈ విధంగా చేయడం వల్ల ఎవరికి లాభం? భరతనకు పట్టాభిషేకం, రామునకు వనవాసం– అని అంతవరకే కదా, కైకేయి వరాలను అడిగింది. దశరథుడు అయోధ్యలో ఉండాలని ఆమె పట్టు పట్టలేదే. అటువంటప్పుడు, దశరథుడు శ్రీరామునితో పాటు అరణ్యాలకు పోయి ఉండవచ్చు కదా. – అనేది ఒక ప్రశ్న. దీనిని కొంచెం గమనించి చూద్దాం.

దశరథుడు ఆ విధంగా అరణ్యాలకు శ్రీరామునితో పాటు వెళ్లే అవకాశం లేదు. దీనికి కొన్ని కారణాలు ఉన్నాయి. మొదటి కారణం రాజ్యం. ప్రభువుల మొదటి బాధ్యత రాజ్యపాలన. ప్రజలు, రాజ్యం–అనే వీటి రక్షణను గమనించవలసిన బాధ్యత ప్రభువుపై ఉన్నది. శ్రీరాముడు అరణ్యాలకు పోయే సమయానికి దశరథుడు ఇంకా ప్రభువే. శ్రీరామునకు యువరాజ్య పటాభిషేకం చేయబడలేదు. శ్రీరామునకు యువరాజ్య పట్టాభిషేకం చేయబడి ఉంటే, దశరథుడు తాను స్వతంత్రంగా అరణ్యాలకు పోవాలనే నిర్ణయాన్ని తీసుకుని ఉండవచ్చు. కానీ, ఆ విధంగా శ్రీరాముని యువరాజ్యపట్టాభిషేకం జరగలేదు. ఇంతలోగానే ఆ ప్రయత్నానికి ఆటంకం ఏర్పడింది. అందుచేత ఇంకా దశరథుడు కోసల దేశానికి ప్రభువై ఉన్నందువల్ల, అతడు రాజ్యాన్ని వదిలిపెట్టి ఏ విధంగా అరణ్యాలకు వెళ్ళగలడు?

రామ విరహంలో ప్రాణాలను వదిలిపెట్టకుండా ధరించడం అనేది దశరథునకు సాధ్యం కాదు, కానీ, శ్రీరామునితో అరణ్యాలకు వెళ్లడం అనేది దశరథునకు సాధ్యమైన పనియే కదా? అని అనలేము. ఆ విధంగా చేస్తే, రాజ్యంలో అంతా అరాచకం ఏర్పడుతుంది.

ఈ ప్రశ్నను ఇంకొక కోణంలో కూడా గమనించి చూడవచ్చు. వానప్రస్థం అనే ఆశ్రమానికి ఆ కాలంలో రాజులు వెళ్ళే అలవాటు ఉన్నది. వారు పత్నీసమేతులై అరణ్యాలకు వెళ్లి అక్కడ మునుల వలె కందమూలాలను తిని, తపస్సుతో కాలం గడుపుతారు. దశరథుడు ఆ విధంగా వానప్రస్థాశ్రమాన్ని స్వీకరించి, అరణ్యాలకు వెళ్లి ఉండొచ్చు కదా. శ్రీరాముడు, సీత, లక్ష్మణుడు అరణ్యంలో ఉంటారు. వారితో పాటు దశరథుడు కౌసల్య, వానప్రస్థాన్ని స్వీకరించి అడవులలోనే ఉండవచ్చు కదా– అని అంటే, ఆ విధంగా వానప్రస్థానికి పోవాలని అన్నా, ఎవరికో ఒకరికి యువరాజ్యపట్టాభిషేకాన్ని చేసిన తర్వాతనేకదా, ఆ విధంగా వనాలకు పోవడానికి వీలవుతుంది. రాజ్యాన్ని ఎవరికి అప్పగించకుండా వదిలిపెట్టి, ఇష్టం వచ్చినట్లుగా వానప్రస్థానికి పోవడానికి అవకాశం లేదు. ఎవరికో ఒకరికి రాజ్య పరిపాలనా భారాన్ని అప్పగించిన తరువాతనే వెళ్ళాలి. ప్రజల రక్షణ భారాన్ని గాలికి వదిలి పెట్టడానికి లేదు.

ఈ విషయాన్ని వశిష్టుడు కూడా తెలియజేశాడు. శ్రీరాముడు వనవాసానికి వెళ్ళిన తరువాత, అతని విరహాన్ని భరించలేక దశరధుడు మరణించాడు. తరువాత, దశరథుడు మేనమామ ఇంటి నుండి తిరిగి వచ్చాడు. అప్పుడు వశిష్ఠుడు భరతుని చూచి, " భరతా! నీవు పట్టాభిషేకాన్ని చేసుకోవాలి. వెంటనే రాజ్య పరిపాలనా భారాన్ని నీవు స్వీకరించాలి "అని అన్నాడు. భరతుడు అప్పుడు అదిరిపడి, " అది నాకు సాధ్యం కాని పని" అని అన్నాడు. అప్పుడు, " నీవు పట్టాభిషేకం చేసుకోకపోతే రాజ్యం అంతా అరాచకం పాలవుతుంది. ఎందువల్ల అంటే, నీ తండ్రి మరణించాడు. ఎవరో ఒకరు వెంటనే ఈ రాజ్యానికి ప్రభువై పరిపాలన సాగించాలి. లేకపోతే, ఈ రాజ్యానికి ప్రభువు అనేవాడే ఉండడు. రాముడు వనవాసానికి వెళ్ళిపోయాడు. దశరథుడు మరణించాడు నీవు పట్టాభిషేకం చేసుకోకపోతే, ఈ కోసల దేశానికి ప్రభువు అనేవాడే ఉండడు. దేశం అరాచకమైపోతుంది, అనాధ అయిపోతోంది, దిక్కులేనిది అయిపోతుంది. అందువల్ల వెంటనే నీవు పట్టాభిషేకాన్ని తప్పక చేసుకోవాలి", అని వశిష్ఠుడు అన్నాడు.

ఈ విధంగా, మనం ఈ మూడు కోణాల నుండి గమనించి చూసినా, వీరి దృష్టి అంతా దేనిలో ఉన్నది? రాజ్యం, రాజ్యపరిపాలన, ప్రజల క్షేమం, భద్రత –అనే వీటి మీద

ఉన్నది. ఈ విషయాల పైననే వీరికి దృష్టి ఉన్నది. అందుచేత, దశరథునకు శ్రీరాముని విషయంలో ఎంతో ప్రేమ ఉన్నప్పటికీకూడా, అతడు రాజ్యాన్ని వదిలిపెట్టి, అరణ్యాలకు వెళ్లే అవకాశం లేదు.

మరి ఒక విషయం. తండ్రి అనే దృష్టిలో గమనించి చూసినప్పటికీ, రాముడు వనవాసం చేస్తూ అరణ్యాలలో అనేక విధాలయిన క్లేశాలను అనుభవించడాన్ని చూడడం అనేది దశరథునకు సాధ్యం అవుతుందా? దశరథుడు శ్రీరాముని వెంటనే అరణ్యాలకు పోయి అతనికి సహాయం చేసి ఉండవచ్చు కదా– అని మనకు తోస్తుంది. శ్రీరాముడు అరణ్యంలో ఉన్నాడు– అనే భావనయే దశరథునకు కల ఉండే శక్తి అంతా అదృశ్యమైపోవడానికి కారణమైనది. కాళ్లు కూడా కదపలేని శక్తిహీనత అతనికి ఏర్పడింది. ప్రేమ అనేది పరిమితంగా ఉంటే, ఆ విధంగా దశరథుడు శ్రీరాముని వెంట అరణ్యాలకు పోయి, సహాయం చేసే అవకాశం ఉన్నది. కానీ, దశరథనకు కల ప్రేమ అపారమైనది, అందువల్ల, " శ్రీరాముడు అరణ్యాలకు వెళుతున్నాడు" అనే భావనయే దశరథునిలోని శక్తిని అంతటిని పోగొట్టింది. " పాలాழி నీ కిడక్కుమ్ పణ్బై యామ్ కేట్టేయుమ్ కాలాழுమ్, నెంజழியుమ్, కణ్ శుழలుమ్" (పాలసముద్రంలో నీవు శయనించి ఉండే సన్నివేశాన్ని నేను వింటే చాలు, నా కాళ్లు తడబడతాయి, నా మనసు ద్రవిస్తున్నది, నా కళ్ళు తిరుగుతున్నాయి) అని అన్నారు, ఆళ్వార్లు. "నీవు పాలసముద్రంలో శయనించి ఉన్నావనే సంగతిని నేను విన్నాను. " పరమపదంలో ఉండవలసినవాడివి నీవు ఎక్కడ ఉన్నావు? ఎవరి కోసం ఉన్నావు? మా రక్షణ కోసంకదా నీవు ఈ విధంగా కిందకు దిగివచ్చి పరుండి ఉన్నావు! " అని నేను భావించగానే, నేను కదలను కూడా కదలలేకపోయాను. నా కాళ్లు తడబడ్డాయి. నా కళ్ళు తిరుగుతున్నాయి. నా మనసు నీరైపోతున్నది" అని అంటున్నారు, అళ్వార్లు. అటువంటి దశయే కదా ఇప్పుడు దశరథునకు ఏర్పడింది. అందువల్ల శ్రీరాముని వెంట దశరథుడు అరణ్యాలకు వెళ్లలేకపోయాడు. అయోధ్యలోనే ఉండిపోయి, శ్రీరామవిశ్లేషంతో కృంగి కృశించి ప్రాణాలను విడిచాడు. అందువల్లనే దశరథుడు శ్రీరాముని వెంట అరణ్యాలకు వెళ్ళలేకపోయాడు.

★★★★★

# 7. ఈ సుడులలో చిక్కుకుంటే———?

తీరాన్ని కూలుస్తూ నదీప్రవాహాలు ప్రవహించడాన్ని మనం కొన్నిచోట్ల, కొన్ని సందర్భాలలో చూస్తూ ఉంటాం. సముద్రం చాలా విశాలమైనది, లోతైనది అయినా, దానికి కూడా తీరం ఉంటుంది. ఆ సముద్రం కూడా కొన్ని సమయాలలో తీరాన్ని దాటి, దానిని కూల్చి ప్రవహించడాన్ని చూస్తూ ఉంటాం. ఆ విధంగానే, నదులలోని నీరు కూడా పొంగి పొర్లి, తీరాన్ని దాటి, ప్రవహించడాన్ని కూడా గమనిస్తాము. ఈ సన్నివేశం మనకు వర్షాకాల సమయాలలో సాధారణంగా కనిపిస్తుంది. ఈ సమయాలలో సముద్రాలలో, నదులలో సుడులు ఏర్పడడం నకూడా మనం చూస్తూ ఉంటాము.

ఇటువంటి సన్నివేశాన్నే భగవంతుని విషయంలో భావన చేద్దాం. శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రంలో భగవానుని వైభవాన్ని తెలియజేసే "అనుకూలః, శతావర్తః" అనే రెండు రెండు గొప్ప నామాలు ఉన్నాయి. "అనుకూలః" అంటే ఏమి?, లోకంలో ఈ పదానికి ఏమి అర్థం? ఇతడు మనకు అనుకూలమైనవాడు అంటే, కావలసినవాడు– అని అర్థం. దీనికి వ్యతిరేకమైన పదం ప్రతికూలుడు. అంటే, మనకు కానివాడు –అని అర్థం.

కానీ, భగవంతుని విషయంలో ఒక విలక్షణమైన, అద్భుతమైన అర్థం అనుకూల నామానికి ఉన్నది. కూల మంటే ఒడ్డు. కూలంకషం అంటే ఒడ్డును ఒరసుకొనేది, ఒడ్డును కూల్చేది –అని కదా అర్థం అందువల్ల అనుకూలం అంటే, ఒడ్డుకు అనుకూలమైనది, ఒడ్డుకు లోబడి ఉండేది– అని అర్థం. ఎంత ఎక్కువగా ప్రవహించినప్పటికీ, ఈ ప్రవాహం ఒడ్డును దాటనిది అని తెలిస్తే, మనం మనసులో నెమ్మదిగా ఉండవచ్చు.

భగవంతునకు కల మహిమలు అంతు లేనివి. సముద్రాలవలె, మహానది ప్రవాహాల వలె విశాలమైనవి లోతైనవి. ఆ వేగంగా ప్రవహించేవి. అవి ఒడ్డును దాటడానికి ఎంతసేపు పడుతుంది? కానీ, అవి సామాన్యంగా ఒడ్డును దాటవు. ఇక్కడ ఒడ్డు ఎవరంటే, భక్తులే, భగవద్భక్తులే. తీరం వంటి భక్తులను భగవంతుడు ఏనాడూ, తనకు ఎన్ని గొప్ప మహిమలు ఉన్నప్పటికీ కూడా, దాటుతాడా? అతిక్రమించి వర్తిస్తాడా? ఏ నాడు భక్తులను దాటి అతిక్రమించి వర్తించడు. ఈ విధంగా భగవంతుని విషయంలో అనుకూలుడు అంటే, భక్తుల అనే తీరాన్ని దాటనివాడు. భక్తులు అనే తీరాన్ని సముద్రంవంటి భగవానుడు తాకుతో ఎల్లప్పుడూ ప్రవహిస్తూ ఉన్నప్పటికీ, ఆ భక్తులను అతిక్రమించి వర్తించడు, అందుచేత అనుకూలుడు.

భగవద్గుణ దర్పణం అనే సహస్రనామ వ్యాఖ్యానంలో శ్రీ పరాశర భట్టర్ ఈ నామాన్ని "నిసర్గమహత్వేన విస్మయమదమాన వర్ణనాత్ అనుద్వేలః"– అని వివరించారు. ఈ వివరణలోని తాత్పర్యం ఏమంటే, సహజ సిద్ధమైన గొప్పతనం చేత అహంకారం, మదం, మానం మొదలైన దుర్గుణాలతో పొంగిపోకుండా, భక్తులను అనుసరించి ఉండేవాడు. కనుక, అనుకూలుడు అనబడుతున్నాడు అని తాత్పర్యం. సముద్రం ఉప్పొంగినా, ఒడ్డును దాటకుండా ఉండేటట్లే, పరమాత్మ కూడా ఔద్ధత్యాన్ని లేకుండా ఉంటాడు– అని ఈ అనుకూల శబ్దానికి వ్యుత్పత్తిని భట్టర్ తెలియజేశారు. దీనికి ఉదాహరణగా వారు, యశోదా దేవికి కట్టడానికి, కొట్టడానికి వీలుగా శ్రీకృష్ణుడు ఉంటూ, ఆ స్వామి చేసిన లీలను ప్రస్తావించారు. పూదత్తాళ్వార్లు తమ తిరువందారిలో ఈ లీలను " ఆయ్ చ్చి క్కయిற்றினాల్ కట్ట తాన్ కట్టుండిరుందాన్" (91) (యశోదా దేవి దారంతో కట్టగా, తాను ఆ కట్టుకు కట్టుబడి ఉన్నాడు) అని అభివర్ణించి ఆనందించారు ఈ లీలలోనే నమ్మాళ్వారులు కూడా ఆరు నెలల కాలం మోహాన్ని పొందారు.

భగవంతుడు ఎన్నో విధాలైన అతిశయాలను కలిగి ఉన్నాడు. లోకానికి అంతటికి కారణమైనవాడు, అన్నిటినీ సృష్టించేవాడు, నియమించేవాడు, అంతటా వ్యాపించి ఉండేవాడు, అంతు లేని కళ్యాణ గుణాలను కలిగినవాడు అని ఈ విధంగా ఎన్ని విధాలైన గొప్ప గొప్ప అతిశయాలను అతడు కలిగి ఉన్నప్పటికీ కూడా, అతడు భక్తులను అతిక్రమించి ప్రవర్తించడు. ఇందువల్ల ఆ స్వామికి ఒక మధురమైన క్లేశం కలుగుతుంది.

ఈ విషయాన్ని మనకు తరువాతి నామం అయిన "శతావర్తః" అనే నామం తెలుపుతున్నది. శతమంటే నూరు, అంటే, అనేకం అని అర్థం. ఆవర్తం అంటే సుడి. భగవంతునిలో వందలాది సుడులు ఉన్నాయట. నదులలో, ప్రవాహాలలో మాత్రమే మనకు సుడులు గోచరిస్తాయి, కానీ, భగవంతునిలో కూడా సుడులు ఉంటాయా? అనే సందేహం ఎక్కడ మనకు కలుగవచ్చు. అయితే, భగవంతుని విషయంలో కలిగే సుడులు అంటే ఏమి? అనే విషయాన్ని ముందు గమనించాలి.

సుడులు ఏర్పడడానికి అనేక విధాలైన కారణాలు ఉంటాయి. వాటిలో ఒకటి, అంతు లేని పరిమితిని కలిగిన అమితమైన వేగాన్ని కలిగిన నదీ ప్రవాహం ఇరుకైన దారిలో ప్రవహించడం. విశాలమైన దారిలో ఎంతటి నీరు కలిగిన, ఎంతటి వేగాన్ని కలిగిన ప్రవాహం ప్రవహించినప్పటికీ కూడా, ఆ ప్రవాహంలో సుడులు కలుగవు. కానీ, దాని మార్గం కొన్నిచోట్ల ఎక్కడైనా సంకోచాన్ని పొందితే, చిన్నది అయిపోతే, అప్పు ఆ ప్రవాహంలో

సుడులు ఏర్పడతాయి. అంతటి పరిమితిని కలిగిన నీరు, అంత వేగంగా ప్రవహించే నీరు చిన్న దారిలో ప్రవహించవలసి వచ్చినప్పుడు ఒత్తిడి ఎక్కువై, దాని కారణంగా దానిలో సుడులు ఏర్పడతాయి.

ఆ విధంగానే, సముద్రం వంటి భగవంతుని మహిమలు చాలా నీటిని కలిగిన, వేగాన్ని కలిగిన ప్రవాహాలవంటివి. అవి మహా వేగంగా, మితి లేని విధంగా ప్రవహిస్తూ ఉంటే, వాటిని అనుభవించడానికి, ఆనందించడానికి ఎవరికి సాధ్యం అవుతుంది? కాదు కదా. అటువంటి స్వామి దగ్గరకు చేరడానికి ఎవరికి సాధ్యం అవుతుంది? అందువల్ల, ఆ మహిమలను భక్తులు సుఖంగా అనుభవించడానికి వీలుగా ఆ స్వామిలోనే కొన్ని గుణాలు ఉన్నాయి. సౌశీల్యం, సౌలభ్యం, కరుణ, క్షమ, భక్తులలోని తారతమ్యాలను గమనించని స్వభావం, దోషాలను గుణాలు గా గ్రహించే వాత్సల్యం, ఈ విధంగా భగవానుని సౌలభ్యానికి అనుకూలమైన ఎన్నో గుణాలు ఉన్నాయి. ఇవి భగవంతుని మహిమలు అనే ప్రవాహాలు ప్రవహించే చిన్న చిన్న దారులు. ఈ విధంగా ఉండే దయ, క్షమ, వాత్సల్యం మొదలైన గుణాలు ఎటువంటివి? అంటే, చాలా విశాలంగా, అమితంగా ప్రవహించే భగవంతుని మహిమలు అనే ప్రవాహాలు ప్రవహించే చిన్న చిన్న దారులు. భగవంతునకు పరత్వాన్ని నిరూపించే జగత్కారణత్వం, సర్వ నియంతృత్వం, సర్వవ్యాపిత్వం మొదలైన ఎన్నో విధాలయిన, గొప్ప అతిశయాన్ని కలిగిన గుణాలు ఉన్నాయి. కానీ, అవి అన్నీ ఏ విధంగా భక్తుల దగ్గరకు వచ్చి చేరుతాయి? ఆ స్వామిలో సౌలభ్యాన్ని నిరూపించే గుణాలు ఉన్నప్పుడే కదా, అవి భక్తుల దగ్గరకు వచ్చి చేరే అవకాశం ఉన్నది. అందువల్ల, ఈ సౌలభ్యం, సౌశీల్యం, కరుణ మొదలైన చిన్నదారుల వంటి గుణాలు అన్నీ తమ ద్వారా అమితమైన వేగాన్ని పరిమితిని కలిగిన, పరత్వాన్ని నిరూపించే గుణ ప్రవాహాలను తమ ద్వారా భక్తులకు అందేటట్లుగా చేస్తాయట. అప్పుడు భగవంతుని పరత్వ గుణాత్మకమైన మహా ప్రవావం అంతా సౌలభ్యాధి గుణాలు అనే చిన్న మార్గాలలో ప్రవహించే స్థితి ఏర్పడుతుంది. అప్పుడే అవి మన వంటి సామాన్యుల దగ్గరకు వచ్చి చేరగలవు. వాటిని మనం గ్రహించి ఆనందించగలం. ఆ విధంగా ఆ గుణ ప్రవాహాలు చిన్న దారిలో ప్రయాణం చేసినప్పుడు, భగవంతుడనే ఆ మహాసముద్రంలో ఎన్నో సుడులు ఏర్పడతాయట.

నదులలో, సముద్రాలలో ఏర్పడే సుడులలో చిక్కుకుంటే వాటి నుండి బయటకు రావడానికి సాధ్యం అవుతుందా? కాదు కదా. ఆ విధంగా సుడులలోనే చిక్కుకొని అక్కడే ఉండిపోవడం తటస్థిస్తే, ఏమవుతుంది? పెద్ద ప్రమాదమే సంభవిస్తుంది కదా. అయితే, భగవంతుని విషయంలో ఈ స్థితి వేరు. భగవంతుడు అనే మహా సముద్రంలో ఏర్పడే

సుడులలో మనం చిక్కుకుంటే కూడా, బయటకు వచ్చే అవకాశం లేదు. అంతేకాదు, వాటినుండి బయటకు రావలసిన ఆవశ్యకత లేనే లేదు. ఆ సుడులలోనే చిక్కుకొని, భగవద్గుణ వైభవాన్ని అనుభవిస్తూ, అక్కడే ఆనందంగా ఉండి పోవచ్చు. కూరేశులు "సౌందర్యాఖ్యా సరసి " అని మొదలయ్యే శ్లోకంలో భగవంతుని సౌందర్యం అనే నదిలో ఏర్పడే సుడులను గూర్చిన ప్రస్తావన చేశారు. ఈ విధంగా అనేక విధాలైన, వందలాది సుడులను కలిగి ఉండేవాడు, భగవంతుడు– అనే అర్థాన్ని "శతావర్తః" అనే నామం తెలియజేస్తున్నది.

"శతావర్తః" అనే ఈ నామాన్ని వివరిస్తూ భట్టర్ " ఆవర్తశబ్దేన ఐశ్వర్య విజృంబితాని లక్ష్యంతే. అతివేలమపి అనువేలీ క్రియమాణ మిద మైశ్వర్యం సంకటగతిక్షోభ సముద్భవత్ సరిదావర్తవత్ విజృంభతే" అని అన్నారు. ఇక్కడ ఆవర్త శబ్దం చేత పొంగిపొర్లే ఐశ్వర్య తిశయాలు చెప్పబడతాయి భగవంతుని ఈ ఐశ్వర్యాలు కట్టలు తెంచుకొని ప్రవహించే పరిమితిలో అతిశయాన్ని కలిగినప్పటికీ, తన భక్తులు అనుభవించడానికి తగినట్లుగా భగవంతునిలో ఇవి ఇముడ్చబడి ఉంటాయి. ఇరుకుగా, దగ్గరగా ఉండే రెండు పర్వతాల మధ్య నుండి అమితమైన నీటి ప్రవాహం ప్రవహించేటప్పుడు, ఆ ప్రవాహానికి చోటుచాలదు కనుక, సంఘర్షణకు లోనై, నీరుపైకి ఎగసి వచ్చి, అందులో సుడులు ఏర్పడతాయి. ఆ విధంగానే, ఇక్కడ స్వామియొక్క అనేక విధాలయిన ఐశ్వర్యాలు సుడులు తిరిగినట్లుగా ఉప్పొంగుతాయి– అని పై వివరణలోని తాత్పర్యం.

భగవంతుడు తన భక్తులు అనే తీరానికి లోబడి ఉంటాడు. అందువల్ల అనుకూలః, . ఆ స్వామికి కల మహిమప్రవాహాలు సౌలభ్యం, సౌశీల్యం మొదలైన చిన్న చిన్న దారులలో ప్రవహించేటప్పుడు, వాటిలో సుడులు ఏర్పడతాయి, కనుక, శతావర్తః. ఈ సుడుల నుండి బయట పడాల్సిన ఆవశ్యకత లేదు. వాటిలోనే నిలచి ఉంది ఆనందాన్ని అనుభవించవచ్చు ఇటువంటి సన్నివేశం భగవంతునిలోనే సాధ్యమవుతుంది. లోకంలో ఉండే నదీప్రవాహాలలో ఏర్పడే సుడుల విషయంలో మాత్రం చాలా జాగ్రత్తగానే వ్యవహరించాలి. వాటికి దూరంగానే ఉండాలి.

ఈ విధంగా ఉండే, చాలా మధురమైన, అందమైన అర్థాలను స్ఫురింప చేసే భగవాన్నామాలు, వాటికి మన పూర్వాచార్యులు కృప చేసిన అపూర్వాలైన వివరణలు– అనే ఇవి అన్నీ మనకు ఉండే మహా నిధులవంటివి. వాటిని సదాచార్యమూలంగా పొంది అనుభవిద్దాం.



# 8. చక్కని చుక్కల ముగ్గులు

చుక్కలను పెట్టి ముగ్గును వేయడం అనే విషయం మనకు అందరకు తెలిసినదే. దీనికి కొంచెం ఏకాగ్రత, శ్రమ మాత్రమే ఆవశ్యకం. స్వామి తిరువీథిలోకి వేయించేయబోతాడు అంటే, వాకిలిని ఊడ్చి, నీళ్లు జల్లి, ముగ్గును పెట్టడం అలవాటు. చుక్కలను పెట్టి, వాటిని చక్కగా ముగ్గును దిద్దడానికి ఒక గంట సేపు పట్టవచ్చు. ఆ తరువాత ఆ ముగ్గుకు రంగులను పూస్తే, ఆ ముగ్గు ఇంకా అందంగా ఉంటుంది. పల్లకి మీద స్వామి వేంచేస్తే పల్లకి ఆకారంలో ముగ్గును, ఏనుగు మీద స్వామి వేంచేసినప్పుడు ఏనుగు ఆకారంలోని ముగ్గును. రథం మీద స్వామి వేంచేస్తే రథం ఆకారంలోని ముగ్గును వేయడం అలవాటు. ఈ విధంగా ఎన్ని ఆకారాలలోనో ముగ్గులు వేస్తారు.

ముగ్గు వేయడానికి ఆరంభించినప్పుడు, మొదట చుక్కలు పెడతారు. అప్పుడు వాటిలో అందం ఏమీ గోచరించదు. అప్పుడు ఏవేవో చుక్కలుగా మాత్రమే కనబడుతుంది. ఆ చుక్కలు మనసును, చూపును ఆకర్షించలేవు. గబగబా చుక్కలను అన్నిటినీ కలుపుతూ, ముగ్గును వేసినప్పుడు, చూస్తూ ఉండగానే ఒక అందమైన ముగ్గు కంటికి కనబడుతుంది. ముగ్గుకు తగిన చుక్కలు, ఒక నిర్దిష్టమైన క్రమంలో, సంఖ్యలో చుక్కలను పెట్టడం ఆ చుక్కలను ఒక క్రమ రీతిలో కలపడం, ఇవన్నీ ఉన్నప్పుడే ముగ్గు ఆకారం ఏర్పడుతుంది. ముగ్గు పూర్తి అయినప్పుడు చుక్కలు కంటికి గోచరించవు. ముగ్గు మాత్రమే కనిపిస్తుంది.

ముగ్గుకు ద్రావిడ భాషలో కోలం అని పేరు. కోలం అనే పదానికి అందం అని కూడా ఆ భాషలో అర్థం ఉన్నది. కోలవరాహం అని ఆళ్వారులు వరాహావతారాన్ని కీర్తిస్తారు. అంటే, అందమైన వరాహస్వామి అని అర్థం. ఇంకొక చోట, వారే, " ఉన్ కోలమేని కాణ వారాయ్" (నీ అందమైన దివ్య మంగళ రూపాన్ని దర్శించేటట్లుగా రావాలి) అని అంటారు.

ముగ్గు చాలా అందంగా ఉంటుంది. ఆ ముగ్గును రచించిన తరువాత దానిని వేసినవారు రెండు అడుగులు వెనక్కి వేసి, ఆ ముగ్గులోని అందాన్ని గమనిస్తారు. ఈ ముగ్గు ఎంత అందంగా ఉన్నది? ఈ ముగ్గును చూసి స్వామి సంతోషిస్తాడా? అని చూచి, భావిస్తారు.

ఈ విధంగా వీథులలో పెట్టబడే ముగ్గులను చూసినప్పుడు నా మనసులో ఏదో ఒక భావం మెదిలింది. ఈ ముగ్గు నుపెట్టడానికి ఆరంభించినప్పుడు, చుక్కలను పెట్టిన సమయంలో, ఆ చుక్కలు మనసును ఆకర్షించలేదు దృష్టిని ఆకట్టుకోలేదు. ఏమీ అర్థం

కాలేదు. ముగ్గుగా తీర్చిదిద్దిన తరువాత, ముందు పెట్టిన చుక్కలు కనపడలేదు కానీ, ముగ్గు మాత్రం దృష్టిని, మనసును ఎంతో ఆకర్షించింది. ఈ విషయాలను గమనించినప్పుడు నా మనసులో ఏదో స్ఫురించింది. ఏదో అర్థమైనట్టు అనిపించింది. ముగ్గు పెట్టిన తరువాత, ఆ ముగ్గుకు రంగులను పూస్తే, ఆ ముగ్గు మనసును కొల్లగొడుతుంది. దానిని గమనించినప్పుడు కూడా ఏదో అర్థం అయినట్లు అనిపించింది.

ఇది అంతా దేన్నీ సూచిస్తున్నది? చుక్కలే కదా ముగ్గుకు ఆధారం. చుక్కలు లేకుండా ముగ్గును రచించడం సాధ్యమా? ముగ్గు పూర్తి అయిన తరువాత చుక్కలు ఎక్కడ ఉన్నాయో తెలియడం లేదు. చుక్కలు లేకుండా ముగ్గును పెట్టమంటే, అది సాధ్యం కాదు.

సరే, బాగున్నది. ఇంతసేపు చుక్కల ముగ్గును గూర్చి ప్రస్తావించే క్రమంలో ఏ విషయాన్ని ఇక్కడ చెప్పదలచుకున్నారు మీరు? ఆ విషయాన్ని చెప్పండి —అని మీరు అనవచ్చు. వినండి.

జీవితంలో మన మనసులో ఎన్నో ప్రశ్నలు మెదులుతాయి. నేను ఎందుకు పుట్టాను? వీరికే ఎందుకు పుట్టాను? ఎపుడు పుట్టాను? ఎక్కడ పుట్టాను? పుట్టి నేనేమి చేయాలి? పుట్టడం ఆవశ్యకమా? మళ్లీ పుడతానా? అని ఈ విధంగా ఎన్నెన్నో ప్రశ్నలు. నేనెందుకు కష్టపడుతున్నాను? అతడు ఎందుకు సుఖపడుతున్నాడు? అతడు ఎందుకు కష్టపడుతున్నాడు? నేనెందుకు సుఖపడుతున్నాను? నేను ఈ విధంగానే కష్టపడుతూ ఉంటానా? ఈ వేళ బాధపడుతున్నాను, రేపు కూడా నేను బాధ పడతానా? అని ఈ విధంగా ఎన్నో విధాలైన ప్రశ్నలు. ఎన్నెన్నో పరంపరగా ప్రశ్నలు. మన మనసులో ఏర్పడే ఈ ప్రశ్నలకు అన్నిటికీ సమాధానాలు దొరకాలి. అవి మనకు తెలియాలి. అయితే, ఈ ప్రశ్నలకు ప్రత్యేకంగా, ప్రత్యేకంగా సమాధానం చెబితే అదవి అందంగా ఉండవు. ఆనందం కలుగదు.

మన మనసులో ఈ విధంగా ఏర్పడే ప్రశ్నలు అన్నీ ముగ్గు ఆరంభంలో పెట్టే చుక్కలవంటివి అని భావించండి. ముగ్గులో ఇక్కడ ఒక చుక్క, అక్కడ ఒక చుక్క, మధ్యలో ఒక చుక్క, ఈ పక్కన ఒక చుక్క, ఆ పక్కన ఒక చుక్క పెట్టినట్లుగా, నాకు ఒక ప్రశ్న, అతనికి ఒక ప్రశ్న, వేరొకనికి ఇంకొక ప్రశ్న కలుగుతుంది. ముగ్గులో ఎన్నో చుక్కలు, ఎన్నో విధాలుగా పెట్టినట్లుగా, మన జీవితంలో కూడా ఎన్నో ప్రశ్నలు, ఎన్నో విధాలుగా కలుగుతాయి. చుక్కలను పెట్టినప్పుడు అవి మనస్సును ఆకర్షించనట్లే, ఈ ప్రశ్నలు కూడా మన మనసును ఆకర్షించవు. అయితే, ఈ ప్రశ్నలకు అన్నిటికి సమాధానాలు కావాలి, అవి కూడా తగిన సమాధానాలు కావాలి. ఒక్కొక్క ప్రశ్నకు సమాధానం ఏర్పడగా, ఏర్పడగా, అవి అన్నీ కలసి ఒక ముగ్గు వలె అందమైన కథారూపాన్ని పొందుతాయి.

జీవితంలో మన మనసులో కలిగే ప్రశ్నలకు తగిన సమాధానాల పురాణాలలో, ఇతిహాసాలలో ఆయా కథల రూపంలో తెలియజేయబడ్డాయి. రామాయణ కథను మనం చెప్పుకుంటాము. మన మనసులో ఉండే ఒక్కొక్క ప్రశ్న ఒక్కొక్క చుక్క. ఆ ప్రశ్నలకు ప్రత్యేక ప్రత్యేకంగా సమాధానం చెబితే, అవి అందంగా ఉండవు వాటిని అన్నిటినీ కలుపుకొని ఒక కథద్వారా, ఒక ఉపాఖ్యానం ద్వారా తగిన సమాధానాలను తెలియజేస్తే, అది ఎంతో రమణీయంగా, హృద్యంగా ఉంటుంది. ఈ విధంగా మన మనసులో ఏర్పడే చుక్కల వంటి ప్రశ్నలకు సమాధానాన్ని తెలుపడం కోసమే ఈ పురాణాలు, ఇతిహాసాలు ఏర్పడ్డాయి. ఈ పురాణాలలో ఇతిహాసాలలో తెలుపబడిన వృత్తాంతాలు చాలా అందంగా ఉంటాయి. అందమైన ముగ్గుకు చుక్కలు ఆధారం అయినట్లు అందంగా ఉండే ఉపిఖ్యానాలకు అన్నిటికీ మూలం పలు విధాలయిన చుక్కల వంటి ప్రశ్నలే.

ఈ రామాయణ మహాభారతాలలోని, ఆ విధంగానే పలు పురాణాలలోని వృత్తాంతాలను మనం కథలుగా చెప్పుకుంటాము. ప్రవచనాలుగా వింటాము, గానం చేస్తాము. భజనలు చేస్తాం ఉత్సవాలుగా నిర్వహిస్తాము. అపుడు మన మనస్సుకు అవి చాలా రంజకాలుగా ఉంటాయి. అందుచేత ఇవి ముగ్గును రచించి పూర్తి అయిన తరువాత, దానికి పైన అలంకరించే రంగుల వంటివి. రామాయణ కథను హరికథగా గానం చేయవచ్చు. దానిని ఒక నాటకంగా ప్రదర్శించవచ్చు. బుర్రకథగా చెప్పినప్పుడు విని ఆనందించవచ్చు. ఇవి అన్నీ, ముగ్గులను రంగులతో అలంకరించడం వంటివే. అయితే, ముగ్గులకు అన్నిటికి మొట్ట మొదటగా చుక్కలు ఆధారం అయినట్లుగా ఈ పురాణాలలో, ఇతిహాసాలలో ప్రస్తావించబడిన కథలకు అన్నిటికి మన మనసులలో మేదిలే ప్రశ్నలే ఆధారం. వీటికి సమాధానం తెలుపడం కోసమే మహర్షులు ఇతిహాస పురాణాదులను రచించారు. ఈ ప్రశ్నలకు సమాధానాలను తెలుపడం కోసమే భగవంతుడు అవతరించాడు. ఎన్నెన్నో లీలలను చేశాడు. అతనికి ఏమీ ప్రశ్నలు లేవు కదా. ప్రశ్నలు కలిగేది మనకే కదా. మన మనసులో ఏర్పడే ప్రశ్నలకు తగిన సమాధానాలను ఇవ్వడం కోసమే ఈ పురాణాలు గానీ, ఇతిహాసాలు కానీ, భగవంతుని అవతారాలు, కానీ లీలలు కానీ ఏర్పడ్డాయి. ఒక్కొక్కరి మనసులో ఏర్పడే ప్రశ్నలకు ప్రత్యేకంగా ప్రత్యేకంగా సమాధానాలను ఇస్తే, ఆ సమాధానాలు అంత రంజకంగా ఉండవు. అందరి మనసులలో ఏర్పడే ప్రశ్నలకు అన్నిటికి కలిపి తగిన అందమైన సమాధానాన్ని ఒక ఉపాఖ్యాన రూపంలో తెలిపినట్లయితే, చుక్కలను అన్నిటినీ కలిపి ఒక ముగ్గును రచించినప్పుడువలె, చాలా అందంగా ఉంటుంది. మనసును ఆకర్షిస్తుంది. అందువల్ల ప్రశ్నలకు మాత్రం సమాధానాలు కావాలి– అని భావించరాదు.

రామాయణాన్ని పూర్తిగా అధ్యయనం చేయగా, చేయగా, భగవద్గీతను సంపూర్ణంగా అధ్యయనం చేయగా, చేయగా, మహా భాగవత కథలను మాటిమాటికి శ్రవణం చేయగా, చేయగా, ్మన మనసులో ఏర్పడే ప్రశ్నలకు తగిన సమాధానాలు, వాటి అంతట అవే లభిస్తాయి. మన మనసులలో సహజంగా ఏర్పడే చుక్కలవంటి ఆ ప్రశ్నలకు సమాధానాలను తెలుపడం కోసమే, ఆ ప్రశ్నలను దృష్టిలో పెట్టుకుని, ఆ వాటికి తగిన సమాధానాలను తెలుపడం కోసమే, మహర్షులు ఇతిహాస పురాణాలలోని అందమైన రంగవల్లికలవంటి కథలను రచించారు. ఆ ప్రశ్నలు మనకు కంటికి కనిపించవు. అయితే, ఆ ప్రశ్నలకు తగిన సమాధానాలే ఆ కథలు. ఏ విధంగా అంటే, చుక్కలు మన కంటికి కనిపించవు. ఆ చుక్కలను ఆధారంగా చేసికొని రచింపబడినదే అందమైన రంగవల్లిక. ముగ్గులు– అనే సత్యాన్ని మనం తెలుసుకొని, ఆస్వాదించగలిగినట్లయితే, ఆ ముగ్గులు వెనక ఉండే చుక్కలు మన మనసులో తప్పక మెదులుతాయి. ఆ విధంగానే, పురాణేతిహాసాలలోని కథలలో కనిపించే అందాన్ని మనం ఆస్వాదించినట్లయితే, వాటి వెనుక ఉండే ప్రశ్నలు తప్పక మనకు అర్థం అవుతాయి. చుక్కలు, ముగ్గులు, వాటి పైన పూసిన రంగులవలె ఉండే ప్రశ్నలు, వాటిని ఆధారంగా చేసికొని రచింపబడిన కథలు, ఆ సందేహాలకు నివృత్తి అన్నీ మనకు అర్థం అవుతాయి.

ఇది ఎంతటి అందమైన దృశ్యం. చుక్కలు మాత్రమే ఉన్నప్పుడు ఏ అందం కనిపించదు. అవి ఒక ముగ్గుగా రూపొందినప్పుడు చాలా అందంగా ఉంటుంది. అయితే, ముగ్గు అనేది ఏర్పడడానికి ఆధారం చుక్కలు. అవి లేకుండా ముగ్గును రచించడం సాధ్యం కాదు. ఆ విధంగానే ప్రశ్నలు ప్రశ్నలుగానే ఉన్నప్పుడు, మన మనసును ఏమీ ఆకర్షించవు. వాటికి తగిన సమాధానాలుగా మహా పురుషుల చరిత్రలు చెప్పబడినప్పుడు, ఆ కథలు చాలా అందంగా ఉంటాయి. అవే ఉపన్యాసాలుగా, హరికథలుగావినడం, భజనలుగా చేయడం, సీతా కళ్యాణం, రుక్మిణీకళ్యాణం, గోదా కళ్యాణం మొదలైన ఉత్సవాలు నిర్వహించడం అనే ఇవి అన్నీ, ఆ కథలు అనే ముగ్గలకు పైన అద్దిన, వాటికి మరింత శోభను కలుగజేసే రంగులవంటివి. ఈ విధంగా మహర్షులు మహనీయుల అందమైన వృత్తాంతాలను మన సంప్రదాయ పరిరక్షణ కోసం గొప్ప పురాణేతిహాసాలుగా తీర్చిదిద్దారు. వాటిని అధ్యయనం చేసి, వాటిలో మనకు స్ఫురించే అందమైన తత్త్వాలను, వాటికి మూలమైన ప్రశ్నలను గమనించి, భావించి ఆనందిద్దాం. మన జీవితంలో ఎదురయ్యే ప్రశ్నలకు తగిన సమాధానాలను తెలిసికొందాం. స్వస్తి.

★★★★★

# 9. కల్యాణగుణ పట్టాభిషేకం

ఏ గ్రంథానికైనా, లేక ఉపన్యాసానికి అయినా, ఉపక్రమం అని ఉపసంహారం రెండు ఉంటాయి. ఉపక్రమం అంటే, ఆరంభం. ఉపసంహారం అంటే, పూర్తి. ఒక గ్రంథం ఆరంభంలో ఒక విషయాన్ని చెప్పి ఆరంభించి, మళ్ళీ చివరిలో కూడా అదే విషయాన్ని చెప్పినట్లయితే, ఆ విషయం ఆ గ్రంథానికి ముఖ్యమైన విషయం అని అర్థం అవుతుంది.

శ్రీరామాయణం ఆరంభమే శ్రీరామచంద్రుని కళ్యాణ గుణ ప్రస్తావనతో జరిగిందికదా. ఇది అందరికీ తెలిసిన విషయమే. ఆ గ్రంథం చివరిలో శ్రీరామ పట్టాభిషేకం తెలుపబడింది. వశిష్ఠుడు శ్రీరామచంద్రునకు పట్టాభిషేక మహోత్సవాన్ని నిర్వహిస్తున్నాడు. అప్పుడు శ్రీరామచంద్రుని తలపై రత్నమయమైన కిరీటాన్ని పెట్టబోతున్నాడు. ఆ సందర్భంగా వాల్మీకి పలికిన ఈ సూక్తిని గమనిద్దాం. " రామం రత్నమయే పీఠే సహసీతం న్యవేశయత్" అనేది ఆ శ్లోకం. సింహాసనంలో శ్రీరామచంద్రుడు కూర్చున్నాడు. సీతాదేవిని ఆ శ్రీరామచంద్రుని పక్కన కూర్చోబెట్టి, అప్పుడు, వశిష్ఠుడు పలు పుణ్య నదులనుండి తీసుకుని వచ్చిన పుణ్యాజలాలతో సీతాదేవితో కూడి ఉండే శ్రీరాముని తలను అభిషేకించాడు శ్రీరాముని తలపై రత్నకిరీటాన్ని పెట్టాడు.

ఈ సందర్భాన్ని మన పూర్వాచార్యులు చాలా అద్భుతంగా వ్యాఖ్యానించారు. పట్టాభిషేకం జరుగుతున్నది శ్రీరామునకే కదా. మరి, సీతాదేవిని ఆ స్వామి పక్కన ఎందుకు కూర్చోబెట్టి అభిషేకాన్ని చేయడం జరిగింది. ఈ సందర్భం వల్ల ఏ విలక్షణమైన అర్థం వ్యక్తం అవుతున్నది? అనే విషయాన్ని వారు చాలా అందంగా వివరించారు.

మనం కేవలం శ్లోకాలను మాత్రమే చదువుకోగలం. ఆ శ్లోకాలలో పైపైన తోచే అర్థాలని మాత్రమే అర్థం చేసుకోగలం. కానీ, మన పూర్వాచార్యులు ఆ యా పదాలలో నిశితంగా గమనించి, వాటిలో స్ఫురించే, లోతుగా ఉండే అర్థాలను మనకు తెలియజేశారు. సామాన్యమైన కావ్యం అయితే, వాచ్యమైన అర్థంతోనే అది ముగిసిపోతుంది. కానీ, మహాకావ్యం అటువంటిది కాదు. అందులో లోతైన, గంభీరమైన అర్థాలు ఆయా పదాల ద్వారా స్ఫురింప చేయబడతాయి. వాటికే వ్యంగ్యార్థాలు అని పేరు. ఈ వ్యంగ్యార్థాలే మహాకావ్యాలలో ప్రధానమైనవి, అవి ప్రాణసమానమైనవి.

శ్రీరామాయణ మహాకావ్యం శ్రీరామచంద్రుని కల్యాణ గుణ కీర్తనతో ప్రారంభమైనందున, అతని గుణాభిరామత్వం తెలుపబడింది. శ్రీరాముడు సకల కళ్యాణ గుణాలను కలిగినవాడు, సకల గుణాభిరాముడు— అని ఆరంభంలోనే తెలియజేయబడింది. ఆ క్రమంలోనే, ఆ కావ్యం చివరిలో కూడా, ఆ స్వామి యొక్క కళ్యాణ గుణాల ప్రస్తావన చేయబడాలికదా. ఆ స్వామికి చేయబడే పట్టాభిషేకం కూడా సకల కళ్యాణ గుణ విశిష్టుడైన శ్రీరామునికే కావాలి. ఆ విషయం వ్యంగ్య ప్రక్రియలో సూచింపబడాలి. అందుకోసమే వాల్మీకి మహర్షి "సహసీతమ్" అనే ఒక విలక్షణమైన ప్రయోగాన్ని చేశారు.

"సహసీతమ్" అని ప్రయోగించినందువల్ల శ్రీరామచంద్రుని సకల కళ్యాణ గుణాభిరామత్వం ఏవిధంగా వ్యక్తం అవుతున్నది? అనే విషయాన్ని ఇక్కడ గమనించవలసి ఉన్నది. శ్రీరామచంద్రునకు జరిగే పట్టాభిషేకం కేవలం కోసల సామ్రాజ్య పట్టాభిషేకం అని, అయోధ్యా పురం సామ్రాజ్య పట్టాభిషేకం అని కానీ భావిస్తే, అది శ్రీరామచంద్రుని మహిమకు చాలా చిన్నది అవుతుంది. వాస్తవానికి ఆలోచిస్తే, భారతదేశానికి పాలించే శ్రీరామునకు పట్టాభిషేకం అంటేనే ఆ స్వామి వైభవానికి సరిపోయేది కాదు కదా. లోకానికే ప్రభువైన శ్రీరామునకు పట్టాభిషేకం జరుగుతున్నది–< అని చెప్పాలి. "లోకాభిరామం శ్రీరామమ్" అని కదా శ్రీరాముని మనం కీర్తిస్తున్నాము. అటువంటప్పుడు ఒక నగరానికి, ఒక రాజ్యానికి పట్టాభిషేకం జరుగుతున్నదంటే అది సరికాదు కదా. అందువల్ల, అది కేవలం అయోధ్యా నగర పట్టాభిషేకం కాని, కోసల రాజ్య పట్టాభిషేకం కాని కాదు. శ్రీరామచంద్రుని కళ్యాణ గుణ సామ్రాజ్య పటాభిషేకం అని చెప్పాలి, ఆ విషయం పట్టాభిషేక సందర్భంలో ష వ్యంగ్య ప్రక్రియలో సూచింపబడాలి. అందుకోసమే వాల్మీకి మహర్షి "సహసీతమ్" అనే ప్రయోగాన్ని చేశాడు. ఏ గుణాల ప్రస్తావనతో శ్రీరామాయణ మహాకావ్యం ఆరంభమైనదో ఆ గుణాలకే పట్టాభిషేకం జరుగుతున్నదని తెలియజేప్పాలి. అందుకోసమే వాల్మీకి మహర్షి ఈ ప్రయోగాన్ని చేశాడు.

శ్రీరామాయణంలో మొదటి నుండి చివరి వరకు ఉండే సందర్భాలను గమనించినట్లయితే, ఆయా సందర్భాలలో అంతటా శ్రీరామచంద్రుని ఆ యా విలక్షణమైన కల్యాణ గుణాలు ప్రకాశిస్తున్నాయి. కథలోని సందర్భాలు అన్నీ శ్రీరామచంద్రుని కళ్యాణ గుణాలను నిరూపించేవే. ఎందుకంటే, ఒక ప్రశ్నకు చెప్పబడిన సమాధానం, ఆ ప్రశ్నకు అనుగుణంగా ఉన్నప్పుడే కదా అది సరి అయినది అవుతుంది. వాల్మీకి మహర్షి 16 గుణాల ప్రస్తావన చేసి, ఇటువంటి గుణాలు కలిగిన మానవుడు ప్రస్తుతం ఈ లోకంలో ఎవరైనా

ఉన్నారా? అని ప్రశ్నించగా, నారదుడు దానికి సమాధానంగా శ్రీరామాయణ వృత్తాంతాన్ని తెలియజేశాడు. అంటే, దీని అర్థం ఏమి? శ్రీరామాయణం అంతా కూడా ప్రధానంగా శ్రీరామచంద్రుని 16 గుణాలను నిరూపిస్తున్నది అనియేకదా. అందువల్ల రామాయణంలో ఉండే సందర్భాలు అన్నీ శ్రీరామచంద్రుని కల్యాణ గుణ నిరూపకాలు అనేది స్పష్టం.

శ్రీరామచంద్రునకు కల కల్యాణ గుణాలు ఈ విధంగా వ్యక్తం కావడానికి ఏమి కారణం? ఎవరు కారణం? అనే విషయాన్ని ఇక్కడ గమనించాలి. శ్రీరాముడు సౌందర్యం కలవాడు, దయ కలవాడు, క్షమను కలవాడు, ఇతరుల దోషాలను కూడా భావించే వాత్సల్యాన్ని కలవాడు, సౌలభ్య గుణాన్ని కలిగినవాడు, శీలగుణాన్ని కలిగినవాడు, అని ఈ విధంగా శ్రీరామునిలో ఎన్నో గుణాలు ప్రకాశిస్తున్నాయి. ఈ కళ్యాణ గుణాలు అన్నీ అతనిలో ప్రకాశించడానికి ఏమి నిదానం? మూల కారణం ఏమి? అనే ప్రశ్నకు " శ్రీరాముని గుణాలు ప్రకాశించడానికి కారణం సితాసంబంధమే", అనేది యుక్తమైన సమాధానం. ఆ విషయాన్నే పైన ప్రస్తావించిన శ్రీరామాయణ సూక్తిలోని "సహసీతమ్" అనే ప్రయోగం సూచిస్తున్నది. సీతాదేవితో శ్రీరాముడు కలసి ఉన్నట్లయితే, అప్పుడు, ఆ స్వామిలో కళ్యాణ గుణాలు అన్నీ ప్రకాశిస్తాయి. సీత రాముని విశ్లేషించినట్లయితే, అప్పుడు ఆ స్వామిలో ఉండే కళ్యాణ గుణాలు స్పష్టంగా ప్రకాశించవు.

కంబరామాయణంలో ఈ విషయానికి సంబంధించిన ఒక అద్భుతమైన సూక్తి ఉన్నది. సీతాసంబంధం చేతనే శ్రీరామునిలో కళ్యాణ గుణాలు ప్రకాశిస్తాయి– అనే విషయాన్ని కంబ మహాకవి వాలి ద్వారా పలికించాడు. వాలిని శ్రీరాముడు వధించిన సందర్భం ఆది. శ్రీరాముడు ప్రయోగించిన బాణం తగిలినందున వాలి క్రింద పడిపోయాడు. అప్పుడు వాలి శ్రీరామునితో ఈ విధంగా అంటున్నాడు. " శ్రీరామా! నీవు ఈ విధంగా ఎందుకు చేశావో, ఆలోచిస్తే నాకు ఇప్పుడు అర్థం అవుతున్నది. నీవు ఎందుకు ఈ విధంగా చేశావు అని నేను బాగా ఆలోచించాను. నాకు అర్థమైనది ఏమంటే– నీవు చాలా ఋజుత్వాన్ని కలిగినవాడవు. నీవు పుట్టిన వంశం చాలా గొప్పది. అది ఇక్ష్వాకు వంశం. అయినప్పటికీ, నీవు మహావీరుని క్రమానికి తగని విధంగా చెట్టు చాటునుండి నాపై బాణాన్ని ప్రయోగించావు. ఈ విధంగా నీవు ఎందుకు చేశావంటే, " ఆవియ్యై, శనకన్ పెறற అన్నత్తై, ఆముదిల్ వంద తేవియ్యై పిరిందనై తికైత్తన పోలుమ్ " –నీకు ప్రాణసమానురాలైనది, జనక చక్రవర్తి పొందిన హంసవంటిది, పాల సముద్రాన్ని చిలికినప్పుడు అందులోనుండి పుట్టిన అమృతంవంటిది అయిన సీతాదేవి ఇపుడు నీకు దూరంగా ఉన్నది. అందువల్లనే నీవు,

చేస్తున్న పని సరైనదా? కాదా? అనే తెలుసుకోలేని దశలో ఉన్నావు. అందుచేతనే నీవు ఈ విధంగా చేశావు– అని భావిస్తున్నాను"– అని వాలి అన్నాడు. ఈ విధంగా వాలినోటినుండి కంబమహాకవి ఒక గొప్ప అర్థాన్ని సూచించాడు.

దీనివల్ల మనకు ఏమి అర్థం అవుతున్నదంటే సీత సంబంధంవల్లనే రామునిలో పరత్వాని, కి సౌలభ్యానికి సంబంధించిన అన్ని గుణాలు వ్యక్తం అవుతాయి– అని. శ్రీరామునిలో పరత్వం వ్యక్తం అవుతున్నది అన్నా, లేక, సౌలభ్యం వ్యక్తం అవుతున్నది అన్నా, దానికి కారణం సీతాసంబంధమే.

భగవంతునిలోని పరత్వ సౌలభ్యాలు రెండు లక్ష్మీసంబంధం వల్లనే ప్రకాశిస్తాయి– అనే విషయాన్ని ఉభయ వేదాంతాలు నిష్కరించి తెలిపాయి. గోదాదేవి అనుగ్రహించిన తిరుప్పావై ప్రబంధంలోని తొమ్మిదవ పాశురంలో ఉండే "మామాయన్ మాధవన్ వైకుందన్ " అనే ఒకానొక దివ్యసూక్తి అందరికీ తెలిసినదే. ఇందులో "మామాయన్, మాదవన్, వైకుందన్", అని భగవంతుని నామాలు మూడు ప్రస్తావింపబడ్డాయి. ఇదే విధంగా, శ్రీ విష్ణు సహస్రనామంలో కూడా "లోకనాథః మాధవః భక్తవత్సలః "అనే క్రమంలో భగవంతుని మూడు నామాలు ప్రస్తావింపబడ్డాయి. తిరుప్పావైలోని సూక్తి ఏ అర్థాన్ని తెలుపుతున్నదో, అదే అర్థాన్ని శ్రీ విష్ణు సహస్రనామంలోని ఈ మూడు నామాలు కూడా తెలుపుతున్నాయి. మాధవుడంటే లక్ష్మీపతి అని అర్థం. ఈ నామం పై రెండు సూక్తులలోనూ మధ్యలో ఉన్నది, అంటే, లక్ష్మీదేవి సంబంధం మధ్యలో తెలుపబడింది. తిరుప్పావై సూక్తిలో లక్ష్మీసంబంధాన్ని తెలియజేసే నామానికి రెండు వైపులా "మామాయన్, వైకుందన్" అనే రెండు నామాలు ఉన్నాయి. ఇందులో, " వైగుందన్", అనే నామం భగవంతుని పరత్వాన్ని తెలుపుతున్నది. "మామాయన్" అనే నామం ఆ స్వామికి కల సౌలభ్యాన్ని తెలుపుతున్నది. ఈ విధంగా ఒక వైపు ఉండే నాణమం ద్వారా పరత్వం, ఇంకొక వైపు ఉండే నామం ద్వారా సౌలభ్యం ఇక్కడ తెలియజేయబడ్డాయి. ఈ రెండు నామాలకు మధ్య లక్ష్మీ సంబంధాన్ని తెలియజేసే మాధవ నామం ఉన్నది. ఈ విధంగా మాధవ నామం ఈ రెండు నామాలకు మధ్యలో ఎందుకు ప్రయోగింపబడింది? ఈ క్రమం ఏ అర్థాన్ని సూచిస్తున్నది? అనే విషయాన్ని మన పూర్వాచార్యులు చాలా అందంగా వివరించారు.

శాస్త్రంలో మధ్యమణి న్యాయం అని, దేహలీదీపన్యాయం అని చెప్పబడే రెండు న్యాయాలు ఉన్నాయి. ఈ రెండు న్యాయాలు ఒకే అర్థాన్ని తెలియజేస్తాయి. ఒక హారం మధ్యలో ఒక అందమైన మణి పొదగబడినట్లయితే. ఆ మణికి గల ప్రకాశం హారంలో ఉండే

రెండు వైపులా ప్రసరిస్తుంది. హారానికి మధ్యలో ఉండే మధ్యమణి వల్ల హారంలో రెండు వైపులకు ఒక విలక్షణమైన అందం చేకూరుతుంది. దీనికి మధ్యమణిన్యాయం అని పేరు. ఆ విధంగానే, ఒక ఇంటి మధ్యలో గడపపై దీపం పెట్టినట్లయితే, ఆ దీవప్రకాశం అనేది దానికి రెండు వైపులా ఉండే భాగాలలో ప్రసరిస్తుంది. మధ్యలో ఉండే గడప పైన దీపం పెట్టినప్పుడు కదా, అది రెండు వైపులా తన ప్రకాశాన్ని ప్రసరింప చేస్తుంది. దీనికి దేహళీదీపన్యాయం అని పేరు. దేహళీ అంటే ఇంటి గడప.

ఈ న్యాయాన్ని ప్రస్తుతం అన్వయించుకొని, అర్థాన్ని గమనించాలి. ఈ క్రమంలో మాధవ నామాన్ని రెండు వైపులా అన్వయించి అర్థాన్ని గమనించాలి. ఈ క్రమాన్ని పైన ప్రస్తావించిన తిరుప్పావై సూక్తిలోనూ, సహస్రనామసూక్తిలో కూడా అన్వయించి అర్థం గ్రహించాలి. తిరుప్పావై సూక్తిలోని మాధవ నామం తనకు ఒకవైపు ఉండే "మామాయన్ "అనే నామంతో కలిపి అర్థాన్ని గమనించినప్పుడు, భగవంతుడు మాధవుడు కనుకనే మామాయన్ అయ్యాడు, అతనిలో సౌలభ్యాతిశయం ప్రకాశించడానికి లక్ష్మీ సంబంధమే కారణం అనే అర్థం ప్రకాశిస్తుంది. ఆ విధంగానే, మాధవ నామాన్ని దానికి ఇంకొక వైపున ఉండే వైకుందన్ అనే నామంతో అన్వయించి అర్థాన్ని గమనించినట్లయితే, భగవంతుడు మాధవుడు కనుకనే వైకుంఠుడు అయ్యాడు, అంటే, ఆ స్వామిలో లక్ష్మీ సంబంధంచేతనే పరత్వాతిశయం ప్రకాశిస్తున్నది- అనే అర్థం స్ఫురిస్తుంది. ఈ క్రమాన్ని శ్రీ రామాయణంలోని "సహసీతమ్" అనే ప్రయోగంలో అన్వయించుకున్నప్పుడు, శ్రీరాముడు సీతాసంబంధం వల్లనే పరత్వాన్ని కలిగినవాడు అయ్యాడు, సీతాసంబంధంవల్లనే సౌలభ్యాన్ని కలిగినవాడయ్యాడు- అనే అర్థం స్పష్టమవుతుంది. అందువల్ల సీతాసంబంధమే శ్రీరామునిలో సకల కళ్యాణ గుణాలు ప్రకాశించడానికి కారణమైనది అని తెలుస్తున్నది.

ఈ క్రమాన్నే పైన ఉదాహరించిన సహస్రనామసూక్తిలో కూడా గమనించి అర్థాన్ని గ్రహించాలి. భగవంతుడు లోకనాథుడు ఎందుకు అయ్యాడు? అంటే, అతడు మాధవుడు అయినందువల్లనే, అంటే, అతనిలో పరత్వం ప్రకాశించటానికి కారణం మాధవుడు కావడమే అనే అర్థం" లోకనాథః, మాధవః" అనే నామాల క్రమాన్ని గమనించినప్పుడు ప్రకాశిస్తుంది. ఆ విధంగానే, " మాధవః, భక్తవత్సలః" అనే క్రమాన్ని గమనించినప్పుడు, భగవంతుడు మాధవుడు అయినందువల్లనే భక్తవత్సలుడు అయ్యాడు- అనే అర్థం స్ఫురిస్తుంది. ఈ విధంగా భగవంతునిలో ఉండే లక్ష్మీసంబంధమే ఆ స్వామికి కల పరత్వం కానీ, సౌలభ్యంగాని ప్రకాశించడానికి కారణం అయినది అని తెలుస్తున్నది. ఈ విధంగా పైన ఉదాహరించిన తిరుప్పావై సూక్తిలోనూ, సహస్రనామసూక్తిలోనూ లక్ష్మీసంబంధాన్ని తెలియజేసే నామం

మధ్యలో ఉన్న కారణం చేత, లక్ష్మీసంబంధమే భగవంతుని పరత్వ సౌలభ్యాలకు కారణం అయినదని తెలుపబడినట్లు అయినది.

ఈ విలక్షణమైన విషయాన్ని, అంటే, సీతా సంబంధం వల్లనే శ్రీరామునిలో పరత్వం, సౌలభ్యం ప్రకాశించాయి– అనే విషయాన్ని తెలియజేయడం కోసమే వశిష్ఠుడు సీతాదేవిని శ్రీరామునితో పాటు మహాసనంలో కూర్చోబెట్టాడు. అందువల్ల, పట్టాభిషేకసమయంలో శ్రీరామనకు జరిగిన పట్టాభిషేకం ఆ స్వామికి గల కల్యాణ గుణాలకే పట్టాభిషేకం అనే విషయం వాల్మీకి మహర్షి ప్రయోగించిన "సహసీతమ్" అనే విశేషణం ద్వారా ప్రస్ఫుటమవుతున్నది.

★★★★★

# 10. వేదం - శ్రీరామాయణం

" వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా. "

భగవానుడైన శ్రీమన్నారాయణుడు శ్రీరాముడై అవతరించాడు. ఆ భగవానుడు శ్రీరాముడై ఈ లోకంలో అవతరించినప్పుడు అతనిని గూర్చి తెలియజేసే వేదం కూడా శ్రీరామాయణరూపంలో అవతరించింది. భగవానుడు శ్రీరాముడై అవతరించాడు, లక్ష్మీదేవి కూడా సీతాదేవిగా అవతరించింది. ఆ దివ్యదంపతుల వైభవాలను ఎల్లప్పుడూ కీర్తించే వేదం కూడా శ్రీరామాయణరూపంలో అవతరించింది. పైన ప్రస్తావించిన పురాణ శ్లోకం ఈ విషయాన్ని తెలుపుతున్నది. "వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే"– వేదంచేత ఎల్లప్పుడూ చెప్పబడే భగవంతుడు దశరధులకు పుత్రుడు అయిన శ్రీరామునిగా అవతరించినప్పుడు, " ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా" – వాల్మీకిమహర్షి వాక్కు రూపంలో వేదాలే శ్రీరామాయణంగా అవతారాన్ని ధరించాయి,

భగవంతుడు కాలానికి కానీ, దేశానికి కానీ, వస్తువుకు గాని పరిమితమై ఉండేవాడు కాదు. లక్ష్మీదేవి కూడా అటువంటి గొప్పతనాన్ని కలిగినది. శ్రీరామాయణం కూడా అదే విధంగా, దేశకాల వస్తుపరిచ్ఛేదాలకు అతీతమైనది అని పెద్దలు చెబుతారు. వేదాలు కాలానికి లోబడి ఉంటాయా? అంటే, వాటికి కాలాన్ని బట్టి అవధి ఉన్నదా? ఈ ప్రదేశంలో మాత్రమే ఉన్నాయి అనే దేశానికి సంబంధించిన అవధిని కలిగినవా? వేదాలు ఇక్కడే వ్యాపించి ఉంటాయి అనే ఒక అవధిని చెప్పగలమా? ఆ విధంగానే, వేదాలు ఈ విషయాలను మాత్రమే తెలియజేస్తాయి అనే వస్తుపరిచ్ఛేదాన్ని వాటికి చెప్పగలమా? ఈ విధమైన మూడు విధాలైన పరిచ్ఛేదాలు వేదాలకు లేవు. భగవంతుడు అన్ని కాలాలలోనూ ఉన్నాడు. అందువల్ల కాలాన్ని పురస్కరించికొని పరిచ్ఛేదించడానికి సాధ్యం కానివాడు. భగవానుడు ఏ సంకోచం లేకుండా అంతటా వ్యాపించి ఉన్నాడు. అందుచేత దేశాన్ని పురస్కరించుకొని పరిచ్ఛేదించడానికి వీలుకానివాడు. అతడు ఈ వస్తువులలో మాత్రమే ఉన్నాడు అనే పరిమితిని కలిగినవాడు కాదు. అన్ని వస్తువుల రూపంలో ఉన్నాడు. అన్ని వస్తువులలోనూ అంతరాత్మగా ఉన్నాడు. మన స్థితి అటువంటిది కాదు. మనం ఒక రూపాన్ని కలిగి ఉన్నామంటే, అదే సమయంలో వేరొక రూపాన్ని ధరించి ఉండే అవకాశం మనకు లేదు. ఆ విధంగానే, తల్లిదండ్రులు మనకు ఒక పేరును పెట్టి ఉంటారు. మనం కలిగి ఉండే రూపంతో మనలను చూసినప్పుడు మాత్రమే మనలను లోకం మన పేరుతో

గుర్తుపడుతుంది. ఒకవేళ మన రూపం మారినట్లయితే, వేరొక రూపాన్ని మనం ధరించగలిగి ఉన్నట్లయితే, ఆ రూపంలో ఉండే మనలను, అంటే, ఇంకొకరి రూపంలో మనం కనబడినట్లయితే, అప్పుడు మనలను ఆ వ్యక్తి పేరుతో పిలుస్తారు, గుర్తిస్తారు తప్ప, మన పేరుతో పెట్టి పిలువరు, గుర్తించరు, గుర్తించలేరు. అందువల్ల ఈ లోకంలో ఏ వస్తువు అయినా, ఒక నిర్దిష్టమైన కాలానికి, ఒక నిర్దిష్టమైన దేశానికి, ఒక నిర్దిష్టమైన రూపానికి లోబడి ఉంటుంది. దేశకాల వస్తుపరిచ్ఛేదాలను కలిగి ఉంటుంది. అయితే, పరమాత్మ ఇటువంటివాడు కాదు. ఈ మూడు విధాలయిన పరిమితులు ఆ స్వామికి లేవు. అతడు అన్ని కాలాలలోనూ ఉన్నాడు అన్నిచోట్ల ఉన్నాడు అన్ని వస్తువులలోనూ ఉన్నాడు. " అంతర్బహిశ్చ తత్ సర్వం వ్యాప్య నారాయణః స్థితః" అని ఉపనిషత్తు పలుకుతున్నది. ఆ భగవంతుడు ఏ విధంగాను కాల దేశ వస్తువులతో పరిచ్ఛేదించడానికి వీలుకాని మహిమను కలవాడు.

శ్రీరామాయణంకూడా అటువంటి మహిమనే కలిగినది. శ్రీరామాయణంలోని ఈ శ్లోకాన్ని గమనించండి. " యావత్ స్థాస్యంతి గిరయః సరితశ్చ మహితలే, తావద్రామాయణకథా లోకేషు ప్రచరిష్యతి" అనేది ఆ శ్లోకం. ఈ శ్లోకాన్ని మనం పరిశీలించినట్లయితే, రెండు మూడు అమూల్యమైన విషయాలు మనకు గోచరిస్తాయి. "యావత్ స్థాస్యంతి గిరయః"– ఈ భూమిలో ఎక్కడ ఎక్కడ, ఏ ఏ సమయాలలో, పర్వతాలు నిలచి ఉంటాయో– అని అర్థం, ఎంతవరకు పర్వతాలు నిలచి ఉంటాయో, సూర్యచంద్రులు ఉంటారో, ఎంతవరకు నదులు ప్రవహిస్తాయో, అంతవరకు శ్రీరామాయణ కథ నిలచి ఉంటుంది– అని ఈ శ్లోకం తెలుపుతున్నది. దీనివల్ల మనకు ఏం అర్థం అవుతున్నది? అంటే, శ్రీరామాయడానికి కాలావది లేదు అని, , కాలపరిచ్ఛేదం లేదు అని తెలుస్తున్నది. ఎందుకంటే, పర్వతాలు ఎప్పటికీ నిలిచి ఉంటాయి నదులు సముద్రాలు ఎప్పటికీ ప్రవహిస్తూనే ఉంటాయి. సూర్యచంద్రులు ఎప్పటికీ ప్రకాశిస్తూనే ఉంటారు. దీనివల్ల పై శ్లోకంలోని ఒక భాగంవల్ల శ్రీరామాయణం కాలావది లేని మహిమ కలిగినది అని తెలుస్తున్నది. ఆ విధంగానే, ఈ శ్లోకంలోని. " సరితశ్చ మహీతలే" అనే భాగాన్ని గమనిద్దాం. ":మహితలే "అని చెప్పినందువల్ల కేవలం ఒక భారతదేశంలోనో, లేక, వేరొక దేశంలోనో, లేక, వేరొక చోటలోనో మాత్రం శ్రీరామాయణ ప్రచారం పరిమితం అయినది అని చెప్పలేదు. " మహితలే" అని అన్నడంవల్ల ఈ భూమిలో ఉండే నదులు సముద్రాలు సూర్యచంద్రులు ఎంతవరకు ఉంటారో అంతవరకు శ్రీరామాయణం నిలచి ఉంటుంది అని చెప్పబడినట్లు అయినది. " లోకేషు ప్రచరిస్యతి"– " లోకేషు" అని అన్నందు వల్ల, ఏదో ఒక దేశంలో

శ్రీరామాయణ కథ పరిమితం కాదు అని, అది చోట్లా ఉన్నదని అర్థం అవుతున్నది. "మనదేశంలో మాత్రం" అని చెప్పలేదు, వేరొక దేశంలో మాత్రం అని చెప్పలేదు. లోకంలో అని మాత్రం చెప్పలేదు, " లోకాలలో" అని చెప్పడం జరిగింది. అందువల్ల శ్రీరామాయణ కథ ఏదో ఒక లోకంలో మాత్రమే పరిమితం అయినదని అర్థం కాదు. "లోకేషు" అని బహువచనం చెప్పినందువల్ల మనకు ఏమని అర్థం అవుతుంది? అంటే, "ఏడేడు 14 లోకాలలో అని చెప్పబడింది కాబోలు! " అని కూడా తోస్తుంది. ఇది వాస్తవమే. ఈ విధమైన అర్థాన్ని కూడా గ్రహించవచ్చు.

అయితే, ఇంత మాత్రమే కాదు, వేరొక విశేషం కూడా ఉన్నది. మన పూర్వాచార్యులు వేరొక విశేషమైన అర్థాన్ని ఇక్కడ గ్రహించారు. ఈ విధంగా కేవలం 14 లోకాలలో మాత్రమే అని చెబితే, ఒక బ్రహ్మాండంలో మాత్రమే శ్రీరామాయణ కథ పరిమితం అయినట్లుగా చెప్పినట్లు తోస్తుంది. 14వ లోకాలను కలిగినది ఒక బ్రహ్మాండం. ఇటువంటి బ్రహ్మాండాలు అనేకం ఉన్నాయి "అండానాం తు సహస్రాణాం కోటి కోటి శతాని చ" అని చెప్పినట్లుగా, కోట్లాది సంఖ్యలో బ్రహ్మాండాలు ఉన్నాయి. ఈ విధంగా కోట్లాదిగా ఉండే బ్రహ్మాండాలలో కూడా ఈ శ్రీరామాయణ కథ వ్యాపించి ఉంటుంది– ఇక్కడ అని కూడా అర్థాన్ని గ్రహించవచ్చు– అని మన పూర్వాచార్యులు భావించారు.

ఇంత మాత్రమే కాదు. ఇక్కడ "లోకేషు" అనే పదంలోని బహువచనాన్ని అప్రధానంగా గ్రహించి, "రెండు లోకాలు" అనే అర్థాన్ని గ్రహించి, వేరొక అర్థాన్ని కూడా చెప్పే అవకాశం ఉన్నది. కేవలం ఈ లీలా విభూతిలోనే కాకుండా, నిత్య విభూతిలో కూడా, అంటే పరమపదంలో కూడా, రామాయణ కథ వ్యాపించి ఉంటుంది– అనే అర్థాన్ని చెప్పవచ్చు. ఈ విభూతిలో ఎన్ని బ్రహ్మాండాలు, ఎన్ని లోకాలు ఉన్నప్పటికీ, అవి అన్నీ విరజానదికి ఈవల వైపుననే ఉన్నాయి. ఇవి అన్నీ ఒకనాడు సృష్టింపబడి, వేరొక సమయంలో నశించిపోయే లోకాలు. ఇటువంటి లోకాలు సత్యలోకం వరకు ఉన్నాయి. ఈ అండాలను అన్నిటినీ దాటిన తరువాత, విరజానది ఉన్నది. ఆ నదిని దాటినట్లయితే, అక్కడ శ్రీవైకుంఠం ఉన్నది. అని దీనికి నిత్య విభూతి అని పేరు. ఇది ఏనాడు సృష్టింపబడి, నశించిపోయేది కాదు. నిత్యమైనది. పైన ఉదాహరించిన శ్లోకంలోని "లోకేషు" అనే పదం ఈ విధంగా ఉండే లీలావిభూతి, నిత్యవిభూతులను చెబుతున్నది– అని కూడా చెప్పవచ్చు. ఈ లీలావిభూతిలోనూ శ్రీరామాయణం ఉంటుంది ఆ నిత్యవిభూతిలో కూడా శ్రీరామాయణం ఉంటుంది.

నిత్యవిభూతిలోకి వెళ్లినప్పటికీ, అక్కడ కూడా శ్రీరామాయణాన్ని శ్రవణం చేయవచ్చునా? అని అంటే, తప్పక శ్రీరామాయణం ఆ నిత్య విభూతిలో ఉంటుంది. అక్కడ కూడా శ్రీరామాయణ కథను శ్రవణం చేయవచ్చును. అక్కడ ఏమి ఆశపడినా, అది సిద్ధిస్తుంది కదా.

మన పూర్వాచార్యులలో శ్రీపరాశర భట్టర్ అనే ఒక మహాచార్యులు ఉన్నారు. వారు శ్రీరామానుజులకు ప్రియశిష్యులైన కూరేశుల పుత్రులు. శ్రీరంగనాథునకు పురోహితులు. శ్రీరంగనాథునిపై అమితమైన అభినివేశాన్ని కలిగినవారు. ఆ స్వామికి ఒక ఆశ ఉండేది. వారికి ఎల్లప్పుడూ శ్రీరంగంలో శ్రీరంగనాథునే సేవించాలనే ఆశ ఉండేది. చివరికి వైకుంఠానికి పోవాలని ఆశ కూడా వారికి ఉండేది కాదు. వారు ఈ విధంగా అనేవారట. " నేను శ్రీరంగాన్ని వదిలి, వైకుంఠానికి వెళ్లినట్లయితే, అక్కడ కూడా, ఏ విధంగా శ్రీరంగంలో శ్రీరంగనాథుని నేను సేవిస్తున్నానో, ఆ పరమపదంలో కూడా నాకు అదే విధంగా శ్రీరంగనాథుని సేవ లభిస్తేనే, అక్కడ ఉంటాను. లేకపోతే, అండకటాహాన్ని చీల్చుకుని ఈ లీలావిభూతిలోకి వచ్చి, శ్రీరంగాన్ని చేరుకొని, శ్రీరంగనాథుని సేవిస్తాను. ఇది అసాధ్యమయ్యే కార్యమే అయినప్పటికీ, వారు ఆ విధంగా ఆశపడ్డారు. ఈ లోకంనుండి ఎవరైనా పరమ పదాన్ని చేరినట్లయితే వారు ఎవ్వరూ కూడా ఈ లోకానికి తిరిగి వచ్చే అవకాశం లేదు కద. " న చ పునరావర్తతే, న చ పునరావర్తతే" (ముక్తుడు ఈ లోకానికి తిరిగి రావడం లేదు ముక్తుడు ఈ లోకానికి తిరిగి రావడం లేదు) అని కదా శాస్త్రాలలో చెప్పబడింది. అయినప్పటికీ శ్రీపరాశర భట్టర్. ఈ విధంగా ఆశపడేవారట.

శ్రీరామానుజుల శిష్యులలో అనంతార్యులు అనేవారు ఇంకొకరు. వారు శ్రీ వేంకటాచలంలో వేంకటేశ్వర స్వామికి పుష్ప కైంకర్యాన్ని చేస్తూ ఉండేవారు. వారు వినోదంగా ఒకసారి శ్రీ పరాశర భట్టర్ ను ఈ విధంగా ప్రశ్నించారట. " పరమపదంలో భగవంతుడు రెండు భుజాలతో ఉంటాడా? లేక, నాలుగు భుజాలతో ఉంటాడా? మీ అభిమతమేమి? " అని ప్రశ్నించారట. ఎందుకు ఈ విధంగా వారు ప్రశ్నించారంటే, "శ్రీరంగంలో మూలమూర్తికి రెండు భుజాలు ఉన్నాయి. ఉత్సవమూర్తికి నాలుగు భుజాలు ఉన్నాయికదా. ఈ భట్టర్ కు శ్రీరంగంలోని స్వామిపై ఎంతో అభిమానం కదా. వీరేమీ బదులిస్తారో చూద్దాం" అనే అభిప్రాయంతో అనంతార్యులు ఈ విధంగా ప్రశ్నించారు.

అప్పుడు భట్టర్ ఈ విధంగా సమాధానం ఇచ్చారట. " వైకుంఠంలో ఉండే భగవంతునకు నాలుగు భుజాలు ఉన్నట్లుగానో తెలుస్తున్నది. రెండు భుజాలు ఉన్నట్లుగానూ శాస్త్రాలలో తెలుస్తున్నది. రెండు భుజాలు కలిగి ఉన్నవాడుగాను ప్రమాణం ఉన్నది నాలుగు

భుజాలను కలిగినవాడని కూడా ప్రమాణాలు తెలుపుతున్నాయి. ఏమని నేను బదులు చెప్పను? " అని భట్టర్ అన్నారు. అప్పుడు మళ్లీ అనంతార్యులు వారిని. " మరి, మీకు ఈ రెండు విధాలైన రూపాలలో ఏ రూపాన్ని దర్శించాలని ఆశ ఉన్నది? అని ప్రశ్నించారు. అప్పుడు భట్టర్ సమాధానాన్ని పలుకుతూ, " భగవంతుడు రెండు భుజాలను కలిగినవాడై నాకు దర్శనాన్ని అనుగ్రహిస్తే, ఆ మూర్తిని శ్రీరంగంలోని మూలమూర్తిగా భావించి దర్శిస్తాను ఆ విధంగా కాకుండా, నాలుగు భుజాలను కలిగినవాడై సేవను అనుగ్రహిస్తే, శ్రీరంగంలోని ఉత్సవమూర్తిగా భావించి దర్శిస్తాను. ఏది ఏమైనా, అక్కడ ఉండే స్వామిని శ్రీరంగంలో ఉండే స్వామి రూపంగానే దర్శనం చేస్తాను. " అని అన్నారట.

దీనినిబట్టి మనకి ఏమి అర్థం అవుతున్నది? అంటే, వైకుంఠంలో ఎవరెవరు ఏ ఏ రూపంలో సేవించాలని ఆశపడతారో, ఆ యా రూపాలలో భగవంతుడు దర్శనాన్ని అనుగ్రహిస్తాడు– అని. " యే యథా మాం ప్రపద్యంతే తాం తథైవ భజామ్యహమ్" (ఎవరెవరు ఏ యే భావనతో నన్ను భజిస్తారో, వారిని ఆ యా విధంగానే నేను సేవను అనుగ్రహిస్తాను) అని భగవద్గీతలో శ్రీకృష్ణుడు అనుగ్రహించాడు కదా. ఎవరెవరు, ఏ ఏ సమయాలలో, నన్ను ఏ ఏ విధంగా సేవించాలని ఆశపడతారో, వారికి ఆయా సమయాలలో, ఆయా విధంగా నేను సేవను అనుగ్రహిస్తాను– అని కదా ఈ సూక్తి భావం. ఆళ్వార్లు కూడా, " తమరుకందదు ఎవ్వురువమ్ అవ్వురువమ్ తానే, తమర్ ఉకందదు ఎప్పేర్ మற்ற ప్పేర్" అని ఈ వాస్తవాన్ని అనుగ్రహించారు. మనం ఏ ఏ నామాలను భగవన్మూర్తులకు పెడతామో, ఆ యా నామాలను ఆ స్వామి స్వీకరిస్తాడు. అందుచేత వైకుంఠంలోకి పోయినప్పటికీ, కూడా మనం ఆశపడినట్లయితే, అక్కడ ఉండే స్వామిని శ్రీరామునిగా దర్శించవచ్చు, శ్రీరామాయణ గాథను శ్రవణం చేయవచ్చు.

వైకుంఠంలో, ఆదిశేషపర్యంకంలో లక్ష్మీదేవితో పాటు భూదేవి, నీళాదేవి అనే ఇద్దరు కూడా భగవంతునితో కలిసి వేంచేసి ఉండేటట్లుగా ప్రమాణాలు తెలుపుతున్నాయి, మనం వింటున్నాము కదా. మరి, శ్రీవైకుంఠంలో కూడా శ్రీరాముడు ఆ విధంగానే ముగ్గురు దేవేరులతో దర్శనాన్ని ఇస్తాడా? సీతాదేవితో కూడిన శ్రీరాముని మనం భావించగలం గాని, ఈ విధంగా ముగ్గురు దేవేరులతో కలిసి ఉండే శ్రీరాముని మనం భావించగలమా? సేవించగలమా? అంటే ఆ సందేహం పనిలేదు. అక్కడ శ్రీరాముడై సాక్షాత్కరించే సమయంలో భగవంతుడు సీతాదేవితో పాటే మనకు సేవను అనుగ్రహిస్తాడు.

★★★★★

# 11. పేయాళ్వార్లు — గోదాదేవి

(ఆండాళ్ అవతారోత్సవాల సందర్భంగా)

అల్లినాళ్ తామరైమేల్ ఆరణంగిన్ ఇన్ తుణవి,
మల్లినాడాండ మడ మయిల్ –మెల్లియలాళ్,
ఆయర్ కులవేందనాగత్తాళ్ తెన్ పుదువై
వేయర్ పయంద విళక్కు.

ఈ నాచ్చియార్ తిరుమొழి ప్రబంధ తనియన్ పాశురంలో పూర్వాచార్యులు గోదాదేవిని ఒక అద్భుతమైన దీపంగా అభివర్ణించారు. అప్పుడే ఉదయించిన తామర పుష్పంలో వేంచేసి ఉండే మహాలక్ష్మీదేవికి ఇష్టసఖి, ఆమెకు చాలా సన్నిహితంగా ఉండేది, భూదేవి. ఆమెయే పెరియాళ్వారులకు పుత్రికగా, గోదాదేవి, ఆండాళ్ అనే తిరునామాలతో అవతరించినది. ఈమె చాలా సుకుమారి. మృదువైన స్వభావం కలిగినది. మల్లినాడు అని పొగడబడే శ్రీవిల్లి పుత్తూరు దివ్యదేశాన్ని పరిపాలించినది. తన కళ్యాణ గుణాలతో అక్కడ ఉండే అందరి మనసులను ఆకర్షించి, వారికి అందరికీ నాయకి అయినది. వారికి యజమానిని అయినది. నెమలి రూపం ఎంత అందంగా, మనోహరంగా ఉంటుందో, గోదాదేవి తిరుమేని సౌందర్యం కూడా అంత అందంగా ఉంటుంది. నెమలి అనేది ఒకరి రక్షణలో తోటలో పెంచబడే పక్షి. ఆ విధంగానే గోదాదేవి కూడా శ్రీవిష్ణు చిత్తుల నందనవనంలో ఆవిర్భవించి, వారిచే పెంచబడినది అందువల్ల ఆమె అందమైన నెమలివంటిది. గొల్ల కులానికి అంతటికి అధిపతి శ్రీకృష్ణ భగవానుడు. ఆ స్వామి విషయంలో గోదాదేవి అంతు లేని ప్రేమను కలిగినది. అందువల్ల ఆ స్వామిని ఆలింగనం చేసుకొన్నది. అటువంటి గోదాదేవి అందమైన దక్షిణ దిక్కులో ఉండే శ్రీవిల్లి పుత్తూరులో, వేయర్ కులంలో అవతరించిన, విష్ణుచిత్తులవారి కులానికి అద్వితీయమైన దీపం వంటిది–. అనేది పై పాశురంలోని తాత్పర్యం.

ఈ పాశురంలో గోదాదేవి ఒక దీపంగా అభివర్ణించబడినది. దీపంతాను ప్రకాశించి, తన సమీపంలో ఉండే వస్తువులను అన్నిటిని ప్రకాశింప చేస్తుంది వాటిని కనిపించేటట్లు చేస్తుంది. చీకటిగా ఉండే చోట ఒక దీపాన్ని వెలిగించినట్లయితే, ఆ దీపం తనకు తాను గానే ప్రకాశిస్తుంది. అది ప్రకాశించడానికి ఇంకొక దీపం ఆవశ్యకం కాదు. అంతేకాక, తానుండే డే చోట ఉండే వస్తువుల స్వరూప స్వభావాలను అన్నిటిని అది

తెలియజేస్తుంది. ఆ విధంగానే, గోదాదేవి ఎటువంటిది? అంటే, అందమైన రూపంతో, కళ్యాణ గుణాలతో ప్రకాశించేది. జీవాత్మ స్వరూపం ఎటువంటిది? అనే అర్థాన్ని తాను అనుగ్రహించిన ప్రబంధాల ద్వారా మనకు తెలియజేసింది. పరమాత్మ ఎటువంటివాడు? ఆ స్వామియొక్క స్వరూప స్వభావాలు ఏమి? ఎటువంటి కళ్యాణ గుణాలను అతడు కలిగి ఉన్నాడు? అనే విషయాన్ని కూడా తెలిపింది అందుచేత, గోదాదేవి ఒక అందమైన, లోకవిలక్షణమైన దీపం అని మన పూర్వాచార్యులు తెలియజేశారు.

దీపప్రకాశంలో భగవంతుని దర్శించి అనుభవించిన ఒక ఆళ్వార్లు ఉన్నారు. వారే మహాయోగి అనే పేయాళ్వార్లు. వారు తిరువల్లి క్కేణి అనే క్షేత్రంలో అవతరించారు. ఈ దివ్యసూరికూడా దీపాల వెలుగులో భగవంతుని దర్శించి సేవించి, ఆనందించినవారు. " వైయమ్ తగళియా వార్ క్కడలే నెయ్యాక, వెయ్య కదిరోన్ విళక్కాగ" (ఈ భూమియే ఒక ప్రమిదగా సముద్రమే నేయిగా వేడిమిని కలిగిన సూర్యుడు ఒక దీపంగా చేసి) అనే విధంగా సరోయోగి ఒక జ్ఞానదీపాన్ని వెలిగించగా, పూదత్తాళ్వారులు " అన్బే తగళియా ఆర్వమే నెయ్యాగ--నన్బురుకి ఞానచ్చుడర్ విళక్కేற்றினేన్" అని ఇంకొక జ్ఞానదీపాన్ని వెలిగించారు. ఈ రెండు జ్ఞానదీపాలు గొప్పగా అంతటా ప్రకాశించగా, ఆ ప్రకాశంలో మహాయోగికి భగవానుని దర్శనం అత్యద్భుతంగా లభించింది. అప్పుడు వారు "తిరుక్కండేన్, పొన్ మేని కండేన్, ----శెరు క్కిళరుమ్ పొన్నాழிకండేన్, ఎన్నాழிవణ్ణన్ పాలిన్టు" అని అంటూ మిగిలిన ఇద్దరు దివ్యసూరులు వెలిగించిన జ్ఞానదీపాల ప్రకాశంలో భగవత్సాక్షాత్కారాన్ని పొంది, పరిపూర్ణంగా స్వామిని అనుభవించి, తమ అనుభవాన్ని వ్యక్తం చేస్తూ, అందమైన పాశురాలను కూర్చి మూన్ఱామ్ తిరువందాది అనే ఒక ప్రబంధాన్ని పాడారు. గోదాదేవి అవతారోత్సవాలు జరిగే ఈ సందర్భంగా ఇపుడు మహాయోగితో ఆమెకు కల కొన్ని సామ్యాలను అనుసంధానం చేసికొందాం.

పేయాళ్వారులు రెండు దీపాల సహాయంతో భగవంతుని దర్శనాన్ని పొందారుకదా. ఇదే విధంగా గోదాదేవి కూడా రెండు దీపాల సహాయంతో భగవంతుని దర్శించి, అనుభవించింది. మొదట, తానే ఒక అద్భుతమైన దీపం. అంతకుమించి ఆమె వేరు రెండు దీపాల ప్రకాశంలో భగవంతుని అనుభవాన్ని పొందింది. తిరుప్పావై ప్రబంధంలోని 19వ పాశురం "కుత్తు విళక్కు ఎరియ కోట్టు క్కాల్ కట్టిల్ మేల్ మెత్తెన్న పంజరశయనత్తిన్ మేలేఱి, కొత్తలర్ పూమ్ కుழల్ నప్పిన్నై కొంగై మేల్ వైత్తు క్కిడంద మలర్ మార్బా! " ఇత్యాదిగా ఉన్నది. నీళాదేవి, శ్రీకృష్ణుడు శయన మందిరంలో ఉన్నారు. ఆ

మందిరంలో ఒక గుత్తి దీపం గొప్పగా ప్రకాశిస్తున్నది. ఆ మందిరంలో అంతటా విశదమైన వెలుగును అది ప్రసరింప చేస్తున్నది. చుట్టూ ఉండే పదార్థాలను వ్యక్తం చేస్తున్నది. అది బాహ్యదీపం కనుక, బయట ఉండే చీకటిని తరిమి కొడుతుంది. భగవంతుని దివ్య మంగళ విగ్రహాన్ని దర్శింప చేస్తుంది. సరోయోగి " వైయమ్ తగళియా" అనే విధంగా వెలిగించిన జ్ఞానదీపంకూడా భగవంతుని రూపాన్ని ప్రకాశింప చేసినది. అందువల్ల ఈ గుత్తిదీపాన్ని సరోయోగి వెలిగించిన దీపంగా భావించవచ్చు.

"కొత్తలర్ పూమ్ కుళ్ళల్ నప్పిన్నై కొంగై మేల్ వైత్తు క్కిడంద" అని విధంగా భగవంతుని మనం తెలుసుకోవాలంటే, ఆ స్వామి పక్కన ఉండే నీళాదేవి సహాయంతోనే సాధ్యం అవుతుంది. ఆమె పురుషకారంతో కదా శ్రీకృష్ణ భగవానుని తెలిసికోవడానికి పొందడానికి వీలవుతుంది. అందువల్ల ఆమె ఒక అపూర్వమైన దీపం- అని మన పూర్వాచార్యులు తెలియజేస్తారు. పూదత్తాళ్వార్లు "అన్బే తగళియా ఆర్వమే నెయ్యాగ--నన్బురుకి ఞానచ్చుడర్ విళక్కేఱ్ఱినేన్" అని చెప్పిన విధంగా తాము ఒక దీపాన్ని వెలిగించినట్లు అన్నారు. భగవంతునిపై అంతు లేని ప్రేమను కలిగిన నీళాదేవిని ఇక్కడ ఒక దీపంగా గ్రహించడంలో లోటు లేదు. ఎల్లప్పుడూ ఆమె శ్రీకృష్ణ భగవానునిగూర్చే ఆలోచిస్తుంది, కనుక, ఆమె ఒక ప్రేమ స్వరూపిణి. అందువల్ల ఆమె ఒక అపూర్వమైన దీపం. ఈ విధంగా సరోయోగి వెలిగించిన దీపానికి సమానమైనది, శయన మందిరంలోని గుత్తిదీపం. పూత్తాళ్వారులు వెలిగించిన దీపంతో సమానమైనది, నీళాదేవి. ఈ రెండు దీపాల వెలుగులో గోదాదేవి నీళాదేవివక్షస్సులో చేయునించి ఉండే శ్రీకృష్ణ పరమాత్మను దర్శించినది. పూదత్తాళ్వార్లు రెండు దీపాల వెలుతురులో పరమాత్మ దర్శనాన్ని పొందినట్లే, గుత్తిదీపం, నీళాదేవి-అనే రెండు దీపాల ప్రకాశంలో గోదాదేవి శ్రీకృష్ణ పరమాత్మను దర్శించినది.

పేయాళ్వారులకు కల వైలక్షణ్యం ఏమంటే, మొట్టమొదటగా" ఆ పరమాత్మ లక్ష్మీసహితుడు" అనే విషయాన్ని తమ ప్రబంధంలో స్పష్టంగా ఆరంభంలోనే "తిరుక్కండేన్, పొన్ మేని కండేన్, -----శెరు క్కిళరుమ్ పొన్నాళ్ళి కండేన్ ఎన్నాళ్ళి వణ్ణన్ పాలిన్ను " అని తెలియజేశారు. ప్రారంభంలోనే "మహాలక్ష్మిని సేవించాను. ఆ స్వామి వక్షఃస్థలంలో లక్ష్మీదేవి అవధివసించి ఉన్నది. ఆ దివ్య దంపతులిద్దరూ ఒకరినొకరు విడువకుండా ఎల్లప్పుడూ కలసి ఉంటారు. ఆ విధంగా లక్ష్మీసహితుడైన నారాయణుడే పరతత్త్వం. ఇతడు జగత్తుకు అంతటికి స్వామి-అనే తత్త్వాన్ని చాలా అందంగా వ్యక్తం

చేశారు. మొదటి పాశురంలోనే కాకుండా, వారు ఈ లక్ష్మీసంబంధాన్ని ఇంకా అనేక పాశురాలలో ప్రస్తావించారు. రెండవ పాశురంలో కూడా. " అన్ఱు తిరు క్కండుకొండ నెడుమాలే" అని లక్ష్మీసంబంధాన్ని స్తుతించారు. సముద్ర మథన సందర్భంలో లక్ష్మి అవతరించినది–. అని పురాణాలు తెలుపుతున్నాయి. ఆ విధంగా ఆవిర్భవించిన లక్ష్మీదేవి తన చేతిలో ఒక అందమైన తామర పువ్వును ధరించి, " పశ్యతాం సర్వదేవానాం యయౌ వక్షఃస్థలం హరేః" (దేవతలందరూ చూస్తూ ఉండగానే లక్ష్మీదేవి భగవానుని వక్షఃలాన్ని చేరింది) అని చెప్పినట్లుగా భగవంతుని హృదయ పీఠాన్ని అలంకరించింది. అందరూ చూస్తూ ఉండగా "తన నాథుడు నారాయణుడే" అనే విషయాన్ని తెలియజేసింది. ఆ విధంగా తెలియజేస్తూ, ఆ స్వామి హృదయసీమను చేరింది– అని పురాణాలు తెలుపుతున్నాయి. ఆ సందర్భాన్ని ఇక్కడ పేయాళ్వారులు "అన్ఱు తిరు క్కండుకొండ తిరుమాలే" అనే సూక్తి ద్వారా తెలియజేశారు. ఆ తరువాతకూడా పేయాళ్వార్లు తమ ప్రబంధంలోని మూడవ పాశురంలో "మలరాళ్ తనత్తుళ్ళాన్" (భగవానుడు లక్ష్మీదేవి వక్షఃస్థలంలో ఉన్నాడు) అని అన్నారు. భగవానుని వక్షస్సులో లక్ష్మీదేవి అధివసించి ఉన్నది ఆ లక్ష్మీదేవి హృదయ సీమపై భగవంతుడు వేంచేసి ఉన్నాడు– అనే విషయాన్ని ఈ సూక్తిద్వారా వారు అందంగా సూచించారు. ఈ విధంగా తమ దివ్య ప్రబంధంలోని మొదటి మూడు పాశురాలలో లక్ష్మీసంబంధాన్ని పేయాళ్వారులు చాలా హృద్యంగా ప్రస్తావించారు.

ఇదే క్రమంలో గోదాదేవి కూడా తమ మొదటి ప్రబంధం తిరుప్పావైలో, భగవంతుని ఆశ్రయించేటప్పుడు మూడు పాశురాలలో భగవంతునితో నీళాదేవిసంబంధాన్ని, ఆమె కళ్యాణ గుణాలను ప్రస్తావన చేసింది. ఆమెకు కల అతిశయాలను కీర్తించింది. ఆ పాశురాలు ఏవి? అంటే, "ఉందు మద కళిற்றన్––– నందగోపాలన్ మరుమకళే! నప్పిన్నాయ్! "", "కుత్తు విళక్కు ఎరియ –– ", "ముప్పత్తు మూవర్" అనే పాశురాలు. "ఉందు మద కళిற்றన్" అనే మూడు పాశురాలలో గోదాదేవి నీళాదేవియొక్క కళ్యాణ గుణాలను అన్నిటిని ప్రస్తావించి కీర్తించింది.

ఇక్కడ విశేషం ఏమంటే, పేయాళ్వార్లు "తిరు క్కండేన్" (లక్ష్మీదేవిని సేవించాను) అని అంటూ కేవలం లక్ష్మీదేవిని సేవించినట్లు మాత్రమే తెలియజేశారు. గోదాదేవి అయితే, " ఉందు మద కళిற்றన్–" అనే పాశురంలో నీళాదేవియొక్క స్వభావాలను, , గుణాలను అన్నిటిని వివరించినది.

తరువాత, "కుత్తు విళక్కెఱియ" అనే తిరుప్పావై ప్రబంధంలోని 19వ పాశురంలో నీళాదేవినేత్ర సౌందర్యాన్ని అందంగా ప్రస్తుతించినది. ఈ పాశురంలో గోదాదేవి "మై త్తడమ్ కణ్ణినాయ్" అని అంటూ నీళాదేవి నేత్రసౌందర్యాన్ని కీర్తించినది. నీళాదేవి తన నేత్రసౌందర్యంతో భగవంతుని వశం చేసికొని బంధింస్తుందట. నీళాదేవి ఒక పర్యాయం తన అందమైన కన్నులతో భగవంతుని వైపు చూస్తే చాలు. భగవంతుడు ఆమెకు వశుడైపోయి, కిమ్మనకుండా ఉండిపోతాడట. అందువల్లనే. "మై త్తడమ్ కణ్ణినాయ్" అని గోదాదేవి పలికింది–అని మన పూర్వాచార్యులు తెలియజేస్తారు. ఈ విధంగా నీళాదేవి తన అందమైన కన్నులతో భగవంతుని స్వాధీన పరుచుకుంటున్నది– అనే అర్థం ఇక్కడ చెప్పబడినది.

ఈ విధంగానే, పేయాళ్వార్లు తమ ప్రబంధంలోని రెండవ పాశురంలో మహాలక్ష్మిని గూర్చి ప్రస్తావిస్తూ " అన్ఱు తిరు క్కండుకొండ తిరుమాలే" (అప్పుడు, సముద్రమథనసందర్భంలో లక్ష్మీదేవి దర్శించిన లక్ష్మీనాథా! ) అని మహాలక్ష్మి దేవి తన అందమైన నేత్రాలతో భగవంతుని చూచి, వరించి, అనుభవించిన విషయాన్ని పలికారు.

గోదాదేవి అనుగ్రహించిన తిరుప్పావై ప్రబంధంలోని "ముప్పత్తు మూవర్" అనే 20 వ పాశురంలో నప్పిన్నై తిరుమేని సౌందర్యం "శెప్పెన్న మెన్ములై చ్చెవ్వాయ్ శిఱు మరుంగుల్" ఇత్యాదిగా వర్ణింపబడుతున్నది. నీళాదేవివక్షఃస్థలంలో భగవంతుడు ఆనందంగా వేంచేసి ఉన్నాడు, ఆమె వక్షస్సును అతడు ఆనందంగా ఆలింగనం చేసికొన్నాడు– అనే అర్థాన్ని ఇక్కడ గోదాదేవి పలికినది.

పేయాళ్వార్లు తమ ప్రబంధంలోని మూడవ పాశురంలో "మలరాళ్ తనత్తుళ్ళాన్" (పద్మంలో ఆవిర్భవించిన లక్ష్మీదేవి వక్షస్సులో ఉన్నాడు) అని అంటూ, భగవానుడు మహాలక్ష్మి విషయంలో మిక్కిలి ప్రేమను కలిగినవాడై, ఆమె వక్షస్సును ఆలింగనం చేసుకున్నాడు– అనే అర్థాన్ని తెలియజేస్తూ, ఆమె తిరుమేని సౌందర్యాన్ని ప్రస్తుతించారు.

ఈ విధంగా మహాయోగిప్రబంధంలోని మొదటి మూడు పాశురాలలో ఎటువంటి అనుభవం వ్యక్తం అవుతున్నదో, , గోదాదేవి తిరుప్పావై ప్రబంధంలో నీళాదేని గూర్చి ప్రస్తావించిన మూడు పాశురాలలోకూడా అటువంటి క్రమమే మనకు సాక్షాత్కరిస్తున్నది– అనే ఒక సామ్యం ఇక్కడ మనం దర్శించవచ్చు.

ఇప్పుడు ఇంకొక సామ్యాన్ని వీరిద్దరి మధ్య అనుసంధించవచ్చు. గోదాదేవి తన ప్రబంధంలోని పలు పాశురాలలో, ఏ విధంగా భగవానుడు తనకు అనుభవాన్ని

ప్రసాదించాడో, ఆ క్రమాన్ని తన రెండవ ప్రబంధం అయిన నాచ్చియార్ తిరుమొழிలో తెలియజేసింది. అన్ని విధాలైన స్థితులలో భగవంతుడు లక్ష్మీదేవితో కలిసి ఉన్న సన్నివేశంతోనే తనకు సాక్షాత్కరించాడు– అని ఆమె తెలిపినది.

ఆ ప్రబంధంలో " తీమై శెయ్యుమ్ శిరీదరా! ఎంగళ్ శిற்றில் వందు శిదైయేలే" (తుంటరి పనులను చేసే శ్రీధరా! మా బొమ్మరిళ్ళను నీవు కూలగొట్టవద్దు) అని లక్ష్మీసహితుడైన స్వామిగానే శ్రీకృష్ణుని దర్శించి పలికింది. ఈ సందర్భం గోదాదేవి ప్రణయ రోషంతో పలికే సందర్భం అయినప్పటికీ, తనకు సాక్షాత్కరించిన భగవంతుని స్వరూపం లక్ష్మీ సనాథంగానే ఉన్నదని అన్నది. ఆ విధంగానే, "మన్ను పెరుమ్ పుగழ் మాదవన్ మామణి వణ్ణన్ –– ఉగందదు" అని అంటూ వేరొక దశకంలో గోదాదేవి చాలా సంతోషంతో పలుకుతున్నది. అప్పుడు కూడా తనకు భగవంతుడు మాధవుడుగానే, అంటే, లక్ష్మీపతిగానే సాక్షాత్కరించినట్లు తెలుపుతున్నది. లక్ష్మీసహితుడైన స్వామి విషయంలోనే తన మనస్సు లగ్నమైనదని అన్నది. వేరొక సందర్భంలోకూడా "వారణ మాయిరమ్" అనే దశకంలో "కోళరి మాదవన్ గోవిందన్ యెన్బానోర్ కాళై పుకుద కనా క్కండేన్" అని అంటూ తనకు స్వప్నంలో అనుభవానికి వచ్చిన కల్యాణ వృత్తాంతకథనసందర్భంలో, ఆ భగవానుడు మాధవుడుగానే సాక్షాత్కరించాడు, ఆ రూపంతోనే తనను వివాహమాడాడు– అని అన్నది. " మాదవన్ తన్ వాయ్ చ్చువైయుమ్ నాற்றముమ్ శొల్లాழிవెణ్ శంగే" అని అంటూ వేరొక సందర్భంలో పాంచజన్య శంఖాన్ని ఉద్దేశించి పలుకుతూ, లక్ష్మీసహితుడైన పరమాత్మ యొక్క అధరమాధుర్యం ఎటువంటిదో తెలుపమని అన్నది. " విణ్ణీల మేలా ప్పూ" అనే దశకంలో వేంకటాద్రిపై సంచరించే మేఘాలను ఉద్దేశించి పలుకుతూ, " "ఎన్ తిరుమాలుమ్ పోందానో? " లక్ష్మీసహితుడైన పరమాత్మ మీతో పాటు వచ్చాడా? మీరు ఆ స్వామిని చూశారా? అని ప్రశ్నించింది. ఈ విధంగా, విరహంలో, సంశ్లేషంలో, కలను కనిన సందర్భంలో, అన్ని సందర్భాలలోను లక్ష్మీసహితుడైన భగవంతునే గోదాదేవి అనుభవించినది– అని ఏర్పడుతున్నది. ఇది కూడా మహాయోగితో గోదాదేవికి కల ఒక సామ్యం.

మహాయోగి పరమభక్తి అనే దశను తమ ప్రబంధంలో వ్యక్తం చేశారు. భక్తిలో పరభక్తి, పరజ్ఞానం, పరమభక్తిఅనే మూడు దశలు ఉన్నాయి. వీటిలో ఉత్తమ ఉత్తమమైన దశ పరమభక్తి. ఈ పరమ భక్తిదశలో, "భగవంతుని అనుభవం మరుక్షణమే కలగాలి"– అనే తీవ్రమైన ఆర్తి కలుగుతుంది. భగవంతుని అనుభవం ఎల్లప్పుడూ కలగాలి– అనే అభినివేశం

ఏర్పడుతుంది. అంతేకాదు, భగవంతుడు తనను విడిచి ఎక్కడ వెళ్లిపోతాడో? ఏమో! అనే భీతి కూడా కలుగుతుంది. ఇటువంటి పరమ భక్తిదశను వ్యక్తం చేస్తూ మహాయోగి తమ ప్రబంధాన్ని అనుగ్రహించారు– అని మన పూర్వాచార్యులు వ్యాఖ్యానించారు తమ ప్రబంధం ప్రారంభంలోనే ఆళ్వార్లు "తిరు క్కండేన్, పొన్ మేని కండేన్" (, లక్ష్మీదేవిని దర్శించాను, బంగారు వలె మెరిసే భగవంతుని తిరుమేని దర్శించాను) అని ఆ భగవానుని దర్శించి ఆనందించినట్లుగా పలికారు. ఒక సముద్రంలో లోపలకు మునిగి ఆనందించేవాడు, ఆ సముద్రంలో ఉండే అమూల్యమైన రత్నాలు, పగడాలు, వజ్రాలు మొదలైనవానిని వేరువేరుగా గమనించి చూచి, ఏ విధంగా ఆనందిస్తాడో, ఆ విధంగానే, ఈ అళ్వార్లు, " సముద్రంవలె నల్లని వర్ణాన్ని కలిగినవాడై భగవానుడు ప్రకాశిస్తున్నాడు. అతనిలో లక్ష్మీదేవిని దర్శించాను. భగవంతుని బంగారువలె మెరిసే రూపాన్ని దర్శించాను, ఆ స్వామి చేతిలో ధగధగా మెరిసే సుదర్శన చక్రాన్ని దర్శించాను. పురులను కలిగిన పాంచజన్య శంఖాన్ని దర్శించాను. ఆ భగవానుని తిరుమేనిలో ఇంతటి, ఇన్ని అనుభవాలను నేను పొందాను. ఆ స్వామి తిరుమేనిలోని ప్రతి అవయవాన్ని దర్శించి ఆనందించాను" అని చాలా సంతోషంతో తమ ప్రబంధం ఆరంభంలోనే తెలియజేశారు. ఇది ఆ ఆళ్వారులకు కలిగిన పరమభక్తి దశను తెలియజేస్తున్నది– అని మన ఆచార్యులు తెలియజేస్తారు.

ఇదే క్రమంలో గోదాదేవి కూడా తమ ప్రబంధంలో చివర, " పట్టి మేయ్ న్దోర్ కారే " అనే దశకంలో తనకు కలిగిన పరమభక్తి అనే దశను వ్యక్తం చేసినది. ఆ దశకంలోని పది పాశురాలలోనూ శ్రీకృష్ణ భగవానుడు చేసిన పలు విధాలయిన లీలలను ప్రస్తావిస్తూ, అటువంటి స్వామిని "విరుందావనత్తే కండోమే" (శ్రీకృష్ణ భగవానుని బృందావనంలో దర్శించాము). అని అన్నది. ఈ విధంగా ఆమె పలుకడం ఆమెకు కలిగిన పరభక్తిని తెలియజేస్తుంది– అని పూర్వాచార్యుల వ్యాఖ్య.

ఇక్కడ విశేషం ఏమంటే, మహాయోగి తమకు కలిగిన పరమ భక్తిని తెలియజేసేటప్పుడు, తాము ఒక్కరే భగవంతుని అనుభవాన్ని పొందినట్లుగా తెలిపారు. తావన్మాత్రంతో వారికి తృప్తి కలిగింది. కానీ, గోదాదేవి అంతమాత్రంతో తృప్తిపడే స్వభావం కలిగినది కాదుకదా. ఆమెకు కల పరమ భక్తి ఇంకా ఉన్నత దశకు చేరినది. అందువల్ల, తిరుప్పావై ప్రబంధంలోని ఆరంభంలోనే "నీరాడ ప్పోదువీర్ పోదుమినో నేరిழையీర్! " ధనుర్మాస వ్రతస్నానం చేయాలనే ఆశను కలిగినవారు అందరూ రండి) అని తనతో పాటు ఆశను, ఆసక్తిని కలిగిన అందరిని కలుపుకొని కదా, ఆ శ్రీకృష్ణ భగవానుని సేవించాలని

వెళ్ళింది. అందువల్ల ఆమెకు కలిగిన పరమ భక్తి దశ మరింత ఉన్నతమైనది. ఆమె అనుభవం ఎటువంటిది? అంటే, "పలువురు భక్తురాండ్రతో కలసి బృందావనంలో ఆ శ్రీకృష్ణభగవానుని దర్శించి ఆనందించాము " అని పలుకుతున్నట్లుగా ఆమె రెండవ ప్రబంధంలోని చివరి దశకంలోని పాశురాలు ఉన్నాయి. ఆ దశకంలో –కొందరు భగవద్భక్తురాండ్రు అందరూ ఆ శ్రీకృష్ణ భగవానుని దర్శించాలి అని తలచి, " మీరు ఆ శ్రీకృష్ణుని ఎక్కడైనా దర్శించారా? " అని మిగిలిన భక్తురాండ్రను ప్రశ్నించగా, , వారు కూడా "ఇదిగో! ఈ బృందావనంలో ఈ ప్రదేశంలో సేవించాము. ఈ ప్రదేశంలో మేము ఆ స్వామిని దర్శించాము" అని బదులు పలికే రీతిలో సన్నివేశంలో ఆ దశకం గోచరిస్తుంది. ఈ విధంగా భక్తురాండ్రు అందరూ కలిసి భగవంతుని అనుభవాన్ని పొంది ఆనందించినట్లు మనకు ఆ సందర్భం తెలియజేస్తున్నది. ఇది గోదాదేవికి పరమభక్తిదశలోని ఉన్నతమైన దశ. ఈ దశనే గోదాదేవి తమ ప్రారంభప్రబంధంలోని ఆరంభంలోనూ, చివరి ప్రబంధంలోని చివరిలోనూ వ్యక్తం చేసినందున, ఆమె ప్రబంధాలు అన్ని పరమ భక్తి దశను సూచించేవి. ఆమె అనుభవం చాలా ఉన్నతమైన పరమ భక్తిదశను సూచిస్తున్నది – అని తెలుస్తున్నది. అందువల్ల మహాయోగికి కలిగిన పరమ భక్తిదశ కంటే కూడా ఉన్నతమైన దశను ఈమె పొందినది– అని ఏర్పడుతున్నది.

ఇప్పుడు ఇంకొక సామ్యాన్ని వీరి ప్రబంధాలలో మనం గమనిద్దాం. పేయాళ్వార్లు తమ ప్రబంధంలోని ఒక పాశురంలో నాయికా భావంతో పలికారు. "వెఱ్పెన్ఱు వేంగడమ్ పాడుమ్" అనే దశకంలో వారు తమలో నాయికాభావాన్ని ఆరోపించుకుని పలికినట్టు వ్యాఖ్యాతలు వ్యాఖ్యానించారు. ముదలాళ్వార్లు సరోయోగి, భూత యోగి, మహాయోగి అని ముగ్గురు. ఈ ముగ్గురిలో, నాయికా భావంతో పాశురాన్ని పాడినవారు ఈ మహాయోగి ఒక్కరే. పై పాశురంలో మాత్రమే నాయికాభావం గోచరిస్తుంది.

పైన ఉదాహరించిన పాశురంలో, మహాయోగి తిరుమలపై నెలకొని ఉండే వేంకటేశ్వరుని విషయంలో నాయికా భావాన్ని పొంది పలికినట్లు మనకు గోచరిస్తుంది. ఏదైనా ఒక కొండను గూర్చి ప్రస్తావన చేయవలసి వచ్చినప్పుడు, ఈ ఆళ్వార్ నాయకి భగవానుడు ఉండే వెంకటాద్రి నామాన్నే చెబుతున్నదట. అందమైన నల్లని తన కురులలో అలంకారంగా దేనిని ముడుచుకుంటున్నది? అని అంటే, భగవానుడు తన పాదాలలో ధరించిన తులసీమాలనే. ఇక మరి ఏ పుష్పాన్ని ఆమె తలలో అలంకరించుకోదు. స్నానం చేయాలి అంటే, విశాలమైన బాహువులను కలిగిన భగవానుడు శయనించి ఉండే ఆ

పాలసముద్రంలోనే స్నానం చేస్తుందట. పర్వతాలను గురించి చెప్పేటప్పుడు వెంకటాద్రిని గూర్చియే ఈ ఆళ్వార్ నాయకి చెబుతున్నది. భగవత్సంబంధాన్ని కలిగిన తులసినే ముడుచుకుంటున్నది. భగవంతుడు శయనించి ఉండే ఆ పాలసముద్రంలోనే స్నానం చేయగోరుతున్నది. ఇది మహాయోగి తమ ప్రబంధంలో నాయికాభావంతో ప్రదర్శించిన గొప్ప అనుభవం.

ఇక, గోదాదేవి విషయంలో గమనించినప్పుడు, ఆమె సహజంగానే స్త్రీ కనుక, తనలో నాయికా భావాన్ని ఆరోపించుకోవలసిన అక్కరలేదు కదా. అందువల్ల సహజంగానే భగవంతుని విషయంలో నాయికాభావాన్ని పొంది, పాశురాలను పలికినది. ఆమెకు ఏ పర్వతం ఉద్దేశ్యం? ఏ పర్వతాన్ని దర్శించాలని ఆమె ఆశపడుతున్నది? అని అంటే, "కోవర్ త్తనత్తు ఎన్నై ఎయ్ త్తిడుమిన్" అని అంటూ –"భగవానుడు గోవులను రక్షించడం కోసం తన చిన్న వయసులోనే ఆ పెద్దదైన ఆ గోవర్ధనగిరిని తన చేతిలో ధరించాడు కదా. ఆ విధంగా, గోవర్ధనగిరిని ధరించిన ఆ స్వామి దగ్గరకు వెళ్లి, నేను కూడా ఆ పర్వతాన్ని పట్టుకోవాలి, ఆ స్వామికి నేను సేవను చేయాలి– అని తనకు కల ఆశను వ్యక్తం చేసింది. అందువల్ల ఈమెకు ఏ పర్వతం అభిమతమైనది? అని అంటే, గోవర్ధన పర్వతమేకదా. సాక్షాత్తు ఆ శ్రీకృష్ణ భగవానుడే తన చేతులతో ఆ గోవర్ధన పర్వతాన్ని ఎత్తి, పట్టుకున్నాడు అంటే, ఆ పర్వతానికి ఎంతటి అతిశయం ఉన్నది!

ఈ విధంగానే, "కోలాల్ నిరై మెయ్ త్తాయనాయ్ ––నీలార్ తణ్ణమ్ తుழாయ్ కొండు ఎన్ కుழల్ మేల్ శూట్టి" అనే సూక్తిలో– " శ్రీకృష్ణ స్వామి ముళ్ళు కర్రను చేతబట్టుకొని, గోబృందాన్ని అంతటినీ మేపాడు కదా. ఆ స్వామి పాదాలలో ఉండే తులసిని తీసుకొని వచ్చి, నా కురులలో అలంకరించండి. " అని తన ఆశను తెలియజేసింది. అందువల్ల శ్రీకృష్ణుని పాదాలలో సంబంధం కలిగిన తులసితో తన కురులు అలంకరింపబడాలి– అనే ఆశను గోదాదేవి వ్యక్తం చేసింది.

ఇంకొక పాశురంలో ఆమె, "ఇంగుற்றை வாழ்వు ఒழிయవే పోయ్ యమునైక్కరైక్కు ఎన్నై ఉయ్ త్తిడుమిన్" (ఇక్కడ నివాసం లేకుండా ఉండేటట్లు పోయి, యమునానదీ తీరానికి నన్ను చేర్చండి) అని అంటూ ఏ తీర్థంలో స్నానమాడాలని ఆశపడింది? అని అంటే, యమునానదీ తీరంలో స్నానం చేయాలని ఆశపడింది. అక్కడే కదా, శ్రీకృష్ణభగవానుడు గోపికలతో కలసి ఆనందాన్ని అనుభవించాడు. తిరుప్పావై ప్రబంధంలో కూడా గోదాదేవి "తూయ పెరునీర్ యమునై" (పవిత్రమైన లోతయిన నీటిని

కలిగిన యమునా నది, ) అని ఆ యమునా తీరాన్ని కీర్తించింది కదా. అందువల్ల శ్రీకృష్ణభగవానునితో అవినాభావ సంబంధాన్ని కలిగిన యమునానదిలో స్నానం చేయాలని ఆమె ఆశపడింది.

ఈ విధంగా "శ్రీకృష్ణ భగవానుడు ధరించిన గోవర్ధన పర్వతాన్ని చేరాలి, ఆ స్వామి తన పాదాలలో ధరించిన తులసిని తలలో ధరించాలి, ఆ స్వామితో సంబంధం కలిగిన యమునానదిలో జలకమాడాలి" అనేది గోదాదేవికి కల ఆశయం, ఆశ.

ఇక్కడ విశేషమేమంటే, మహాయో ఎక్కడో చాలా దూరంలో ఉండే పాలసముద్రంలో తీర్థమాడాలని ఆశపడ్డారు. కానీ, గోదాదేవి అయితే, శ్రీకృష్ణ భగవానుని సంబంధాన్ని కలిగిన, అతడు గోపికలతో కలసి స్నానం చేసి విహరించిన యమునా నదిలో స్నానం చేయాలి–< అని ఆశపడింది ఇది. గోదాదేవికి కల అతిశయం.

మహాయోగి భగవంతుని ఒక మందుగా అభివర్ణించారు. " వరు నరకమ్ తీర్ క్కుమ్ మరుందు" (భక్తులకు ఏర్పడే నరకాన్ని తీర్చే మందు" అని, " మరుందుమ్ పొరుళుమ్ అముదముమ్ తానే" అని అంటూ భగవానుని ఒక అలౌకికమైన మందుగా వర్ణించారు "వైద్యో నారాయణో హరిః", "భేషజం భిషక్" అని చెప్పినట్లుగా, భగవానుడు సంసారం అనే మహావ్యాధిని తీర్చే గొప్ప వైద్యుడుగా ఉన్నాడు, మందుగా కూడా ఉన్నాడు. లోకంలో మందు, మనకు కలిగిన వ్యాధులను పోగొడుతుంది. మందువంటి భగవంతుడు కూడా ఈ సంసార సంబందమనే రోగాన్ని, మాటిమాటికి జన్మ మరణాలను కలిగించే సంసార సంబంధమనే రోగాన్ని పోగొడుతున్నాడు. అందువల్ల భగవంతుడు ఒక అపూర్వమైన మందుగా ఉన్నాడు. ఇకపై సంసారం అనే వ్యాధి మనకు ఏర్పడి మనం బాధపడవలసిన అవసరం లేని విధంగా మందుగా ఉన్నాడు. "వరు నరకమ్ తీర్ క్కుమ్ మరుందు"– ఈ సంసారం అనే వ్యాధి మళ్ళీ తిరిగి కలుగకుండా ఉండేటట్లుగా నయం చేసే మందు భగవంతుడు– అని అన్నారు, మహాయోగి.

గోదాదేవి ఇంతకంటే అందంగా పలికారు. " విట్టుశిత్తన్ కోదై శొల్ మరుందామెన్ను తమ్మనత్తే వైత్తు క్కొండు వాழ్వార్ కళ్ పెరుమ్ తాళుడైయ పిరానడిక్కీழ் పిరియాదెన్నుమ్ ఇరుప్పారే" అని అంటూ విష్ణుచిత్తుల కుమార్తె అయిన, గోదాదేవి అనే పేరు కలిగిన తాను అనుగ్రహించిన ఈ దివ్య ప్రబంధ పాశురాలే ఈ సంసారం అనే వ్యాధిని తీర్చే అరుదైన మందు– అని మనసులో భావించేవారు గొప్ప మహిమను కలిగిన ఆ భగవానుని శ్రీచరణాలను ఏనాడు విడవకుండా, వాటి సాన్నిధ్యంలో ఉండగలరు, ఈ

సంసార మండలంలోనే, నిత్యసూరుల వలె ఎల్లప్పుడూ భగవానుని శ్రీచరణ సాన్నిధ్యంలో ఉంటూ, నిత్యకైంకర్యాన్ని చేసుకోగలరు– అని చాలా అందంగా పలికింది.

భగవంతుని ఒక అలౌకికమైన మందుగా మహాయోగి పలికారు. భగవంతుని గూర్చి శాస్త్రాలు పలికేటప్పుడు "సంసారబంధ స్థితి మోక్ష హేతుః" అని అన్నది. ఈ సంసారంలో మనం మాటిమాటికి జన్మిస్తున్నాము దీనికి కారణం ఆ భగవానుడే. మనం గత జన్మలలో చేసిన పుణ్యపాపరూపమైన కర్మలను గమనించి చూచి, వాటి ఫలాన్ని మనం అనుభవించేటట్లుగా చేయడంకోసం మనకు మాటిమాటికి జన్మలను భగవంతుడు కలిగిస్తున్నాడు. అందుచేత ఆ భగవంతుని సంకల్పం వల్లనే మనం ఈ సంసార మండలంలో మాటిమాటికి జన్మిస్తున్నాము. ఈ సంసారాన్ని వదిలిపెట్టి, ఆ పరమపదాన్ని చేరడానికి కారణం కూడా ఆ భగవంతుడే. ఈ విధంగా మనం సంసార మండలంలో పడి ఉండడానికి, ముక్తిని పొందడానికి, ఈ రెండిటికి కూడా కారణం ఆ భగవంతుడే అవుతున్నాడు– అని శాస్త్రాలు తెలుపుతున్నాయి. మరి, ఇటువంటి వచనాలను మనం గమనించినప్పుడు, భగవంతుని సంసారాన్ని తీర్చే మందుగా మన నమ్మగలమా? మనకు అటువంటి నమ్మకం దృఢంగా ఏర్పడుతుందా?

ఈ సందేహాన్ని తీరుస్తూ మహాయోగివంటి ఆళ్వార్లు పలికిన పాశురాలను, వాటిలోకూడా, గోదాదేవి పలికిన పాశురాలను అర్థం చేసుకుని అనుభవించినట్లయితే, దాని ఫలితంగా భగవంతుని విషయంలో స్థిరమైన నమ్మికను, భక్తిని కలిగి ఉన్నవారం అయితే, ఆ భగవంతుడు మన చేతిని విడిచిపెట్టడు. భగవంతుడనే మందు తప్పక మనకు కలిగిన ఈ సంసారం అనే వ్యాధిని తీరుస్తుంది, అంతే కాదు, ఆ స్వామిని అనుభవించడానికి ఆవశ్యకమైన బలాన్ని కూడా భగవంతుడు అనే మందు ఇస్తుంది. "య ఆత్మదా బలదా" (ఏ భగవానుడు తనను అనుగ్రహిస్తున్నాడో, అతడే తనను అనుభవించడానికి కావలసిన బలాన్ని కూడా ఇస్తున్నాడు) అని వేదం అన్నది. ఇందుచేత భగవానుడు ఏ విధంగానూ సందేహపడనక్కరలేని మందు. అటువంటి భగవానుడనే మందును ఆశ్రయించినవారు ఎక్కడో పరమ పదంలో కాక, ఈ సంసార మండలంలోనే, ఇక్కడే, ఆ స్వామి కైంకర్యాన్ని పొందగలరు. –అనే ఈ గొప్ప అర్థాన్ని గోదాదేవి పై సూక్తి ద్వారా తెలియచేసింది.

ఈ విధంగా మహాయోగి కంటే కూడా మించిన అతిశయాన్ని కలిగినది, గోదాదేవి. దీనికి కారణం ఏమి? అంటే, ఆమె ఆళ్వార్లు అందరికీ జ్ఞానపుత్రిక కదా. ఏకైక

పుత్రికకదా. దివ్యసూరులు అందరికి కల భక్తి, జ్ఞానం అంతా కలసి తండ్రుల సొత్తుగా గోదాదేవికి ప్రాప్తించింది. అందువల్ల ఆమెకు అంతటి అతిశయం కలిగింది.

అటువంటి గోదాదేవి శ్రీపాదాలను మనం ఆశ్రయిద్దాం. తరిద్దాం.

★★★★

# 12. పొయ్ గై ఆళ్వారులు— ఆండాళ్.

(ఆండాళ్ అవతారోత్సవాల సందర్భంగా)

"కర్కటే పూర్వఫల్గున్యాం తులసీకాననోద్భవామ్,
పాండ్యే విశ్వంభరాం గోదాం వందే శ్రీరంగనాయకిమ్. "

భగవంతుని ప్రధాన దివ్యపత్నులుగా కీర్తింపబడే వారు శ్రీదేవి, భూదేవి, నీళాదేవి అని ముగ్గురు. ఈ ముగ్గురికి ఎన్నో విధాలైన గొప్పతనాలు ఉన్నాయి. వాటిలో, భూదేవికి గల గొప్పతనం ఏమంటే, జగత్తును రక్షించడం కోసం తానే స్వయంగా పెరియాళ్వారుల పుత్రికగా గోదాదేవి రూపంలో అవతరించినది. ఈ గోదాదేవి ఆడి మాసం పూర్వఫల్గునీ నక్షత్రంలో అవతరించినది. పెరియాళ్వారుల నందనవనం అయిన తులసీవనంలో ఆవిర్భవించినది. అయోనిజగా ఆవిర్భవించినది. ఆమె పాండ్యదేశంలోని శ్రీవిల్లి పుత్తూరు అనే క్షేత్రంలో జన్మించినది. లోకాలను అన్నిటిని ధరించే "విశ్వంభరా" అనే పేరు కలిగిన భూదేవి గోదాదేవిరూపంలో అవతరించింది. సంస్కృతంలో ఈమెకు "గోదా" అని పేరు. ఇది ద్రావిడంలోని కోదై అనే నామానికి సంస్కృతీకరణమే. శ్రీరంగంలోని శ్రీరంగనాథునకు దివ్యపతియై, నాయకి అయినది. "కరుణయా కమలామివాన్యామ్" అనే విధంగా సాక్షాత్తు శ్రీరంగనాయకియే ఈ విధంగా అవతరించిందా? అనే రీతిలో అన్ని విధాలుగాను లక్ష్మీదేవితో పోలినది. గోదాదేవి. శ్రీరంగనాథుని వలచి, ఆ స్వామిని పతిగా పొందిన భాగ్యాన్ని కలిగినది కదా, ఈమె– అని పై శ్లోకంలోని తాత్పర్యం. ఇటువంటి గోదాదేవి అవతరించిన తిరువాడిప్పూరమ్ మహోత్సవాలు జరిగే ఈ సందర్భంగా ఆ గోదాదేవి వైభవాన్ని యథామతి అనుసంధించుకుందాం.

శ్రీమద్వరవరమునులు ఉపదేశరత్తినమాలై ప్రబంధంలో గోదాదేవి వైభవాన్ని " అంజు కుడిక్కు ఒరు శంతతియాయ్, ఆழ்வార్ కళ్ తమ్ శెయలై వింజి నిఋ్కుమ్ తన్మైయళాయ్, పింజాయ్, పழுత్తాళై ఆండాళై పత్తియుడన్ నాళుమ్ వழுత్తాయ్ మనమే! మకిழ் న్దు" అనే పాశురంలో ఆశ్చర్యకరంగా స్తుతిస్తూ, ఆమెను భక్తితో నిత్యం స్తుతించాలని ఉపదేశించారు.

గోదావరి దేవికి కల విలక్షణమైన మహిమ ఏమంటే, ఆమె ఆళ్వార్లకందరకు ఏకైక జ్ఞాన పుత్రిక. ఇక్కడ ఈ పాశురంలో "అంజుకుడి" అంటే, అళ్వార్ల కులమే. అస్థానే భయశంకతో భగవానునకు మంగళా శాసనం చేసే కులం వారిది. అందుచేత వీరంతా ఒకే

కులానికి చెందినవారు. మంగళాశాసనపరులైన ఈ దివ్యసూరులకు అందరికీ ఈ గోదాదేవి ఒకే పుత్రిక, జ్ఞానపుత్రిక. ఈ విధంగా అవతరించిన గోదాదేవి తనకు తండ్రులైన ఆళ్వారుల జ్ఞానభక్తి సంపదను అంతటిని తండ్రుల సొత్తుగా పొందినది, . కనుక, . వారికి మించిన జ్ఞాన భక్తులను కలిగినది అయినది. ఈమెకు కల వేరొక అతిశయం ఏమంటే, చిన్న వయస్సులోనే పరిపక్వమైన, భగవంతుని విషయంలో జ్ఞానభక్తులను కలిగినది అయినది. ఫలితంగా భగవంతుని అనుభవించి, తన అనుభవ పరీవాహ రూపంగా కమనీయమైన దివ్యప్రబంధాలను అనుగ్రహించినది. అందువల్ల ఈమె "పిందె దశలోనే పండిన పండువంటిది " అని అన్నారు, శ్రీవరవరమునులు. సాధారణంగా ఒక చెట్టుకు ఒక పండు పండాలంటే, ముందుగా పువ్వు పూయాలి, పిందె కలగాలి, అది కాయగా మారాలి, తరువాత అది పండుగా పరిపక్వతను చెందాలి. కానీ, గోదాదేవి ఎటువంటిది? అంటే, చిన్న దశలోనే పరిపక్వమైన జ్ఞాన భక్తులను కలిగినది అయినందున, బాల్యదశలోనే పండిన పండువంటిది అయినది. ఐదేళ్ల వయస్సులోనే ఆమె తిరుప్పావై అనుగ్రహించిందని మన పూర్వాచార్యులు తెలియజేస్తారు. ఆళ్వార్లు అందరూ ముదిరిన వయస్సులో భగవంతుని విషయంలో పరిపక్వమైన జ్ఞాన భక్తులను పొందగా, గోదాదేవి చిరు ప్రాయంలోనే అటువంటి జ్ఞాన భక్తులను పొందినది. అమృత కలశాలవంటి ప్రబంధాలను అనుగ్రహించింది. లోకాలకు ఉజ్జీవనం కలిగించింది. అందువల్లనే ఆమె ఆండాళ్ అయినది, అంటే, మనలందరిని కాపాడే నాయకి అయినది. ఇటువంటి ఆండాళ్ నాచ్చియార్ వైభవాలను అన్నిటిని మనసులో స్మరించుకుంటూ, ప్రతి దినం ఆమెనూ నమస్కరించాలి. ఆమె ఈ విధంగా అవతరించి, తన అనుష్ఠానంతోను, దివ్య ప్రబంధాలతోను అనుగ్రహించిన గొప్ప ఉపదేశాలను ప్రతిదినం స్మరిస్తూ కృతజ్ఞతాపూర్వకంగా, భక్తి పూర్వకంగా ఆమెకు నమస్కారాలను సమర్పించాలి– అని అన్నారు, శ్రీవరవరమునులు.

పై పాశురంలో శ్రీవరవరములు గోదాదేవి గొప్పతనాలను తెలియజేసేటప్పుడు, మొట్టమొదటగా "అంజుకుడిక్కు ఒరు శంతతి" (ఆళ్వారులకు ఏకైక పుత్రిక) అనే ఆమె వైభవాన్ని ముందుగా ప్రస్తావించారు. ఈ విధంగా ఈమె ఆళ్వారుల కుమార్తె కనుక, వారికి గకల స్వభావాలు ఈమెకు కూడా ఉండడంలో ఆశ్చర్యం లేదు కదా. ఆళ్వార్లు భగవంతుని ఏ విధంగా అనుభవించి ప్రస్తుతించారో, ఏ విధంగా ఎటువంటి భక్తిని కలిగి ఉన్నారో, ఆ రీతి అంతా ఈమెకు స్త్రీధనంగా సంక్రమించింది. ఆళ్వారుల అనుభవాలవంటి అనుభవాలను పొందింది. ఈ దృష్టిలో ఈ గోదాదేవికి కల కొన్ని వైభవాలను సరోయోగి అనుభవాలతో పోల్చి, మనం ఇపుడు అనుసంధించుకుందాం.

సరోయోగి ముదల్ తిరువందాది అనే దివ్య ప్రబంధాన్ని అనుగ్రహించారు. అందులోని మొదటి పాశురాన్ని ఈ విధంగా అనుగ్రహించారు.

"వైయమ్ తగళియా వార్ కడలే నెయ్యాగ
వెయ్య కదిరోన్ విలక్కాగ– శెయ్య శుడర్ ఆళియాన్
అడిక్కే శూట్టినేన్ శొల్మాలై ఇడరాళి నీంగుగవే ఎన్రు".

ఇందులో ఈ ఆళ్వార్లు తమ దివ్యప్రబంధాన్ని "శొల్ మాలై" అని ఒక వాగ్మాలికగా నిర్దేశించి పలికారు. నూరు పాశురాలు అనే నూరు పుష్పాలతో కూర్చిన ఒక మాలికను భగవంతుని శ్రీపాదాలకు వారుశసమర్పించారు.

గోదాదేవి కూడా తిరుప్పావై ప్రబంధాన్ని "పాడి కొడుత్తాళ్ నఱ్పామాలై" అనే విధంగా ఒక పూలమాలికగా కూర్చి, భగవంతునకు సమర్పించినది. 30 పాశురాలను కలిగిన అందమైనతిరుప్పావై ప్రబంధాన్ని భగవంతుని సన్నిధిలో సమర్పించింది. దాని చివరలో గోదాదేవి స్వయంగా " కోదై శొన్న శంగ త్తమిళ్మాలై"అని ఒక మాలికగా తెలిపినది. మధురమైన ద్రావిడ భాషలో కూర్చిన 30 పాశురాలను కల మాలిక– అని తన ప్రబంధాన్ని నిర్దేశించింది.

సరోయోగి తమ ప్రబంధంలోని మొదటి పాశురంలో భగవంతుని లీలా విభూతిని, నిత్యవిభూతిని ప్రస్తావించారు. లీలావిభూతి అనే ఈ జగత్తు అంతా సృష్టింపబడేది, రక్షింపబడేది, లయం చేయబడేది. అందువల్ల పరిణామాన్ని కలిగినది. నిత్యవిభూతి అనే శ్రీ వైకుంఠం ఎల్లప్పుడూ ఒకే విధంగా ఉంటుంది. దానికి ఏనాడు పరిణామం అనేది ఉండదు. సృష్టింపబడడం, లయాన్ని పొందడం అనే మార్పులు దానికి ఉండవు. "వైయమ్ తగళియా వార్ కడలే నెయ్యాగ వెయ్య కదిరోన్ విక్కాగ" అని అంటూ సరోయోగి "ఈ భూమి ఒక ప్రమిదగా ఉన్నది, సముద్రం నేయివలె ఉన్నది. సూర్యుడు దీపంగా ఉన్నాడు"– అని అనడం ద్వారా లీలావిభూతిని నిర్దేశించారు. తరువాత "శెయ్య శుడర్ ఆళియాన్ అడిక్కే" అనే సూక్తి ద్వారా నిత్య విభూతిని నిర్దేశించారు. భగవానుడు ఎల్లప్పుడూ తన కుడి చేతిలో ప్రకాశించే చక్రాన్ని ధరించి ఉంటాడు. ఈ సుదర్శన భగవానుడు నిత్యసూరులలో ఒకడు. ఇక్కడ ఈ విధంగా సుదర్శనుని నిర్దేశించడం నిత్య విభూతికి అంతటికి ఉపలక్షణం –అని వ్యాఖ్యాతల అభిప్రాయం. సుదర్శన భగవానునివలె, శ్రీవైకుంఠంలో ఎంతోమంది భక్తులు ఉన్నారు నిత్యులు, ముక్తులు ఉన్నారు. వారందరూ భగవంతునకు స్వరూపానురూపమైన సేవలను చేస్తారు. వారిలో ముఖ్యమైనవాడు సుదర్శన భగవానుడు కనుక, ఆ సుదర్శనుని

ఇక్కడ నిర్దేశించడం జరిగింది. ఈ విధంగా లీలావిభూతి, నిత్యవిభూతి అనే ఈ రెండు లోకాలు భగవంతునకు సొత్తు. ఆ స్వామి మనకు కలిగే దుఃఖాలను అన్నిటిని తీరుస్తాడు. ఆ స్వామి అనుగ్రహం వల్ల మన కష్టాలు తీరుతాయి– అనే విషయాన్ని సరోయోగి తమ మొదటి పాశురంలో తెలిపారు.

ఇటువంటి అర్థాన్నే గోదాదేవి నాచ్చియార్ తిరుమొழி అనే తన రెండవ ప్రబంధంలోని ఒక పాశురంలో తెలియజేసింది. " పొంగోదమ్ శూழ்న్ద పువనియుమ్ విణ్ణులకుమ్ అంగాదుమ్ శోరామే ఆళ్ గిన్ఱ ఎంబెరుమాన్ శెంగోలుడైయ తిరువరంగ చ్చెల్వనార్" (పొంగే కెరటాలను కలిగిన సముద్రంచేత చుట్టబడి ఉండే భూలోకం, ఆ విధంగానే పరమపదం, అనే ఈ రెండు లోకాలలో ఏదీ చెదిరిపోకుండా పరిపాలించే స్వామి శ్రీరంగనాథుడు) అనే శ్లోకంలో ఈ అర్థాన్ని తెలియజేసినది. శ్రీరంగనాథుడు తన చేతిలో గొప్ప ఆజ్ఞాదండాన్ని కలిగి ఉన్నాడు. ఆ ఆజ్ఞాదండంతో ఉభయ విభూతులలోను ఎవరికీ ఏ శ్రమ కలుగకుండా ఉండేటట్లు పరిపాలిస్తున్నాడు. అతడు ఎవరు అంటే, శ్ శ్రీరంగంలో పవేంచేసి ఉండే శ్రీరంగనాథుడే. "శెల్వనార్" మహాలక్ష్మి స్వరూపిణి అయిన శ్రీరంగనాయకితో కలసి వేంచేసి ఉండే స్వామియే– అని స్పష్టంగా ఈ పాశురంలో పలికింది.

ఇక్కడ విశేషం ఏమంటే, సరోయోగి సూక్తిలో ఉభయ విభూతులను పాలించేవాడు ఎవరు? అనే విషయాన్ని స్పష్టంగా చెప్పడం జరగలేదు. కానీ గోదాదేవి తన సూక్తి లో ఈ రెండు విభూతులను పరిపాలిస్తూ తన ఆజ్ఞా దండాన్ని చెల్లుబాటు చేసేవాడు శ్రీరంగంలోని శ్రీ రంగనాథుడే– అని స్పష్టంగా తెలిపినది.

"ఇడరాழி నీంగుగవే ఎన్ఱు" అని అంటూ సరోయోగి మన కష్టాలను అన్నిటిని ఆ భగవంతుడు తీరుస్తాడు– అని తెలియజేశారు. గోదాదేవి ఈ అర్థాన్ని చెప్పేటప్పుడు, "ఎంగోల్ వళైయా ఇడర్ తీర్వర్ ఆగాదే" అనే సూక్తిలో– "ఆ భగవంతునకు ఉభయ విభూతులను పరిపాలించేటప్పుడు ఒక కష్టం కలిగింది. అది ఏమంటే, "ఈ లీలావిభూతిలో "నేనే సర్వం" అనే విధంగా నా విషయంలో పరమభక్తిని కలిగిన భక్తుడు ఎవరూ కూడా దొరకలేదే! " అనేది ఆ బాధ. గోదాదేవి అవతరించి, భగవంతుని విషయంలో అమితమైన భక్తిని కలిగినదై, ఆ స్వామికి తగిన సేవలను చేసినది. అప్పుడు భగవంతుడు ఆమె చేతి గాజులను తీసుకొని పోయి, తన కొరతను తీర్చుకున్నాడు" అని అన్నది. "భగవంతుడు మన దుఃఖాలను తీర్చాలి" అని సరోయోగి అన్నారు. అటువంటి ఆ భగవంతుడే తన గాజులను తీసుకొని పోయి తన కష్టాన్ని కొరతను తీసుకున్నాడు– అని గోదాదేవి అన్నది.

ఇక్కడ, భగవంతుడు గోదాదేవి గాజులను తీసుకొని పోవడం అనేది ఏమి? అంటే–గోదాదేవి భగవంతుని విశ్లేషించింది. ఆ విరహబాధతో ఆమె శరీరం కృశించిపోయింది. అప్పుడు ఆమె చేతికి ధరించిన గాజులు ఆమె చేతినుండి జారి పడిపోయాయి. ఈ విధంగా జరుగడానికి కారణం ఆ శ్రీరంగనాథుడే కనుక, ఆ స్వామి తన గాజులను తీసుకొని పోయాడు– అని పలుకుతున్నది గోదాదేవి. అందువల్ల గోదాదేవి ద్వారా తన దుఃఖాన్ని పోగొట్టుకున్నవాడు ఎవరు? అంటే, "పొంగోదమ్ శూఝ్ంద పువనియుమ్ విణ్ణులకుమ్ అంగాదుమ్ శోరామే ఆళ్ గిన్ఱ ఎంబెరుమాన్ శెంగోలుడైయ తిరువరంగ చ్చెల్వనార్" అని అంటూ, ఉభయ విభూతులలో ఎవరికి ఏ కష్టం రాకుండా ఉండేటట్లు వాటిని పరిపాలించే ఆజ్ఞ దండాన్ని కల శ్రీరంగనాథుడు– అని అనడం విశేషం కదా. అందరి కష్టాన్ని తీర్చే భగవంతుని కష్టాన్ని తీర్చినది కదా, గోదాదేవి.

సరోయోగి, ముదల్ తిరువందాది అనే తమ ప్రబంధంలోని నాలుగవ పాశురంలో "నెఱి వాశల్ తానే యాయ్ నిన్ఱానై" అని పలుకుతూ, ఉపాయం, ఉపేయం అనే రెండు కూడా భగవంతుడే అని అన్నారు. "నెఱి" అంటే, ఉపాయం "వాశల్" అంటే, వైకుంఠ నగర ద్వారం, మనం ప్రవేశించవలసిన చోటు, అంటే, ప్రాప్యం.

ఈ అర్థాన్ని గోదాదేవి తమ మొదటి ప్రబంధం అయిన తిరుప్పావైలోని మొదటి పాశురంలోనే " నారాయణనే నమక్కే పఱై తరువాన్" అనే సూక్తి ద్వారా తెలిపినది. ఇక్కడ "పఱై" అంటే, ప్రాప్యం. పురుషార్థం ఆ భగవంతునకు ప్రీతిపూర్వకంగా చేసే సకల విధాలయిన సేవలు. ఇటువంటి పరమ ప్రయోజనం ఏ విధంగా లభిస్తుంది? అని అంటే, ఆ నారాయణుడే మనకు ఈ పరమపురుషార్థాన్ని అనుగ్రహిస్తాడు. మనకే ఇస్తాడు, ఆ స్వామి విషయంలో అనన్యమైన భక్తిని కలిగిన మనకే ఇస్తాడు. ఆ స్వామియే ఉపాయం ఫలం– అని భావించి, ఆ స్వామిలో స్థిరమైన నమ్మకాన్ని కలిగిన మనకే ఇస్తాడు– అని స్పష్టంగా ఈ పాశురంలో తెలిపినది.

సరోయోగి పలికేటప్పుడు, "నెఱి వాశల్ తానే యాయ్ నిన్ఱానై" అని సామాన్యంగా అన్నారు. కానీ, గోదాదేవి " నారాయణనే నమక్కే పఱై తరువాన్" అని ఈ విధంగా ప్రాప్యంగా, ఉపాయంగా ఉండే స్వామి నారాయణుడే– అనే విషయాన్ని తన సూక్తిలో స్పష్టం చేసింది. ఇది ఇక్కడ విశేషం. అంతేకాదు తన సూక్తిలో "నారాయణనే నమక్కే"– (నారాయణుడే మనకే) అని అనడం ద్వారా ఏవకారాన్ని ప్రయోగించి, "భగవానుడైన ఆ

నారాయణుడు మనకు తప్పక ఇస్తాడు" అనే అర్థంలో దృఢమైన నమ్మకంతో పలికినది. ఇది ఇంకొక విశేషం.

సరోయోగి పాంచజన్యశంఖం అంశతో అవతరించినట్లుగా కీర్తింపబడుతున్నారు. నంబిళ్ళై అనే ఆచార్యవర్యుల అభిప్రాయం ప్రకారం దివ్యసూరులు అందరూ ఈ లోకంలో ఉండే సంసారులే. భగవంతుని నిర్హేతుకమైన కరుణ వల్ల వారు పరిపూర్ణమైన, ఏ దోషం లేని జ్ఞానాన్ని పొందారు. నిత్యసూరుల అంశ కూడా వారిలో చేరింది. ఈ క్రమంలో పాంచజన్యశంఖంయొక్క అనుగ్రహం, అంటే, దాని అంశ సరోయోగిలో చేరింది. అందుచేత వారు పాంచజన్యాంశతో అవతరించినట్లు భావింపబడుతున్నారు. ఈ విధంగా పాంచజన్యశంఖం అంశతో అవతరించిన ఈ ఆళ్వార్లు పాంచజన్య ధ్వనిని గూర్చి తమ ప్రబంధంలోని పలు పాశురాలలో అనుభవించారు. "మయంగ వలంబురి వాయ్ వైత్తు", " వెణ్ శంగమ్ ఊదియవాయ్ మాల్ ఉకంద ఊర్" అని అంటూ అనేక పాశురాలలో శంఖధ్వని ప్రస్తావనను చేశారు. భగవంతుడు ఏ విధంగా తన శంఖాన్ని ఊదాడు? ఆ ధ్వనిని విని భక్తులు ఏ విధంగా ఆనందించారు? భగవద్విరోధులు అందరూ ఆ ధ్వనిని విని ఏ విధంగా నశించిపోయారు? అనే విషయాలను వారు ప్రస్తుతించారు.

ఇటువంటి అనుభవమే గోదాదేవికి కూడా లభించింది. నాచ్చియార్ తిరుమొ<u>ళి</u> అనే తన రెండవ ప్రబంధంలో "పూంగొళ్ తిరుముగత్తు మడుత్తూదియ శంగొలియుమ్ శార్ జ్ఞవిల్ నాణొలియుమ్ తలైప్పెయ్ వదు ఎఞ్ఞాన్డుకొలో! " – భగవానుడు తన ముఖంలో నోటిలో శంఖాన్ని పెట్టుకుని ఊదుతాడు కదా. ఆ సన్నివేశం ఎంత మనోహరమైనది! ఆ దృశ్యాన్ని నేను సేవించాలి. ఆ స్వామి శంఖధ్వనిని నేను వినాలి– అని ఆశపడింది. ఈ విధంగా ఒక పాశురంలో కాదు, చాలా పాశురాలలో "కర్ ప్పూరమ్ నాఱుమో? కమల ప్పూ నాఱుమో–– శొల్లా<u>ళి</u> వెణ్ శంగే! " ఇత్యాదిగా పాంచజన్య ప్రస్తావనను చేసింది. ఆ శంఖానికి గల అతిశయాలను కీర్తించింది. " ఓ పాంచజన్య శంఖమా! నీవే కదా స్వామి ముఖారవిందాన్ని స్పృశగలిగిన భాగ్యాన్ని పొందావు. ఆ స్వామి అధరాల ఆస్వాదం ఏ విధంగా ఉంటుందో, నాకు చెప్పు. నేను ఆశతో అడుగుతున్నాను" అని అన్నది. పాంచజన్యశంఖం అతిశయాలను పొగడింది.

సరోయోగి, పాంచజన్య శంఖానికి ఏ విధంగా భగవానుడు అనుభవాలను ప్రసాదించాడో సంగ్రహంగా తెలిపారు. ఆ అనుభవాలను అన్నిటిని గోదాదేవి పది పాశురాలలో మరింత విశదంగా అనుగ్రహించింది. ఇది విశేషం.

సరోయోగి తమ ప్రబంధంలో “ వాయవనై యల్లదు వాழ்త్తాదు” అని మొదలైన పలు పాశురాలలో” ఈ శరీరంలోని అవయవాలు అన్ని భగవంతునికి సేవను చేయడానికి ఉపయోగపడాలి. ఇక ఏ విధంగానూ ఎవరికి ఇవి ఉపయోగ పడకూడదు “ అని అన్నారు. ఆ విధంగానే గోదాదేవి కూడా “ మానిడవర్ క్కెన్రు పేచ్చుప్పడిల్ వాழగిల్లేన్” (ఈ నా శరీరం మానవుల కోసం అనే మాట చెవినబడితే నేను జీవించలేను) అని అంటూ పలికింది. తన శరీరం భగవంతునికే ఉపయోగపడతగినది ఇంకొకరికి కాదు అనే తన నిశ్చయాన్ని తెలిపింది. ఇక్కడ విశేషం ఏమంటే, “మానిడవర్ క్కెన్రు పేచ్చుప్పడిల వాழగిల్లేన్” అని తన శరీరం భగవంతునకు మాత్రమే ఉపయోగపడాలి –అని తాను భావించడమే కాదు, ఇతరులకు కూడా ఆ విధంగానే భావించాలి. లేకపోతే, వేరు విధంగా వారు భావించి పలికినట్లయితే, నేను జీవించలేను – అని అన్నది.

ముదలాళ్వార్లు ముగ్గురు శ్రీవేంకటేశ్వరుని విషయంలో మిక్కిలి అభినివేశాన్ని కలవారు. వారిలో, సరోయోగి మరింత అభినివేశాన్ని కలవారు. “ వేంగడవన్ తిరుమలైయై విరుంబుమవన్ వాழிయే” అని వారి మంగళాశాసన పాశురంలో ప్రశంసింపబడినారు. తమ ప్రబంధం అయిన ముదల్ తిరువందాదిలోని చాలా పాశురాలలో శ్రీవేంకటాచలాన్ని, శ్రీవేంకటేశ్వరుని ప్రస్తావించారు. తిరుమలను, అక్కడ ఉండే దృశ్యాలను, అక్కడ నివసించేవారిని గూర్చి ప్రస్తావన చేశారు. ఆ ప్రబంధాన్ని ముగించేటప్పుడు కూడా “వెళ్లత్తినుళ్ళానుమ్ వేంగడత్తు మేయానుమ్ ఉళ్ళత్తినుళ్ళాన్ “ అని అంటూ తమ మనస్సులో నిలకడగా నిలచి ఉండే రూపం వేంకటేశ్వర స్వామిదే అని తెలిపారు.

గోదాదేవి అనుగ్రహించిన తిరుప్పావై ప్రబంధానికి కల రెండు తనియన్ పాశురాలలోని ఒక పాశురంలో “ శూడి క్కొడుత్త శుడర్ క్కొడియే! తొల్ పావై పాడి అరుళవల్ల పల్ వళైయాయ్! , నాడి నీ వేంగడవర్క్కెన్నై విది ఎన్న ఇమ్మాற்றమ్ నామ్ కడవావణ్ణమే నల్గు” అని చెప్పిన విధంగా, ఆ ప్రబంధాన్ని శ్రీవేంకటేశ్వర స్వామిని ఉద్దేశించి అనుగ్రహించినది ఆ భగవంతుని దగ్గరకు చేరాలి ఆ స్వామికి స్వరూపానికి తగిన సేవలను చేయాలి– అనే ఆశతో ఈ ప్రబంధాన్ని అనుగ్రహించింది అని తెలుపబడిందికదా. ఇంతేకాదు, రెండవ ప్రబంధం అయిన నాచ్చియార్ తిరుమొழி ఆరంభంలో కూడా “ వేంగడవర్ క్కెన్నై విదిక్కిత్తియే” అని శ్రీ వేంకటేశ్వరుని ప్రస్తావనతోనే ఆరంభం చేసింది. ఆ ప్రబంధంలో ఇంకా పలు పాశురాలలో ఆ స్వామిని గూర్చి కీర్తించింది ఆ స్వామి సన్నిధిలో తాను కైంకర్యాన్ని చేయాలనే అభిలాషను వ్యక్తం చేసింది. కేవలం తిరుమలలో, అక్కడ

ఉండే స్వామి విషయంలో అభినివేశాన్ని కలిగి ఉండడమే కాదు, ఆ కొండపై సంచరించే మేఘాల పట్ల కూడా తనకు కల అభినివేశాన్ని " "వీణ్ణీల మేలాప్పూ "అనే దశకంలో– ఈ కొండపై సంచరించే మేఘాలకు ఎంత భాగ్యమో కదా! స్వామి చెంతనే ఉండి అతనిని సేవించగలుగుతున్నాయి కదా! తిరుమలలో నివాసం చేయడం అనే ఉజ్జీవనాన్ని కలిగి ఉన్నాయి కదా! అని అంటూ వాటిపై తనకు కల ఆదరాన్ని తెలిపింది.

ఈ విధంగా సరోయోగికి కల భగవద్భక్తి, వారికి కల స్వభావాలు అన్నీ కూడా గోదాదేవిలో మనకు గోచరిస్తాయి. ఇంకా వీరి సూక్తులలో చాలా పరస్పర సామ్యాలను దర్శించవచ్చు. కాని, విస్తరభీతివల్ల ఇంతమాత్రంతో విరమింపబడుతున్నది. వాటిని పెద్దల సన్నిధిలో ఆసక్తి ఉన్నవారు ప్రశ్నించి తెలుసుకోవచ్చు. స్వస్తి.

★★★★

# 13. జన్మవల్లనే జన్మరాహిత్యం

మనం ఒక ఊరికి ఒక పని కోసం వెళ్ళామని అనుకోండి. మనం అక్కడ ఆ కార్యాన్ని కదా గమనించాలి, చేయాలి. ఇంకొక కార్యాన్ని గురించి చింతించవలసిన, చేయవలసిన ఆవశ్యకత లేదు కదా. ఒకవేళ వెళ్లిన పని కంటే ఇంకొక పనిని మనం చేయాలనే అనుకున్నా, ముందు మనం అనుకున్న పనిని చేసిన తరువాత కదా, వేరొక కార్యాన్ని గూర్చి ఆలోచిస్తాము, ప్రయత్నిస్తాము. ఒక దుకాణానికి ఒక వస్తువును కొనడం కోసం వెళతాను అనుకోండి. అక్కడకు వెళ్ళినప్పుడు, ఆ వస్తువునే కదా కొనాలి, . ముందు కొనాలని అనుకున్న వస్తువును కొన్న తర్వాత కదా, వేరొక వస్తువును గురించి ఆలోచిస్తాము. వీటినిబట్టి మనకు ఒకటి నిశ్చయంగా తోస్తున్నది. అది ఏమంటే, ముందు మనం నిర్దేశించుకున్న కార్యాన్ని చేయాలి తప్ప, దానికి పూర్తిగా విరుద్ధంగా ఉండే పనిని చేయము, ఇది లోకంలో ఉండే రీతి–అని.

కానీ, ఆధ్యాత్మిక రంగంలో ఈ విధంగా కనిపించడం లేదు. దీనికి పూర్తిగా విరుద్ధంగా ఉండే సన్నివేశం మనకు గోచరిస్తుంది. ఏ విధంగా? అంటే, మనం జన్మలను ఎత్తుతున్నాము. మనం జన్మలను ఎత్తడంలో ఏమి ప్రయోజనం అని అంటే, భక్తిని కానీ, శరణాగతిని కానీ ఉపాయాలుగా ఆచరించి ముక్తిని పొందడం, అంటే, మళ్ళీ పుట్టకుండా ఉండే స్థితిని పొందడం– అనేది సమాధానం కదా.

జన్మను ఎత్తి జన్మరాహిత్యాన్ని పొందగలమా? మనం పుట్టాము. ఈ పుట్టుక ద్వారా, దానికి పూర్తిగా విరుద్ధంగా ఉండే జన్మరాహిత్యాన్ని పొందగలమా? అందువల్లనే ఆధ్యాత్మిక రంగంలో లోకరీతికి విరుద్ధంగా కనిపిస్తున్నదని చెప్పడం జరిగింది. జన్మను ఎత్తితే, మళ్ళీ వేరొక జన్మను ఎత్తడం కోసం ప్రయత్నించాలి, ప్రయత్నించవచ్చు. , తప్ప, ఎత్తిన జన్మలో "ఇకపై జన్మనే ఎత్తను" అని భావించి ఎవరైనా ప్రయత్నం చేస్తారా?

ఎవరైనా ఒకరు వైద్యకళాశాలను నిర్మించారని అనుకోండి. లేక, ఇంజనీరింగ్ కాలేజీని కట్టారని అనుకోండి. ఎందుకు వారు కట్టారు? అంటే, ఇకపై ఎవరు వైద్యశాస్త్రాన్ని చదువుకోకూడదనే, ఎవరూ ఇంజనీరింగ్ విద్యను చదువుకోకూడదనే ఉద్దేశంతో కట్టామని చెబుతారా? లేక, ఆ ఉద్దేశంతో ఆ కళాశాలలను కడతారా? ఆ విధంగా చెప్పినా, లేక అటువంటి ఉద్దేశంతో కట్టినా, అది చాలా విరుద్ధంగా ఉంటుంది కదా. జన్మను ఎత్తి జన్మరాహిత్యం కోసం ప్రయత్నించడంకూడా అటువంటిదే. మనం పుట్టాము. పుట్టిన

దానికి ప్రయోజనంగా మళ్లీ ఇక్కడ పుట్టడానికి ప్రయత్నించడం అనేది లోక సహజమైన విషయం.

కానీ, అందరూ మహర్షులు, దివ్య సూరులు, ఎవరు చెప్పినప్పటికీ, జన్మను ఎత్తడం అనేది జన్మరాహిత్యాన్ని పొందడం కోసమే– అని. ఈ విధంగా అనడం మనకు కొంత మనసులో సందేహాలను, ఆలోచనలను రేకెత్తిస్తుంది. ఒక కార్యం కోసం ఈ లోకంలోకి వచ్చిన తరువాత, వేరొక కార్యాన్ని గూర్చి ప్రయత్నం చేస్తామా? చేయాలని అనుకుంటామా? అంటే, అవును, ఆ విధంగానే చేయాలి– అనేది సమాధానం.

మనం జన్మను ఎత్తుతున్నాము. ఎందుకు ఎత్తుతున్నాము? జన్మలను ఎత్తాలని మనం ఆశపడ్డాము కనుక. ఆ విధంగా మనం జన్మను ఎత్తాలని ఆశపడ్డామా? అని అంటే, అవును ఆశపడ్డాము. జన్మించకూడదు అని మనం ఆశపడలేదు కదా. ఆ విధంగా ఆశపడకుండా ఉంటే, మనం జన్మించే అవకాశం లేదు కదా.

జన్మించిన తర్వాత ఎదురయ్యే కష్టనష్టాలను గమనించకపోతే, తెలియకపోతే, ఇక ఈ జన్మలను ఎత్తవద్దు –అనే అభిప్రాయం కలుగదు. అప్పుడు ఈ సంసారం నుండి బయటపడే అవకాశమే ఉండదు. ఈ సంసారం లోనే జన్మమరణపరంపరలతో పరిభ్రమిస్తూ ఉంటాము. ఒక వస్తువు ఒక నిర్ణీతమైన గమనాన్ని కలిగి ఉన్నది అయితే, అది ఆ క్రమంలోనే వెడుతూ ఉంటుంది. వేరొక శక్తి అనేది అడ్డువస్తే తప్ప, కాని గమనంలో మార్పు ఉండదు– అని చెబుతున్నది విజ్ఞాన శాస్త్రం. జన్మించడం వల్ల ఏర్పడే కష్టనష్టాలను మనం గమనించలేకపోయినప్పుడు, మళ్లీ మళ్లీ జన్మిస్తూనే ఉంటాము.

ఈ జన్మ మరణాల నిరంతర గమనాన్ని, క్రమాన్ని మార్చడానికి బయట ఏ శక్తి లేదు. మనలోనే ఉన్నది. మనకే జన్మల వల్ల ఏర్పడే కష్టాలు ఎటువంటివో తెలియాలి. అందువల్ల, పుట్టిన చోటనే పుట్టకుండా ఉండే స్థితిని మనం పొందగలమా? అని అంటే, అవును పొందగలం, అది సాధ్యమే. పుట్టిన చోటనే కదా ఇకపై పుట్ట వద్దు –అనే జ్ఞానం కలగాలి. ఆ విధమైన జ్ఞానం ఏర్పడినప్పుడే, దానికి తగిన ప్రయత్నం చేయడం జరుగుతుంది.

అందువల్ల, కార్యం చేయడానికి ఒక చోటికి వచ్చినపుడు దానికి మారుగా విరుద్ధమైన పనిని చేయవచ్చునా? చేయడం జరుగుతున్నదా? అని అంటే ఆధ్యాత్మిక రంగంలో ఆ విధంగానే కనిపిస్తున్నది– అని అనడం జరిగింది.

మరొక విషయం. సరే, జన్మ పరంపరలలోని కష్టాన్ని మనం గమనించి, "ఇకపై జన్మించకూడదు" అనే భావంతో దానికి తగిన ప్రయత్నాన్ని చేసి, భగవానుని అనుగ్రహం వల్ల జన్మరాహిత్యాన్ని పొందుతామనుకోండి. ఆ స్థితిని పొందిన తరువాత మళ్లీ పుడుతున్నామా? మనం, సంసారంలో పుట్టి పుట్టి, ఆ తర్వాత మళ్లీ పుట్టకపోవడం అనే స్థితిని పొందాము. ఆ విధంగానే, పుట్టకపోవడం అనే స్థితిని పొందిన తరువాత, మళ్లీ పుట్టాలనే ఆశ కలుగుతుందా? మళ్లీ పుట్టే స్థితిని పొందుతామా? అని అంటే, ఆ విధంగా లేదు. ఒకసారి జన్మరాహిత్యాన్ని పొందిన తరువాత మళ్లీ జన్మించడం అనేది సంభవించదు. సంసారంలో అయితే, పుట్టిన దానికి విరుద్ధంగా పుట్టకపోవడం అనే ప్రయత్నాన్ని చేయడం, దానికి తగిన పలాన్ని పొందడం జరిగింది గాని, ఒకసారి జన్మరాహిత్యాన్ని పొంది పరమ పదాన్ని చేరిన, తరువాత మళ్లీ పుట్టాలనే ప్రయత్నం చేయడం జరగదు.

ఎందుకు? అని ప్రశ్నించుకుంటే ఈ విధంగా సమాధానం వస్తుంది. మనం జన్మరాహిత్యాన్ని ఎందుకు కోరుకున్నాము? పుట్టిన చోటు అయిన సంసారంలో పడే బాధలను చూచి కదా. ఇక పుట్టకూడదు అనే అభిప్రాయం మనకు కలగడం, దానికి తగినట్లుగా మనం ప్రయత్నం చేయడం జరిగింది. ఆ విధంగానే జన్మరాహిత్యాన్ని పొంది, పరమపదానికి చేరిన తరువాత, అక్కడ బాధలు, కష్టాలు ఉన్నట్లయితే, అప్పుడు కదా మళ్ళీ పుట్టాలి అనే భావం కలుగుతుంది. జన్మరాహిత్యాన్ని పొందిన తరువాత చేరిన చోట అటువంటి స్థితి లేదు. అక్కడ ఎటువంటి దుఃఖం లేదు. అంతు లేని ఆనందాన్ని అనుభవించే స్థానం అది. ఇందువల్ల, మళ్లీ పుట్టాలనే ఆశ కలుగదు. జన్మ సంభవించదు. అందువల్ల, పుట్టిన చోట మళ్లీ పుట్టకుండా ఉండే స్థితిని ఏ విధంగా మనం పొందగలము? ఇది సాధ్యమేనా? ఈ విధంగా అనడం సరి అయినదేనా? అని మనం సందేహపడనక్కరలేదు. అటువంటి స్థితిని పొందడానికి మనకు సాధ్యం అవుతుంది. మళ్లీ మళ్లీ సంసారంలో పుట్టాలి –అనే జ్ఞానం కలిగితే, దానికి అనుగుణంగానే మాటిమాటికి మనం సంసారంలో జన్మించడం జరుగుతుంది. జన్మించి సుఖదుఃఖాలను అనుభవించాలనే కోరుకున్నాము. అందువల్ల జన్మించాము. ఆ విధంగా కాకుండా, జన్మించిన ఈ సంసారంలో లౌకికమైన విషయాల పట్ల ఆసక్తి కలిగినవారం కాకుండా, మళ్లీ పుట్టకూడదు, పరమపదాన్ని చేరి భగవంతునకుకు తగిన సేవలను చేసుకోవాలి– అనే ఆసక్తిని, ప్రీతిని కలిగినవారం అయితే, దానికి అనుగుణంగా జన్మరాహిత్యాన్ని పొంది, నిత్యంగా భగవంతుని సన్నిధానంలో ఉండి, ఆ స్వామికి నిత్య కైంకర్యాన్ని ఆ స్వామి ఆనందం కోసం చేయగలుగుతాము. అటువంటి ప్రయత్నాన్ని చేద్దాం. స్వస్తి

# 14. రామానుజం లక్ష్మణపూర్వజం చ

ఛాందోగ్యోపనిషత్తులోని కథ ఇది. ఉద్దాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువును చూసి "ఐతదాత్మ్య మిదం సర్వమ్, తత్ సత్యమ్, స ఆత్మా" అని ఉపదేశిస్తున్నాడు. భగవానుని గూర్చి ఉద్దాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువునకు ఉపదేశిస్తున్నాడు. ఇక్కడ ఆత్మ శబ్దానికి శరీరం అని అర్థం. "ఈ సమస్త ప్రపంచం భగవంతునకు శరీరంగా ఉన్నది, అది సత్యం, ఆ భగవానుడు ఈ జగత్తుకు ఆత్మ" అని ఈ వేదవాక్యానికి అర్థం.

ఈ వాక్యంలో పైపైన చూచినప్పుడు, ఇందులో పునరుక్తి ఉన్నట్లు మనకు తోస్తుంది. ఏ విధంగా? అంటే, ఈ వాక్యంలో మొదట ఉదాలకుడు "ఐతదాత్మ్య మిదం సర్వమ్" అని అంటూ –"ఈ ప్రపంచం అంతా ఈ పరమాత్మకు శరీరం" అనే సంగతిని చెప్పాడు. అంటే, ఈ జగత్తుకు పరమాత్మ ఆత్మ –అనే కదా అర్థం. ఆ విధంగా చెప్పిన తరువాత, మళ్లీ "స ఆత్మా"– ఆ పరమాత్మ ఈ జగత్తుకు ఆత్మా –అని చెప్పాడు. అందువల్ల ఇక్కడ పునరుక్తి ఉన్నట్లు ఆపాతతః తోస్తుంది. మరి శ్రుతి ఎందుకు ఈ విధంగా చెప్పింది? పునరుక్తి ఈ దోషం కదా! అనే ప్రశ్నకు నడాదూర్ అమ్మాళ్ అనే ఆచార్యులు సమాధానాన్ని చాలా ఆశ్చర్యకరంగా అనుగ్రహించారు.

వారు దీనికి సమాధానాన్ని పలికేటప్పుడు, శ్రీరామాయణంలోని "రామానుజం లక్ష్మణపూర్వజం చ" అనే సూక్తిని ఉదాహరించారు. శ్రీరామాయణంలోని సుందరకాండలో వాల్మీకి మహర్షి శ్రీరామలక్ష్మణులను నిర్దేశించేటప్పుడు ఈ విధంగా పలికాడు. ఈ సూక్తిలో మొదటి పదం రామానుజ పదం. రామానుజ శబ్దానికి శ్రీరామునకు తమ్ముడు, లక్ష్మణుడు– అని అర్థం. పూర్వజః అంటే, ముందు పుట్టినవాడు, అన్న. –అని అర్థం. అందువల్ల"లక్ష్మణ పూర్వజః" అంటే, లక్ష్మణునకు ముందు పుట్టినవాడు, అన్న, అంటే, శ్రీరాముడు– అని అర్థం.

వాల్మీకి మహర్షి నేరుగా, శ్రీరాముడు, లక్ష్మణుడు అనే పదాలను చెప్పకుండా, ఈ విధంగా ఎందుకు నిర్దేశించేశాడు? మహర్షి వాక్కు చాలా సాభిప్రాయంగా కదా ఉంటుంది! ఇందులోని తాత్పర్యం ఏమి? అని గమనించినప్పుడు, ఒక విశిష్టమైన అర్థం మనకు గోచరిస్తుంది. భగవంతుని నిర్దేశించేటప్పుడు నేరుగా నిర్దేశించకూడదు, భక్తుని పురస్కరించుకొని భగవంతుని నిర్దేశించాలి. అప్పుడే ఆ భగవంతునకు ఆనందం కలుగుతుంది. మనం కోవెలలోకి భగవంతుని దర్శించడానికి వెళుతున్నాము అనుకోండి.

అప్పుడు కోవెలలోని భగవంతుని గూర్చి మనం ఏమని చెబుతాము? ఈ "స్వామి ఇటువంటి పెద్దలచేత మంగళాశాసనం చేయబడ్డాడు " అని అంటాముకదా. శ్రీరంగంలోని శ్రీ రంగనాథుని సేవించాలని వెళ్లామనుకోండి. ఆ శ్రీరంగనాధుని గూర్చి అక్కడ ఉండే అర్చకులు ఏమని మనకు తెలియజేస్తారు? ఈ స్వామి " పదిన్మర్ పాడుమ్ పెరుమాళ్"– పదిమంది ఆళ్వారుల చేత కీర్తింపబడిన స్వామి– అనికదా అంటారు. ఆ విధంగా ఆ స్వామిని భక్తులచేత మంగళాశాసనం చేయబడినవాడుగా నిర్దేశించి నిర్దేశించి పలికినప్పుడే, ఆ స్వామికి ఆనందం కలుగుతుంది. అందువల్లనే వాల్మీకి మహర్షి శ్రీరాముని నిర్దేశించేటప్పుడు "లక్ష్మణ పూర్వజం చ" అని తనకు భక్తుడైన, జీవకోటిలోనికి చేరిన లక్ష్మణుని పురస్కరించుకొని నిర్దేశించాడు.

ఆ విధంగానే, భక్తుని గూర్చి నిర్దేశించేటప్పుడు, ఆ భక్తునకు ఇష్టదైవాన్ని పురస్కరించుకొని నిర్దేశించాలి. అప్పుడే ఆ భక్తునకు మనసులో ఆనందం కలుగుతుంది. నమ్మాళ్వారులను నిర్దేశించేటప్పుడు "కృష్ణతృష్ణా తత్వమ్" అని పెద్దలు చెబుతారు. "రామభక్త హనుమాన్ "అని కదా లోకంలో ప్రసిద్ధి. అందువల్ల వాల్మీకి మహర్షి లక్ష్మణుని నిర్దేశించేటప్పుడు, నేరుగా లక్ష్మణుని పేరుతో నిర్దేశించకుండా, అతనికి ఇష్టదైవం అయిన రాముని పురస్కరించుకొని నిర్దేశించాడు.

అదే క్రమంలో పై శ్రుతివాక్యంకూడా జగత్తును, పరమాత్మను నిర్దేశించింది. జగత్తును నిర్దేశించేటప్పుడు, ఆ జగత్తును సొత్తుగా కలిగిన పరమాత్మను పురస్కరించుకొని నిర్దేశించింది. "భగవంతుని ఆత్మగా కలిగినదై ఆ భగవంతునకు శరీరం –ఈ జగత్తు" అని చెప్పడం జరిగింది. "ఐతదాత్మ్య మిదం సర్వమ్" అనే సూక్తిలోని అర్థం ఇదే. ఆ విధంగానే, భగవంతుని గూర్చి చెప్పేటప్పుడు, "స ఆత్మా"– "జగత్తుకు భగవంతుడు శరీరం" అని భగవంతునకు సొత్తు అయిన జగత్తును పురస్కరించుకొని చెప్పింది.

ఈ విధంగా వేదసూక్తిని అనుసరించి వాల్మీకి మహర్షి పై ప్రయోగాన్ని చేశాడు– అని మన పూర్వాచార్యుల అభిప్రాయం. భగవంతుడు శ్రీరాముడై అవతరించగా, వేదం శ్రీరామాయణంగా అవతరించినది అని కదా చెప్పబడుతున్నది. వేదాల్లో చెప్పబడిన తత్త్వాలు శ్రీరామాయణంలో ఏ విధంగా ప్రతిపాదింపబడ్డాయి? అనే విషయానికి దీనిని ఒక ఉదాహరణగా చెప్పవచ్చు.

వేదం కాని, శ్రీరామాయణం కాని, ఈ విధంగా చెప్పడంలోని ఉద్దేశ్యం చాలా గొప్పది. "ఈ జగత్తు అంతా పరమాత్మకు శరీరం" అని, " జగత్తులో అంతటా పరమాత్మ

ఉన్నాడ"ని చెప్పబడే సత్యాన్ని ఒకడు గమనించి వంట బట్టించుకున్నప్పుడు, అతనికి ఈ జగత్తులో అంతటా పరమాత్మయే అంతర్యామిగా కనిపిస్తాడు. అప్పుడు, ఎవరూ, ఎవరినీ ద్వేషించే అవసరం ఉండదు. ఈ విషయాన్ని ఉపదేశించడంలో వేదానికి, వేదప్రతిరూపమైన రామాయణానికి ఇదే దృష్టి ఉన్నది. అంతేకాదు, భగవంతుడు ఎవడో? మనవెవరమో? అనే భావం కూడా మనకు తొలగిపోతుంది. ప్రతి వ్యక్తి –ఎదుటి వ్యక్తిలోనూ, ఎదుటి వస్తువులోను పరమాత్మను దర్శించ గలుగుతాడు, కనుక, తాను చేసే పని, సేవ భగవంతుని సేవగా భావించి చేసే అవకాశం ఉన్నది. దీనివల్ల లౌకిక జీవన ప్రయాణానికి, ఆధ్యాత్మిక జీవన ప్రయాణానికి మధ్య చక్కని సమన్వయం కుదురుతుంది.

★★★★★

# 15. క్షీరసముద్రమథనవృత్తాంతంలోని తత్త్వమ్

అమృతాన్ని పొందాలని కోరి, దేవతలు, అసురులు ఇద్దరు కూడా కలసి, పాల సముద్రాన్ని మందర పర్వతాన్ని కవ్వంగా చేసుకొని, దానికి వాసుకి అనే దారాన్ని చుట్టి చిలికారు. అప్పుడు ఆ సముద్రం నుండి మొదట హాలాహలం అనే విషం, , ఆ తరువాత ఐరావతం కల్పవృక్షంవంటి అసార, అల్పసారాలైన పలు వస్తువులు బయటపడ్డాయి. చివరిగా అమృతం పుట్టింది. లక్ష్మీదేవి ఆవిర్భవించింది. ఆ లక్ష్మీదేవిని భగవానుడు పరిగ్రహించాడు. దేవతలు వారు కోరిన అమృతాన్ని పొందారు. అసురులు మాత్రం అపజయాన్ని పొందారు. ఇది క్లుప్తంగా క్షీరాబ్ది మథన వృత్తాంతం. ఈ వృత్తాంతంలో ఉండే కొన్ని తత్త్వాలను మనం గమనిద్దాం.

మన మనసే ఒక పాల సముద్రం. పాలసముద్రం చాలా గంభీరంగా ఉండేటట్టే, మన మనసు కూడా చాలా లోతైనది. క్షీరసముద్రాన్ని చిలికి, అందులో నుండి విషాన్ని, అసారమైన వస్తువులను బయటకు తీసినట్లే, మన మనస్సును మథించి అందులో ఉండే కాలుష్యాన్ని, అక్కరలేని ఆలోచనలను తొలగించాలి. అసారమైన విషయాలను తొలగించాలి. అప్పుడే మనసు అనే పాలకడలినుండి అమృతం అనే జ్ఞానం ఉద్భవిస్తుంది. ఈ జ్ఞానం అర్థపంచకజ్ఞానమే. పాలసముద్రాన్ని చిలికేటప్పుడు మందర పర్వతం కవ్వంగా ఉపయోగింపబడింది. పాల సముద్రాన్ని మందర పర్వతంతో చిలికినట్లే, మన మనసు అనే పాల సముద్రాన్ని కూడా వేదశాస్త్రం అనే మందర పర్వతంతో చిలకాలి. వాసుకిని మందర పర్వతానికి చిలికే ధారంగా చేసినట్లే, మన మనసు అనే పాల సముద్రాన్ని చిలకడానికి బుద్ధిని దారంగా చేసికోవాలి. పాల సముద్రాన్ని చిలికినప్పుడు ముందర పర్వతానికి వాసుకిని దారంగా చుట్టారుకదా. ఈ బుద్ధి అనేది ఒక దారంవంటిది. ఈ బుద్ధితోనే మంచి చెడుల వివేకాన్ని పొందడానికి సాధ్యం అవుతుంది. మందర పర్వతాన్ని చిలకాడానికి వాసుకి అనే దారం లేనప్పుడు చిలకడం సాధ్యం కాదు. ఆ విధంగానే, మందర పర్వతం వంటి శాస్త్రం మాత్రం ఉంటే చాలదు కదా. అ వేదశాస్త్రాన్ని మందర పర్వతంగా చేసికుని, బుద్ధిని దానిని చిలకడానికి ఆవశ్యకమైన దారంగా చేసుకుని, మనస్సు అనే పాల సముద్రాన్ని చిలకాలి.

మన మనసులో దేవతలు ఉన్నారు, అసురులు ఉన్నారు. దేవతలు అంటే ఎవరు? మన మనసులో ఏర్పడే మంచి భావనలు. అసురులు అంటే, చెడు భావనలు. సముద్రాన్ని చిలికేటప్పుడు మొట్టమొదట దేవతల కంటే అసురులకే బలం హెచ్చుగా ఉన్నట్లు, మన

మనసును మథించేటప్పుడు దానిలో ఏర్పడే మంచి చెడుల ఆలోచనలలో, మొదట, చెడు ఆలోచనలకే బలం ఎక్కువగా ఉంటుంది. అవి మనలను త్వరగా చెడ్డ మార్గంలోకి ఆకర్షిస్తాయి. ఈ విధంగా మంచి ఆలోచనలు ఒక వైపు, చెడు ఆలోచనలు ఒక వైపు ఉండగా, బుద్ధి అనే దారాన్ని చుట్టి, వేదశాస్త్రంతో మనసు అనే పాల సముద్రాన్ని చిలికినప్పుడు, చెడ్డ ఆలోచనలకే బలం ఎక్కువగా ఉంటాయి.

అపుడు, దేవతలు అందరూ భగవానుడైన శ్రీమన్నారాయణుని ఆశ్రయించినట్లే, మనం కూడా ఆ స్వామిని ఆశ్రయించాలి. “నారాయణా! నీవే గతి” అని దేవతలు అన్నట్లు, మనం కూడా “, శ్రీమన్నారాయణచరణౌ శరణం ప్రపద్యే” అని ఆ స్వామి శ్రీపాదాలలో సదాచార్య పురుషకారపూర్వకంగా శరణాగతి చేయాలి. ఆ విధంగా చేస్తేనే, వేదశాస్త్రం అనే మందరపర్వతంతో మనసు అనే పాలసముద్రాన్ని సరిగా చిలుకగలం. జ్ఞానామృతాన్ని పొందగలం. చెడ్డ ఆలోచనలు అనే అసురులను గెలువగలం.

పాలసముద్రాన్ని చిలికినప్పుడు మొదట ఏమి పుట్టింది? హాలాహలం అనే విషం. అది ఏమి? అంటే, అది మనం చేసిన కర్మలనే కాలకూటమే. అది బయటపడితే తప్ప, మనస్సు అనే సముద్రం నుండి అమృతం అనే మంచి జ్ఞానం పుట్టదు. చేసిన చెడు కర్మలు, అక్కరలేని ఆలోచనలు, ఆవశ్యకం కాని ఆశలు, ఇవన్నీ తొలగిపోతే కానీ, అమృతం అనే తత్త్వజ్ఞానం కలుగదు.

అమృతం పుట్టిన తరువాత, భగవానునకు, లక్ష్మీదేవికి కళ్యాణ జరిగింది. ఆ విధంగా కలసి ఉండే దివ్యదంపతులను మనం ఆశ్రయించాలి. ఈ దివ్యదంపతులు మన మనసులో నిలవాలంటే, మన మనసులో ఉండే చెడు ఆలోచనలు అనే విషం తొలగిపోవాలి. వస్తువులపై ఉండే ఆశలు నశించాలి. అప్పుడే, ఆ దివ్యదంపతుల దర్శనం మన మనసుకు ఏర్పడుతుంది. హాలాహల విషం, అసారమైన వస్తువులు పాలసముద్రం నుండి బయటపడిన తరువాత కదా, లక్ష్మీదేవి ఆవిర్భావం, దివ్య దంపతుల దర్శనం జరిగింది. ఆ దివ్యదంపతులను మనం దర్శించి, ధ్యానించినట్లయితే, మన మనసు అనే పాల సముద్రంనుండి అమృతం అనే యథార్థజ్ఞానం పుడుతుంది. ఆ జ్ఞానం అర్థపంచక జ్ఞానమే. ఇదేకదా, సకల శాస్త్రాలలోనూ తెలుపబడే జ్ఞానం. అందువల్లనే శాస్త్రాలు అనే పర్వతంతో మనసుకు అనే సముద్రాన్ని చిలికినప్పుడు అమృతం అనే జ్ఞానం లభిస్తుంది. జీవాత్మ స్వరూపజ్ఞానం, అంటే, జీవుడు భగవంతునకు శేషం– అనే జ్ఞానం, పరమాత్మ స్వరూపజ్ఞానం, అంటే, భగవంతుడు సర్వశేషి– అనే జ్ఞానం, ఉపాయ జ్ఞానం, అంటే, ఆ

లక్ష్మీసహితుడైన భగవంతుని శ్రీచరణాలే ఉపాయం– అనే జ్ఞానం, ప్రాప్య స్వరూపజ్ఞానం, అంటే, ఆ దివ్యదంపతుల సేవే పొందదగిన స్వరూపానికి తగిన ఫలం– అనే జ్ఞానం, విరోధిస్వరూపజ్ఞానం, అంటే, ప్రాప్యం పొందడంలో అడ్డు వచ్చే ఆటంకాలు అన్యశేషత్వ, అన్యోపాయత్వ, అన్య భోగ్యత్వాలే– అనే జ్ఞానం ఏర్పడుతుంది.

పాలసముద్రాన్ని చిలికినప్పుడు పుట్టిన అమృతం దేవతలకేకదా లభించింది. ఆ విధంగానే ఈ అమృతంవంటి జ్ఞానం ఎవరికి చెందాలి? అని అంటే, దేవతలు అనదగిన మంచి ఆలోచనలకే కదా. కానీ, ఆ విధంగా చెందకుండా ఉండేటట్లు అసురులు అనే చెడ్డ ఆలోచనలు అడ్డుపడతాయి. అసురులు ఏ విధంగా అమృతాన్ని అపహరించాలని చూచారో ఆ విధంగానే, చెడు ఆలోచనలు అమృతం అనే తత్త్వజ్ఞానాన్ని అపహరించాలని చూస్తాయి. అసురులు అమృతాన్ని అపహరించాలని తమకు చెందకుండా చేయాలని చూసినప్పుడు దేవతలు ఏ విధంగా మళ్ళీ భగవంతుని ఆశ్రయించారో. అదే విధంగా చెడు ఆలోచనలు అమృతం వంటి జ్ఞానాన్ని అపహరించాలని చూసినప్పుడు మనం మళ్ళీ భగవంతుని ఆశ్రయించాలి. నా స్వామి అనుగ్రహంతో అమృతంవంటి జ్ఞానాన్ని పొందాలి.

అసురులు అమృతాన్ని అపహరించాలని చూసినప్పుడు దేవతలు భగవంతుని మళ్లీ శరణాగతి చేశారు. ఆ స్వామి అప్పుడు మోహిని అవతారాన్ని ఎత్తి, అమృతం దేవతలకు లభించేటట్లు చేశాడు. ఆ విధంగానే, మనం కూడా తత్వజ్ఞానాన్ని పొందడానికి అడ్డుపడే చెడు ఆలోచనలు తొలగిపోవడం కోసం భగవంతుని ఆశ్రయించాలి. భగవానుడు మోహినీ అవతారాన్ని ఎత్తడం అంటే ఏమి?, అని అంటే, స్వామి మోహిని అవతారాన్ని ఎత్తి తన అందంతో అసురులకు భ్రమను కలిగించి, వారికి అమృతం దొరకకుండా చేశాడు. అది దేవతలకు అందియేటట్లు చేశాడు. అందువల్ల భగవంతుడు మోహిని అవతారం ఎత్తడం అంటే, అతడు తన దివ్య మంగళ విగ్రహ సౌందర్యాన్ని ప్రదర్శించడమే. భగవంతుడు తనతిరుమేని సౌందర్యాన్ని ప్రదర్శించి, మన మనసులో ఉండే చెడు ఆలోచనలు అనే అసురులను దూరం చేసి, మంచి ఆలోచనలు అనే దేవతలకు జ్ఞానం అనే అమృతం లభించేటట్లు చేస్తాడు. భగవంతుని దివ్యమంగళ రూప సౌందర్యాన్ని సేవించి, అందులో ఆసక్తిని పొందినప్పుడు, ఈ లోకంలో ఉండే సుఖాలపై మనకు కలిగే ఆలోచనలు అన్నీ దూరమైపోతాయి. ఆ విధంగా భగవంతుడు తన దివ్య మంగళ విగ్రహ సౌందర్యాన్ని చూపించి, మన చెడు ఆలోచనలు అనే అసురులను దూరం చేస్తాడు. అప్పుడే మంచి ఆలోచనలు అనే దేవతలకు తత్త్వజ్ఞానం అనే అమృతం లభిస్తుంది.

చిలికే దారానికి రెండు కొనలు ఉండేటట్లు వాసుకి అనేదారానికి గల రెండు కొనలు ఏవి? అంటే, మంచి, చెడులు. ఈ విధంగా శాస్త్రాన్ని మందర పర్వతంగా చేసికొని, దానిని మనస్సు అనే పాలసముద్రంలో నిలిపి, ఆ శాస్త్రాన్ని బుద్ధి అనే దారంతో చుట్టి, మథించినప్పుడు, యథార్థజ్ఞానమనే అమృతం పుడుతుది. పాలసముద్రాన్ని దేవతలు, అసురులు చిలికినట్లుగానే, మన మనసు అనే పాల సముద్రాన్ని మంచి ఆలోచనలు, చెడు ఆలోచనలు అనే రెండు మథిస్తాయి.

ఈ వృత్తాంతం ఇంతటితో అయిపోలేదు. అమృతం అసురులకు దొరికితే, అది లోకంలో అనర్థానికి కారణం అవుతుందని తలచి, అది దేవతలకే చెందవలసినది– అని భావించి, మగవానుడు ఆ అమృతం దేవతలకు లభించేటట్లు చేశాడు.

దేవతలకు భగవానుడు అమృతాన్ని ప్రసాదించే సమయంలో, ఒక అసురుడు వారి సమూహంలో రహస్యంగా ప్రవేశించి, అమృతాన్ని తాగాలని ప్రయత్నం చేశాడు. దానిని గమనించిన భగవంతుడు తన చక్రంతో ఆ అసురుని రెండుగా ఖండించాడు. ఆ రెండు ఖండాలు రాహుకేతువులు అయినవి.

ఈ వృత్తాంతంలోని తత్త్వం ఏమి? అని అంటే, మనకు అమృతంవంటి తత్త్వజ్ఞానం కలిగినప్పటికీ కూడా, ఒక్కొక్క సమయంలో మన మనసులో ఆసురమైన భావాలు కలుగవచ్చు. రాహుకేతువులు ఇద్దరూ సూర్యుని, చంద్రుని ఆవరించి కబళించేటట్లు, అప్పుడప్పుడు మన మనసులలో కలిగే తగని ఆలోచనలు మనకు కలిగిన జ్ఞానాన్ని ఆవరించి కబళించడానికి ప్రయత్నం చేస్తాయి. అప్పుడు మనం భగవంతుని శరణాగతి చేయాలి. దేవతలు కూడా, అమృతం తమక లభించేటట్లు చేయమని భగవంతుని ప్రార్థించారు కదా, దాని ఫలంగా రాహువు కేతువుల నోటినుండి బయటపడి, ప్రకాశించే సూర్యుడు, చంద్రుడు వలె, మన జ్ఞానం అనేది మళ్లీ స్పష్టంగా ప్రకాశిస్తుంది. ఈ విధంగా ప్రకాశించాలంటే, భగవంతుని అనుగ్రహం ఆవశ్యకం. ఈ రహస్యమే ఇక్కడ వ్యక్తం అవుతున్నది. దీనిని తెలుపడం కోసమే భగవంతుడు మునుముందుగానే, అమృతాన్ని దొంగతనంగా తాగాలని ప్రయత్నించే అసురుని సంహరించలేదు. సర్వజ్ఞుడైన భగవంతునకు అసురుని ప్రయత్నాన్నిగూర్చి తెలియదని మనం భావించలేము కదా.

శాస్త్రాన్ని పర్వతంగా చేసికొని, బుద్ధిని ధారంగా చేసికొని, మనసును మథించి, విషం వలె ఉండే చెడు వాసనలను, దుష్కర్మలను మనసులో నుండి బయటకు పోయేటట్లు చేసి అమృతం వంటి జ్ఞానాన్ని పొంది, చెడ్డ ఆలోచనలు అనే పశువులను అసురులను

భగవంతుని అనుగ్రహంతో జయించి, మంచి ఆలోచనలు అనే దేవతలను అమృతం వంటి జ్ఞానంతో చేర్చి, ఆ మంచి ఆలోచనలతో జ్ఞానంతో పండిన భక్తిని ఉంది ఆ భక్తితో భగవంతుని ఆశ్రయించి మనం తరించాలి అనే ఈ గొప్ప సందేశం ఈ సముద్ర మథన వృత్తాంతంలో తెలియజేయబడింది.

ఈ వృత్తాంతంలో వేరొక రహస్యం ఇమిడి ఉన్నది అని శుకమహర్షి శ్రీమద్భాగవతంలోని లక్ష్మీ కళ్యాణం ఘట్టంలోని ఒక అద్భుతమైన శ్లోకంలో తెలియజేశారు.

"ఏవం సురాసురగణాః సమదేశకాల
హేత్వర్థకర్మమతయోపి ఫలే వికల్పాః,
తత్రామృతం సురగణాః ఫల మంజసాపుః
యత్పాదపంకజరజః శ్రయణాన్న దైత్యాః"

(దేవదానవులు ఒకే సమయంలో, ఒకే ప్రయోజనం కోసం, ఒకే వస్తువును, ఆశించి సమానంగా శ్రమ పడ్డారు. అయినప్పటికీ, వారికి లభించిన ప్రయోజనాలలో చాలా మార్పులు సంభవించాయి. దేవతలకు మాత్రం కారు కోరిన, వారి శ్రమకు తగిన ఫలితం ఆయన అమృతం సులభంగా లభించింది. ఎందుకంటే, వారు భగవంతుని పాదపద్మాలను అశ్రయించారు. ఆ విధంగా భగవంతుని పాదాలను ఆశ్రయించకుండా, ఆ ప్రయత్నంలో వైముఖ్యాన్ని కలిగినందువల్ల, అసురులు ఎంత శ్రమపడినప్పటికీ వారు కోరిన అమృతం అనే ప్రయోజనం మాత్రం వారికి దక్కలేదు)

ఒక విషయాన్ని మనం ఇక్కడ తప్పక గమనించాలి. దేవతలు, అసురులు, ఇద్దరు కూడ, అమృతాన్ని పొందాలని ఆశించి సముద్రాన్ని చిలకడం అనే ఒకే పనిని చేశారు. దానిని ఒకే కాలంలో చేశారు, ఒకే పరిమితిలోని ప్రయత్నంలో చేశారు, . కానీ, దేవతలకు వారు కోరిన అమృతం లభించింది. అసురులకు మాత్రం అపజయం లభించింది ? ఏమీ ఈ విధంగా ఎందుకు జరిగింది? అని అంటే, దేవతలు భగవంతుని శ్రీచరణాలను ఆశ్రయించారు. అందువల్ల వారు తాము పొందగోరిన అమృతాన్ని పొందగలిగారు. వారి ప్రయత్నం సఫలమైనది. అసురులు భగవంతుని చరణాలను ఆశ్రయించలేదు. అందుచేత వారు అమృతాన్ని పొందలేకపోయారు, అపజయాన్ని పొందారు. ఎంత ప్రయత్నం చేసినా, వారు ఓడిపోయారు. అందువల్ల, ఒకే విధమైన, ఒకే పరిమితిలోని, ఒకే కాలంలో ప్రయత్నం చేసినప్పటికీ కూడా, భగవంతుని చరణాలను ఆశ్రయించినవానికి అమృతం వంటి ఫలం

లభిస్తుంది. ఎంత ప్రయత్నించినా, ఏ విధంగా ప్రయత్నించినా, భగవంతుని ఆశ్రయించనివారికి అమృతం అనదగిన మోక్షం లభించదు– అనే రహస్యం ఇక్కడ వ్యక్తమవుతున్నదని ఆ మహర్షి తెలియజేశారు.

ఇందువల్ల ఏమి తెలుస్తున్నదంటే మనం మన కర్మలను తప్పకుండా చేయాలి మన కర్తవ్యాలను ఏనాడు విడువకూడదు అయితే ఆ చేసే కర్మలను అన్నిటినీ భగవదర్పణంగా చేయాలి ఆ విధంగా చేసినప్పుడే, ఆ కర్మల వల్ల మనం పొందదగిన ఫలాన్ని పొందగలుగుతాం.

★★★★★

# 16. గోదాసూక్తిసౌందర్యం —పూర్వాచార్యవ్యాఖ్యాన వైభవమ్

(గోదాదేవి అవతారోత్సవాల సందర్భంగా)

గోదాదేవి అనుగ్రహించిన తిరుప్పావై ప్రబంధంలో "అన్రు ఇవ్వులగమ్ అళందాయ్ అడి పోఱ్ఱి" అనేది 24వ పాశురం. అందులోని మొదటి వాక్యంలో గోదాదేవి త్రివిక్రమావతారానికి "అన్రు ఇవ్వులగమ్ అళందాయ్ అడి పోఱ్ఱి" అని మంగళాశాసనం చేస్తున్నది. "ఆనాడు ఈ లోకాన్ని నీ శ్రీపాదంతో కొలిచావు" అని మంగళాశాసనం చేస్తున్నది. లోకాలను అన్నిటిని కొలిచిన త్రివిక్రమ స్వామి పాదానికి మంగళం పాడుతున్నది. ఎత్తు పల్లాలు, అరణ్యాలు పర్వతాలు, నదులు భూమి అనే ఏ తేడా లేకుండా, అంతటా త్రివిక్రమ భగవానుడు తన శ్రీపాదంతో స్పృశించాడు. " తాళాల్ ఉలగ మళంద ఆశైవే కొల్! " శ్రీపాదంతో లోకాలను కొలిచిన శ్రమ వల్లనా నీవు శయనంపై పరుండి ఉన్నావు అని సన్నివేశాన్ని ముదల్ ఆళ్వారులు కూడా కీర్తించారు. ఇటువంటి అరుదైన లీలలను చేసినందువల్ల పరమాత్మ శ్రీచరణం ఎంతో శ్రమపడి ఉంటుందికదా. ఆ కారణం వల్ల "అడి పోఱ్ఱి "అని భగవంతుని పాదానికి గోదాదేవి మంగళం పాడింది.

ఈ పాశురంలోనే, రెండు పాదాలకు తరువాత, అంటే, నాలుగవ పాదంలో, ", కన్రు కుణిలా ఎరిందాయ్ కழల్ పోఱ్ఱి" (లేగ దూడను విసిరి కొట్టే దండంగా ప్రయోగించిన నీ పాదానికి మంగళం) అని అంటూ మళ్ళీ పాదానికి గోదావరి మంగళం పాడింది. "ఆడి "అన్నా పాదమే, "కழల్ "అన్నా పాదమే. ఈ విధంగా పలికిన "అడి పోఱ్ఱి" అనేదానికి, పోఱ్ఱి" అనేదానికి ఏమిటి తేడా? రెండు పాదాలే కదా. "తాళ్, పాదమ్, పొన్నడి, ఇణైయడి, తిరువడి" అని పలు విధాలుగా ఆళ్వారులు పాడుతారు. ఇప్పుడు ప్రస్తుతం గోదావరి సూక్తిలోని ఒకే అర్థాన్ని ఇచ్చే రెండు పదాలలో ఏమి తేడా? అర్థంలో ఏమి తేడా ఉన్నది? గమనించి చూద్దాం.

"అన్రు ఇవ్వులగమ్ అళందాయ్ అడి పోఱ్ఱి" అని మంగళాశాసనం చేసిన సమయంలో గోదాదేవికి, భూమిపై స్వామి మోపిన పాదం గోచరిస్తున్నది. అంటే, ఆ పాదం పైభాగమే దర్శనమిస్తున్నది. భగవానుడు త్రివిక్రమావతారాన్ని ఎత్తినప్పుడు ఒక పాదంతో భూమిని కొలిచాడు-వేరొక పాదంతో పై లోకాలను కొలిచాడు. ఈ విధంగా కుడి ఎడమ

పాదాలతో భగవానుడు భూలోక, పై లోకాలను కొలిచినపుడు భగవానుని పాదంలోని పైభాగమే గోచరిస్తుంది. అందువల్ల గోదాదేవి నీలవర్ణంతో ప్రకాశించే భగవంతుని పాదాల పై భాగాన్ని దర్శించి, దానికి మంగళం పాడుతున్నది. పాదం భూమిపై పెట్టినప్పుడు పాదం పై భాగమే గోచరిస్తుంది తప్ప క్రింది భాగం కనబడదు. ఆ విధంగానే, వేరొక పాదంతో పై లోకాలని కొలిచినప్పుడు కూడా పాదం పైభాగమే గోచరిస్తుంది గానీ, క్రింది భాగం కనిపించదు ఎందుకంటే, ఆ సన్నివేశంలో పాదం పైభాగం క్రింది దిశగా ఉంటుంది, క్రింది భాగం పై దిశలో ఉంటుంది. అప్పుడు ఆ భూమిపై ఉండేవారు పాదం పై భాగాన్ని చూడగలరు కాని, క్రింది భాగాన్ని చూడలేరు. అందుచేత, భగవానుడు లోకాలను కొలిచినపుడు నీలవర్ణంతో ప్రకాశించే ఆ స్వామి పాదాలపై భాగమే గోదాదేవికి గోచరించింది. దానిని ఇక్కడ "ఆడి" అనే శబ్దంతో నిర్దేశించారు.

కానీ నాల్గవ పాదంలో, "కన్డు కుణిలా ఎరిందాయ్ కழల్ పోற்றி" అనే ప్రయోగంలో "కழల్" అనే పదానికి కూడా పాదం అనే అర్థం. అయితే, ఈ పదం ఇక్కడ, సందర్భాన్ని అనుసరించి, భగవంతుని పాదంలోని క్రింది భాగాన్ని తెలియజేస్తున్నది. అది ఏ విధంగానో గమనిద్దాం. ఇక్కడ ప్రస్తావింపబడిన వృత్తాంతం ఏమంటే, వెలగపండు రూపంలో ఉండే అసురునిపై లేగదూడ రూపంలో ఉండే అసురుని సాధనంగా చేసికొని విసరి, ఆ ఇద్దరినీ వధించడం. వెలగ చెట్టులో ఉండే పండు రూపంలో కపిత్థాసురుడు, భూమిపై లేగదూడ రూపంలో వత్సాసురుడు అని ఇద్దరు అసురులు ఉన్నారు. వీరిద్దరినీ కంసుడు శ్రీకృష్ణుని వధించడం కోసం రేపల్లెకు పంపించాడు. శ్రీకృష్ణుడు చాలా కుశలంగా క్రింద ఉండే లేగ దూడను చేతి కర్రవలె చేసికొని, వెలగ చెట్టు పైకి వేగంగా విసిరాడు. ఆ లేగ దూడ వెళ్లి వెలగ చెట్టుపై ఉండే పండు రూపంలో ఉన్న అసురునకు తగిలింది. దానితో ఆ ఇద్దరు అసురులు మరణించారు.

కింద ఉండే లేగ దూడను చేతి కర్రవలె తిప్పి తిప్పి ప్రయోగించాలి అంటే, దానికి అధికమైన శక్తి అవసరం. అందువల్ల శ్రీకృష్ణుడు ఆ లేగదూడను విసరి కొట్టేటప్పుడు, తన ఒక పాదాన్ని కొంచెం పైకెత్తి లేగ దూడను విసిరాడు. "దీనికే కుంచిత పాదం అని పేరు" అని అరుంబదకారులు కూడా వివరిస్తారు. ఒక పాదాన్ని కొంచెం పైకెత్తి, మోకాళ్ళ పైకి వంగి, లేగ దూడను శ్రీకృష్ణుడు విసరి కొట్టాడు. ఆ సమయంలో శ్రీకృష్ణుడు తన ఒక పాదాన్ని పైకి ఎత్తాడు కనుక, గోదాదేవి ఆ సన్నివేశంలో, ఎర్రని వర్ణంతో మెరిసే ఆ పాదంయొక్క క్రింది భాగాన్ని దర్శించి, ఆ పాదానికి మంగళాశాసనం పాడుతున్నది.

త్రివిక్రమావతార సందర్భంగా భగవంతుని నల్లని వర్ణాన్ని కలిగిన పాదాల పై భాగమే గోచరించగా, ఇక్కడ ఎర్రగా ప్రకాశించే పాదం కింది భాగం గోచరించింది. దీనిని ఇక్కడ గోదాదేవి " కళల్ పోఱ్ఱి" అని నిర్దేశించింది. అందుచేత "ఆడి పోఱ్ఱి, కళల్ పోఱ్ఱి" అనే ప్రయోగాలు పై పైన చూసినప్పుడు ఒకే అర్థాన్ని ఇస్తున్నట్లు కనిపించినా, సన్నివేశాలలోని తేడాలనుబట్టి అవి వేరు వేరు వేరు అర్థాలను ఇస్తున్నాయి. "ఆడి" అనేది పాదం పై భాగాన్ని "కళల్ "అనేది పాదం క్రింది భాగాన్ని తెలుపుతున్నవి. ఎంతటి అందమైన ప్రయోగం ఇది!

ఈ విధంగా ఉండే గోదాదేవిసూక్తి లోని సౌందర్యాన్ని పొగడదామా? లేక, ఆ సూక్తి లోని తాత్పర్యాన్ని గ్రహించి వ్యాఖ్యానించే మన పూర్వాచార్యుల మేధావిలాసాన్ని కొనియాడదామా?. ఏనాడో జరిగిన త్రివిక్రమావతార సందర్భాన్ని శ్రీకృష్ణావతార వృత్తాంతాన్ని ప్రత్యక్ష సమానాకారంగా దర్శించి, దానిని తన సూక్తులతో మనకు తెలియజేసే గోదాదేవసూక్తి వైభవాన్ని ఏమని పొగడగలం. ? ఆ విధంగా ఉండే గోదాసూక్తిలోని గాంభీర్యాన్ని గ్రహించి, వివరించే మన పూర్వాచార్యుల వ్యాఖ్యాన చాతురిని ఏమని పొగడగలం? వారు ఈ విధంగా వివరించగలుగుతున్నారంటే, అది అంతా భగవంతుని దివ్యానుగ్రహం, నమ్మాళ్వారుల దివ్యానుగ్రహమే కారణం. అందువల్లనే వీరు ఆ విధంగా వ్యాఖ్యానించగలిగారు.

త్రివిక్రమావతారం, కృష్ణావతారం అనేవి ఎప్పుడో, వేరు వేరు కాలాలలో సంభవించాయి. అయినప్పటికీ, ఆ సందర్భాలను ప్రత్యక్షంగా దర్శించి, వాటిని మన కంటికి గోచరం అయ్యేటట్లుగా మన పూర్వాచార్యులు వివరిస్తున్నా . దివ్యప్రబంధ సూక్తులలో ఎంతటి గాఢమైన అభినివేశం, అవగాహన వీరికి ఉన్నదో కదా!

"అడి" అనే పదం ఏ అర్థాన్ని చెబుతున్నది? "కళల్ "అనే పదం ఏ అర్థాన్ని చెబుతున్నది? ఏ అనుభవాన్ని గోదాదేవికి ఈ పదాలతో వ్యక్తం చేస్తున్నది? అని మహోదారులైన మన పూర్వాచార్యులు స్పష్టంగా దర్శించి, మనకు తెలియజేస్తున్నారు.

గోదాదేవికి, మన పూర్వాచార్యులకు మన స్వరూపానికి తగినట్టుగా పలాండు పాడదాం.



# 17. దానమంటే ఇది కూడా అర్థమే

ఈ కలియుగంలో దానం చేయడం చాలా శ్రేష్ఠమైన కార్యమని శాస్త్రాలు చెబుతున్నవి. ధ్యానం చేయకపోయినా, దానం చేయడం ఆవశ్యకం అని అవి తెలుపుతున్నవి. అయితే, దానం అనే ఈ పదం చెవిలో పడగానే, ఆ కార్యం ఎవరో ధనవంతులు చేయవలసిన, చేయగలిగిన పని, అది మన వల్ల సాధ్యం అవుతుందా? మనమే ఒకరి దగ్గర యాచించవలసిన స్థితిలో ఉన్నాము కదా! , అని కొందరు భావించవచ్చు. ధనవంతులు కూడా దానమంటే విలువైన బంగారంలాంటివి వస్తువులను ఇవ్వడం, లక్షలాది రూపాయలను ఇవ్వడం అని కూడా భావించవచ్చు. దానం అనే పదానికి లోకంలో ఉండే ఈ విధమైన అర్థాన్ని అటు ఉండనివ్వండి. విపులంగా, భూరిగా ఇవ్వడం దానమే అవుతుంది సందేహం లేదు. ఇప్పుడు దానం అనే ఈ పదానికి మరి ఒక కోణంలో మన పూర్వాచార్యులు తెలియజేసిన ఒక అందమైన, అందరికీ ఆచరణ యోగ్యమైన అర్థాన్ని కూడా చూద్దాం.

వేదవ్యాసమహర్షి ఉపనిషత్తులలోని అర్థాలను వివరిస్తూ బ్రహ్మసూత్ర గ్రంథాన్ని రచించారు. దానికి శ్రీరామానుజులు శ్రీభాష్యం అనే ఒక ప్రామాణికమైన వ్యాఖ్యానాన్ని అనుగ్రహించారు. ఆ వ్యాఖ్యానాన్ని వివరించే చాలా విశదమైన వివరణ ఒకటి ఉన్నది. దానికి శ్రుతప్రకాశిక అని పేరు. అందులో దాన శబ్దానికి ఇంకొక అద్భుతమైన నిర్వచనం తెలియజేయబడింది. దానమంటే లోభరాహిత్యం– అని దాన శబ్దం అందులో నిర్వచింపబడింది.

ఈ అర్థాన్ని మనం గమనించినప్పుడు మొదట మనకు ఆశ్చర్యం కలుగుతుంది. సామాన్యంగా, దానం అనే పదానికి, ప్రత్యుపకారాన్ని ఆశించకుండా విరివిగా తన దగ్గర ఉండే వస్తువును ఇతరులకు ఇవ్వడం అనికదా మనం అర్థాన్ని గ్రహిస్తాము. ఇటువంటి అర్థాన్ని కలిగిన దానాన్ని అందరూ ఇవ్వగలరా? అనేది సందేహమే కదా. కానీ, శ్రుతప్రకాశికాకారులు నిర్వచించిన అర్థాన్ని కలిగిన దానాన్ని ఎవరైనా చేయవచ్చు. చేయవలసిన ఆవశ్యకత ఉన్నది కూడా.

ఇక్కడ పూర్వాచార్యులు పేరాశను లేకుండా చేసుకోవడమే, వదిలిపెట్టడమే దానమనే అర్థాన్ని చెప్పారు. ఇది దానంలోని చాలా ముఖ్యమైన ప్రకారం అనికూడా చెప్పారు. ఈ పని చేయడానికి, అంటే, ఇటువంటి దానం చేయడానికి ఎవరికీ, ఏమీ ఇవ్వనక్కరలేదు. పేరాశను, అంటే, ఉండదగిన ఆశ కంటే అధికమైన ఆశను వదిలిపెట్టడమే దానం

అవుతుంది. దీని అర్థం ఏమి? మనకు ఏది అవసరమో, అంతకుమించి ఆశపడి పొందాలని ప్రయత్నించడం, అర్థాన్ని అధికంగా కూడబెట్టకుండా ఉండడమే లోభరాహిత్యం. ఇదే ముఖ్యమైన దానం.

ఈ కాలంలో సామాన్యంగా పలువురు కూడా ఎంత సంపాదించినా చాలదు, ఎంతగా కూడపెట్టినా చాలదు, ఇంకా ఇంకా సంపాదించి, దాచి పెట్టాలి" అని భావనతోనే ఉన్నారు వారి వారికి కావలసిన దానికంటే అధికంగా కూడబెట్టడానికి ప్రయత్నిస్తున్నారు. ఈ విధంగా ఆశపడి ప్రయత్నించమే లోభం, పేరాశ.

సామాన్యంగా మనం పేరాశ శబ్దానికి" ఇతరుల ద్రవ్యాన్ని ఆశపడడం" అనే అర్థాన్ని గ్రహిస్తాము కానీ, ఇక్కడ ఆ విధంగా కాదు. ఇతరులవారి వస్తువులను ఆశపడడం అనేది దోషమే, సందేహం లేదు. ఇక్కడ చెప్పబడే పేరాశ ఏమంటే, తనకు కావలసిన దానికంటే ఎక్కువగా ఆశపడడం, సంపాదించడం.

మన భారతదేశంలో 140 కోట్ల మంది ప్రజలలో, ఎవరో కొద్దిమంది దగ్గరనే ఎక్కువ శాతం ధనం చేరి ఉన్నదనే విషయం మనం వింటున్నాము. అటువంటివారు ఇతరులకు చాలా మందికి ఉద్యోగాలను ఇచ్చి, ఆ ధనాన్ని సవ్యంగా వినియోగిస్తే, సరే. తప్పులేదు. ఒకవేళ, ఆ విధంగా చేయకపోతే, అప్పుడు నలుగురికి చెందవలసిన సంపద ఒకరి దగ్గరే కదా పోగుపడి ఉంటుంది. అందువల్ల, మనకెంత అవసరమో, అంతవరకే స్వీకరించి, అంతకు మించి అధికంగా ఉండే ద్రవ్యాన్ని మనం ముట్టుకోకుండా ఉంటే, ఆశపడకుండా ఉంటే, అదే గొప్ప దానం అవుతుంది. ఎందుకంటే, ఆ విధంగా చేయడం వల్ల, మన కారణంగా ఇతరులకు ఆ ద్రవ్యం అందుతుంది కదా. అంటే, ఒకడు తనకు కావలసిన దానికంటే అధికంగా ఆశపడకుండా ఉన్నప్పుడు, తనకు తెలియకుండానే ఇతరులకు దానం ఇచ్చినవాడవుతాడు.

ఇందులో, మన భారతీయ సంప్రదాయం చాలా ముఖ్యమైనది. ఆవశ్యకమైన ఒక వస్తువును కొని, మనం దానిని కొంతకాలం పాటు వాడతాము. అంతే తప్ప ఆ వస్తువును పదుల సంఖ్యలోనూ, వందల సంఖ్యలోనూ కొనము. వాడుకునే వస్తువు ఒకవేళ పనికిరాకుండాపోతే, అప్పుడు, ఇంకొకటిని కొనుక్కుంటము. అంతే తప్ప, ఒకేసారి అధిక సంఖ్యలో ఒకే వస్తువును కొని, మనం మన ఇంటిలో పెట్టుకోము. ఇది మన భారతీయుల అలవాటు కాదు. నాలుగు ఆవశ్యకమైతే, నాలుగింటినే కొంటాము అంతే తప్ప 14 కొనముకదా.

కానీ, ఇప్పుడు బయటి పరిస్థితి వేరుగా కనిపిస్తున్నది. సామాన్యంగా, ఒకటే సంఖ్యలో వస్తువును అమ్మడానికి చాలామంది ముందుకు రావడం లేదు. సెట్లు సెట్లుగా, అధిక సంఖ్యలోనే ఒక వస్తువును అమ్మడానికే సిద్ధపడుతున్నారు. విడదీసి అమ్మము అంటున్నారు. ఆ విధంగా కొంటే, వేల తక్కువ వెలకు ఇస్తామనే కూడా చెబుతున్నారు. ఇది అంతా వారు తమ వ్యాపారాన్ని వృద్ధి చేసుకోవడం కోసమే.

కానీ, ఇంతకుముందు మన పూర్వాచార్యులు తెలిపిన నిర్వచనం ఇటువంటి ప్రవృత్తికి అనుగుణం కాదు వారి వారికి కావలసిన పరిమితిలోనే ఒక వస్తువును ఆశపడడం తగినది, అదే గొప్ప దానం—అని కదా వారు నిర్వచించారు.

అందుచేత, దానం అంటే, ఏదో ఒక వస్తువును ఇస్తే తప్ప, దానం కాదు అనేది అర్థం కాదు. మనకు కావలసినదానికంటే ఎక్కువగా ఉండి, దానిని విడిచిపెడితే అదే గొప్పదానం అవుతుంది. ఇది, దాన శబ్దాన్ని నిర్వచించడంలో ఒక అందమైన కోణం. నిలుకడగా నిలచే కోణం. ఈ విధంగా ఉండే దానాన్ని ఎవరైనా చేయవచ్చు. అధికంగా ధనాన్ని సంపాదించి వినియోగించడం, కావలసిన దానికంటే ఎక్కువ విద్యుచ్ఛక్తిని వినియోగించడం మొదలైనవి చేయకుండా ఉండడమే గొప్ప దానం అవుతుంది. మనకు కావలసిన పరిమితిలోనే చేర్చి పెట్టుకున్నప్పుడు, మన మనసుకు నెమ్మది కూడా కలుగుతుంది. మనం ఇతరులకు దానం చేసిన పుణ్యం కూడా మనకు దక్కుతుంది.

దానమనే పదానికి ఈ విధమైన, ఆచరణ సాధ్యమైన, అందరికీ ఆవశ్యకమైన అర్థాన్ని తెలియజేసిన మన పూర్వాచార్యులు ఎంతటి ఉదారులో కదా! ఎంతటి లోకానుభవాన్ని కలవారో కదా!

★★★★★

# 18. కంబరామాయణమ్

కంబమహాకవి తాను ద్రావిడ భాషలో రచించిన రామాయణానికి పెట్టిన పేరు రామావతారం అని. వాల్మీకి మహాముని రచించిన శ్రీరామాయణాన్ని అనుసరించి ఈ గ్రంథాన్ని కంబకవి రచించాడు. అందువల్ల దీనికి కంబరామాయణం అనే పేరు ప్రసిద్ధమైనది.

అయనం అంటే, మార్గం అని అర్థం. ఒక మానవుడు ఏ విధంగా తనకంటే ఉన్నతులైన వారిని ఆశ్రయించి, సేవించి, తనకు కలిగే కష్టాలను అన్నిటినీ ఎదుర్కొని, చెడ్డ శక్తులను ఎదిరించి పోరాడి, స్నేహితులతో కలసి వర్తించి, వారితో ప్రేమను కలిగినవాడై మెలిగి, ఉత్తముడైన మానవుడుగా ఏ మార్గంలో బాగుపడాలో, ఉన్నతుడు కావాలో, ఆ మార్గాన్ని శ్రీరాముడు అనుసరించి చూపించాడు కనుక, "రాముడు చూపించిన మార్గం" అనే అర్థంలో రామాయణం అని పిలువబడుతున్నది అనే అర్థాన్ని కూడా రామాయణ శబ్దానికి మనం గ్రహించవచ్చు.

కంబ మహాకవి రచించిన రామాయణాన్ని చదవడం ఆరంభిస్తే, అందులో ఉండే దేవతా స్తుతిని చేసే మొదటి పాశురాన్ని గమనిస్తే చాలు, మనకు చాలా ఆశ్చర్యం, ఆనందం కలుగుతుంది. అంతటి అందమైన, అద్భుతమైన ఆరంభాన్ని ఆ పాశురంతో కంబమహాకవి చేశాడు.

కావ్యారంభాన్ని చేసేటప్పుడు దైవ ప్రార్థనతో కావ్యారంభాన్ని చేయాలి అనేది ఒక సంప్రదాయం. ఏ పనిని చేసినా దాని ఆరంభంలో దైవాన్ని ప్రార్థించడం అనేది మన భారతీయుల సత్సంప్రదాయం.

తాను రచిస్తున్నది శ్రీరాముని చరిత్ర. ఆ విధంగా ఉండేటప్పుడు, కంబకవి మొదట తాను చేసే ప్రార్థన శ్రీరాముని గూర్చి కదా ఉండాలి. అది కదా సహజం. అయితే, కంబుడు తన కావ్యాన్ని ఏ విధంగా ఆరంభించాడో చూస్తే, మనకు ఆశ్చర్యం కలుగక మానదు. ఆ పాశురాన్ని గమనించండి.

ఉలగమ్ యావైయుమ్ తామ్ ఉళ ఆక్కలుమ్
నిలై పెఱుత్తలుమ్ నీక్కలు నీంగలా
అలగు ఇలా విళైయాట్టుడైయార్ అవర్

**తలైవర్ అన్నవర్ క్కే శరణ్ నాంగళే**
(లోకాన్ని అంతటినీ సృష్టించి, రక్షించి, లయం చేయడం మొదలైనవాటిని అవధి లేని, అవలీలగా చేసే లీలగా కలిగిన ఆ ప్రభువును శరణును పొందుతున్నాము. )

సాధారణంగా కావ్యారంభాన్ని మంగళాచరణంతో ఆరంభించాలి—అనే సంప్రదాయాన్ని అనుసరించి "ఉలగమ్" అనే పదం మొదట ప్రయోగించి కంబకవి కావ్యారంభాన్ని చేశాడు. ఈ కావ్యం, లోకాలను అన్నిటినీ తానే సృష్టించి, రక్షించి, లయం చేయడం అనే అంతం లేని లీలను చేసే ప్రభువైన ఆ దైవాన్ని మేము శరణు పొందుతున్నాము—అనేది పై పాశురంలోని తాత్పర్యం.

తాను రచించబోయేది శ్రీరామాయణం అయినప్పటికీ, శ్రీ రాముని పేరు నిర్దేశించకుండా, రాముడై అవతరించబోయే లక్ష్మీనాథుని నామాన్ని ప్రస్తావించకుండా, వేరు ఏ దైవం పేరును ప్రస్తావించకుండా, సాధారణంగా ఒక దైవాన్ని కీర్తించేటట్లుగా రచింపబడటమే ఈ ప్రార్థన పాశురంలోని గొప్పతనం.

భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం అనే పంచభూతాలతో ఏర్పడేది ఈ లోకం. మనం ఉండే ఈ లోకం ఒకటి. ఆ విధంగా ఉండగా, "లోకం అంతటిని" అని ఎందుకు అనాలి? ఈ ఒక లోకాన్ని సృష్టించి, రక్షించడం —అని అనలేదే? ఎందుకు ? అంటే, ఈ లోకం మాత్రమే ఉన్నది, వేరు ఏ లోకం లేదు —అని కంబ మహాకవి నమ్మలేదు కనుక.

అవతారాలను గూర్చి ప్రస్తావించేటప్పుడు, వామనావతారంలో ముల్లోకాలను రెండు పాదాలతో కొలిచాడు అని అంటున్నాము. కృష్ణావతారంలో మట్టిని తిని, తల్లికి తన నోరును తెరచి ఏడు లోకాలను చూపించిన వృత్తాంతాన్ని పెరియాళ్వార్లు "వైయమ్ ఏழుమ్ కండాళ్ పిళ్లైవాయుళే" (యశోదా దేవి తన కుమారుని నోటిలో ఏడు లోకాలను చూసింది)అని అన్నారు. ఈ కంబరామాయణంలోనే తరువాత ఒక సందర్భంలో శ్రీరాముడు లక్ష్మణుని ఉద్దేశించి పలుకుతూ, "ఇలక్కువ! ఉలగమ్ ఓర్ ఏழుమ్ ఏழుమ్ నీ కలక్కువెన్? "(లక్ష్మణా! నీవు ఏడేడు లోకాలను ఎందుకు కలతను పొందిస్తావు?) అని అన్నట్లుగా ఈ కంబమహాకవి పలుకబోతున్నాడు. అంటే, 14 లోకాలు ఉన్నట్లుగా శ్రీరాముడు చెబుతున్నట్లుగా ఉన్నది, ఆ సూక్తి.

ఈ విధంగా పలు లోకాలు ఉన్నట్లుగా సూచించడం చేత, దానిని ఇన్ని అని చెప్పకుండా, తెలిసినవి, తెలియనివిగా ఉండే లోకాలను అన్నిటిని కలిపి ", ఉలగమ్ యవైయుమ్" అని కంబమహాకవి ఇక్కడ అన్నాడు.

"లోకాలను అన్నిటినీ సృష్టించి, రక్షించి, లయం చేయడం అనే లీలను నిర్వహించే నాయకుడు" అని సంబోధించి, తన మంగళాశాసనాన్ని కంబ మహాకవి ఆరంభించాడు. ఈ లీలను మూడిటిని చేసేవాడు ఒక్కడే, ఇవి అన్ని అతని కార్యాలే– అని స్పష్టంగా నిర్దేశించాడు. వీటిని సులభంగా, అనాయాసంగా చేయడాన్ని తెలిపేటట్లుగా "అవి ఆ నాథునకు కేవలం లీలగా ఉన్నాయి" అని అంటున్నాడు. ఈ లీలలను నిరంతరం చేయడం వల్ల ఇవి అంతం లేని, అవధి చూడడానికి సాధ్యం కాని లీలలు అనే విషయాన్ని "అలగిలా" అనే ప్రయోగం ద్వారా చెప్పాడు.

చివరిగా, ఇది దైవాన్ని మంగళాశాసనం చేసే పాశురం అయినప్పటికీ, " మంగళాశాసనం చేస్తున్నాను" అని చెప్పకుండా, " నమస్కరిస్తున్నాను "అని చెప్పకుండా, " శరణు పొందుతున్నాను "అని అన్నాడు. ఎందుకంటే, రామాయణంలో ఆరంభం నుండి చెప్పబడే తత్త్వం ఏమి? అంటే, అది శరణాగతి తత్త్వమే కదా. లక్ష్మణుడు, హనుమంతుడు అనే వీరు తమను శ్రీరామునకు అర్పణం చేసుకున్నట్లుగా వేరు ఎవరూ అర్పణం చేసుకున్నట్లుగా కనిపించదు. సుగ్రీవుడు శరణు పొందాడు. విభీషణుడు శరణు పొందాడు. ఆ విధంగా ఈ కావ్యం అంతా శరణాగతి తత్త్వాన్ని తెలిపేటట్లుగా ఉన్నది. ఈ విషయాలన్నీ రామాయణంలో చెప్పబడబోతాయి– అనే విషయాన్ని సూచించేటట్లుగానే ఈ దైవాన్ని ప్రార్థించే మొదటి పాశురంలోనే ", శరణ పొందుతున్నాను" అని చెప్పి, ఈ రామాయణం అంతా శరణాగతితత్త్వ ప్రతిపాదకం అనే విషయాన్ని కంబ మహాకవి సూచించాడు.

ఈ విధంగా ఈ ఆరంభ పాశురంలో ప్రతి పదం అంతటి గంభీరమైన, అద్భుతమైన అర్థాలను వ్యక్తం చేసేదిగా ప్రకాశిస్తున్నది. అందువల్లనే ద్రావిడ సాహిత్యంలో సాటి లేని కవిసార్వభౌముడుగా కంబమహాకవి ఈనాటికీ, ఏనాటికీ అయినా గౌరవింపబడుతున్నాడు, గౌరవింపబడతాడు.

★★★★

# 19. భగవద్రామానుజులు చూపిన విశిష్టాద్వైతమ్

శ్రీనాథమునులు, భగవద్యామునమునులు మొదలయిన మన పూర్వాచార్యులు అందరు విశిష్టాద్వైతం అనే సిద్ధాంతాన్ని విస్తృతంగా ఉపదేశించారు. దానిని అనుసరించి శ్రీరామానుజులుకూడా శ్రీ భాష్యం మొదలైన తమ గ్రంథాలలో చక్కగా ఆ సిద్ధాంతాన్ని స్థాపించారు. శ్రీవైష్ణవులమైన మనం ఈ సిద్ధాంతాన్ని అంగీకరించాము. అనుసరిస్తున్నాము. అందువల్ల విశిష్టాద్వైతం అనే ఈ సిద్ధాంతం మనకే చెందినదిగా ఉన్నది–అని ఏర్పడుతున్నది. ఈ విధంగా ఉండగా, "శ్రీరామానుజులు చూపిన విశిష్టాద్వైతం"అని అనడం వల్ల, ఇతర మతాలవారు కూడా విశిష్టాద్వైతాన్ని అంగీకరించినట్లుగా ఇక్కడ అర్థం వస్తున్నదే! ఇది ఏమి? అనే సందేహం కలుగుతుంది.

అవును, ఈ సందేహం నిజమే. విశిష్టాద్వైతం అనే ఈ విషయాన్ని అన్ని మతాలవారు అంగీకరించినవారే– అనేది అందరూ ఒప్పుకోవలసిన విషయమే. ఇందులో సందేహమే లేదు. ", తత్త్వం విశిష్టాద్వైతం" అనే దానిలో ఎవరికి భేదం అనేది లేదు. అయితే, శ్రీరామానుజులు చూపిన విశిష్టాద్వైతం అనేది ఇతర మతాలవారు చెప్పిన విశిష్టాద్వైతం కంటే భిన్నమైనది –అనే ఈ విషయాన్ని చెప్పడం కోసమే ఈ వ్యాసశీర్షికను ఈ విధంగా గ్రహించడం జరిగింది. ఈ విషయం వివరింపబడుతున్నది.

"ఈ జగత్తులో ఉండేవారు అందరూ బాగుపడాలి"అని భావించి భగవంతుడు శ్రీమన్నారాయణుడు శ్రీరామానుజులను ఈ భూలోకంలో అవతరించేటట్లు చేశాడు. కృపతో శ్రీపెరుంబూదూరు క్షేత్రానికి వచ్చి అవతరించిన శ్రీ రామానుజులు వేదాంతంలోని పరమార్థం అయిన విశిష్టాద్వైత సంప్రదాయాన్ని చక్కగా అభివృద్ధి చేసి, మనకు ఉపదేశించారు. నాథముని, యామున ముని మొదలైన పెద్దలు అంతకు ముందే ఈ సంప్రదాయాన్ని పలు గ్రంథాల ద్వారా ఉపదేశించారు– అనే దానిలో సందేహం లేదు. అయినప్పటికీ, ఇతరమత నిరసన పూర్వకంగా, పలు విధాలుగా మన శ్రీరామానుజులు ఒక్కరే దీనిని రక్షించారు. "నాథోపజ్ఞం ప్రవృత్తం బహుభి రుపచితం యామునేయప్రబంధైః, త్రాతం సమ్యగ్యతీంద్రైః" అని శ్రీవేదాంతదేశికులు అన్నారు కదా.

తార్కిక మతం, సాంఖ్యమతం, పాశుపతమతం, బౌద్ధమతం, అద్వైత మతం మొదలైన అన్ని ఇతర మతాలను నిరాకరించి, ఈ మతాన్ని శ్రీరామానుజులు

స్థాపించినందున, మన విశిష్టాద్వైత మతానికి రక్షణ ఏర్పడింది. అందువల్లనే శ్రీరామానుజ మతం అనే పేరుతో ఈ మతం ప్రకాశిస్తున్నది. దీనిని దృష్టిలో పెట్టుకొనే,

"రామానుజార్యదివ్యాజ్ఞా వర్ధతా మభివర్ధతామ్,
దిగంతవ్యాపినీ భూయాత్ సా హి లోకహితైషిణీ"

అని పెద్దలు "శ్రీరామానుజుల దివ్యమైన ఆజ్ఞ అయిన విశిష్టాద్వైత మతం లోకంలో అంతట వ్యాపించాలి "అని, జనులు బాగుపడాలంటే ఇది హితమైనది అని చెప్పారు.

"కాణాదశాక్యపాషండైః త్రయీధర్మో విలోపితః,
త్రిదండధారిణా పూర్వం విష్ణునా రక్షితా త్రయీ"

అని భగవంతుడు అయిన శ్రీమహావిష్ణువే త్రిదండ ధారి అయిన శ్రీరామానుజులుగా ఈ భూమిలో అవతరించి, మూడు వేదాలను రక్షించాడు– అని పెద్దలు అంటారు.

తఱ్క్కచ్చమణరుమ్ శాక్కియ పేయ్ కళుమ్, తాழ் శడైయోన్
శొఱ్కఱ్ఱ శోంబరుమ్ శూనియ వాదరుమ్, – నాన్మఱైయుమ్
నిఱ్కక్కుఱుంబు శెయ్ నీశరుమ్ మాండనర్, నీణిలత్తే
పొఱ్కఱ్పగమ్ ఎమ్ ఇరామానుశముని పోంద పిన్నే"(99)

అనే ఇరామానుశ నూఱ్ఱన్దాది ప్రబంధంలోని పాశురం ఇక్కడ గమనించదగినది.

తర్కవాదాలను చేసే జైనమతం, బౌద్ధమతం, పాశుపతమతం అద్వైత మతం మొదలైన అన్ని మతాలు శ్రీమద్రామానుజులు భూమిలో అవతరించిన తరువాత, కిమ్మనకుండా ఎక్కడ ఉన్నాయో తెలియకుండా ఉండేటట్లుగా అదృశ్యమైపోయాయి– అని ఇక్కడ అంటున్నారు.

ఇక్కడ "నాన్మఱైయుమ్ నిఱ్కక్కుఱుంబు శెయ్ నీశరుమ్" అనే ప్రయోగం గమనించదగినది. దీని ద్వారా అద్వైత మతం సూచింపబడినది. మిగిలిన మతాలు వేదాలను ప్రమాణంగా అంగీకరించకుండా, తమకు తోచిన విధంగా వాదాలను చేశాయి. అందువల్ల వీటిని గూర్చి అధికంగా ఇక్కడ ప్రస్తావించవలసిన ఆవశ్యకత ఏమీ లేదు. మూల ప్రమాణమైన వేదాలను అంగీకరించినప్పటికీ, వాటిలో కొంత భాగాన్ని మాత్రం ఒప్పుకొని, మరికొంత భాగాన్ని విడిచిపెట్టి, నూతనంగా ఒక మతాన్ని సృష్టించి, "ఇదే వేదాంతాలలో

సారంగా చెప్పబడే మతం" అని కొందరు వాదిస్తున్నారే! అయ్యో! , అని వారిని చాలా తక్కువగా ఈ పాశురంలో అంటున్నారు, అముదనార్. ఈ విధంగా వాదించేవారు వేదాల విషయంలో చాలా అపచారం చేసినవారే అవుతున్నారు.

వారు వేదాల విషయంలో పలు సందర్భాలలో అపచారపడి అపార్థాలను చెబుతున్నారు. వాటిలో ఒక విషయాన్ని మాత్రం ఇక్కడ ప్రస్తావన చేయడం జరుగుతున్నది. ఈ విషయంలో శ్రీమద్రామానుజులు ఏ విధంగా యథార్థాన్ని వివరించి, , సన్మార్గంలో పయనించారు— అనే విషయాన్ని కూడా ఇక్కడ మనం గమనిద్దాం.

చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు— అని మూడు తత్వాలు ఉన్నాయి. భోక్త, భోగ్యం, ప్రేరిత— అని ఈ మూడిటిని వేదం వివరించి పలికింది. చిత్ అంటే జీవాత్మలు. అచిత్ అంటే అచేతన వస్తువులు. ఈశ్వరుడు భగవానుడైన శ్రీమన్నారాయణుడు. నేను అనే ఈ ఆత్మ తనకు తానుగానే ప్రకాశిస్తున్నందున చిత్ అనే పదం చేత నిర్దేశింపబడుతున్నాడు. ఆత్మ జ్ఞానస్వరూపుడు. స్వయం ప్రకాశాన్ని కలిగినవాడు. జ్ఞానం లేనందు వల్ల, తనకు తానుగానే ప్రకాశించే శక్తిని కలిగి ఉండకపోవడం చేత, ప్రకృతి, ఆ ప్రకృతి నిండి పుట్టిన వస్తువులు, వాటి పరిణామాలు అచిత్ అనే పదంచేత చెప్పబడుతున్నాయి. నేను అనే ఈ ఆత్మ తనకు వేరొక వస్తువు యొక్క సహాయం లేకుండానే ప్రకాశించేటట్లే, ఘటం మొదలైన జ్ఞానం లేని వస్తువులు తమకు తాముగానే ప్రకాశించడం లేదు— అనేది అందరికీ అర్థమవుతున్న విషయమే. ఈ చేతనా చేతన వస్తువులకు అన్నిటికీ, ఈశ్వరునకు మధ్య ఒక విధమైన సంబంధం ఉన్నది. ఆ సంబంధాన్ని శరీరాత్మ భావ సంబంధం అని అంటారు. అంటే, చేతనాచేతన వస్తువులు అన్నీ ఆ భగవంతునకు శరీరం యజ్ఞదత్తుడు, గోపాలుడు, మాధవుడు అని కొందరిని పిలుస్తున్నాము వీరు ఏదో ఒక విధమైన శరీరాన్ని కలిగి ఉన్నారు ఆ శరీరం దానిని నియంత్రించే ఆత్మ, ఈ రెండు ఒకటి కాదు. ఈ శరీరం నశించే వస్తువు. దానిలో ఉండే ఆత్మ నశించనివాడు. ఈ ఇద్దరికీ ఒక సంబంధం ఉన్నది. ఆ సంబంధాన్ని శరీరాత్మభావ సంబంధం అని అంటున్నాము. ఆ విధంగానే, చేతనా చేతన వస్తువులకు, భగవంతునకు మధ్య శరీరాత్మ భావ సంబంధం ఉన్నది. దీనిని పురస్కరించుకునే "చేతనా చేతన విశిష్టం బ్రహ్మం" అని శాస్త్రాలలో చెప్పడం అనేది సహజం. వైశిష్ట్యం అంటే, సంబంధం అని అర్థం. దండవిశిష్టుడైన పురుషుడు, రూపవిశిష్టమైన కలశం – అని చెప్పే ప్రయోగాలలో దండంతో కూడినవాడు పురుషుడు, రూపంతో కూడినది కలశం—అని చెప్పినపుడు, దండానికి, పురుషులకు ఉండే సంబంధం కొన్ని సమయాలలోనే ఉంటుంది.

మరికొన్ని సమయాలలో ఆ సంబంధం లేకుండా పోతుంది. శరీరానికి, ఆత్మకు మధ్య ఉండే సంబంధం ఆ శరీరం ఉన్నంతవరకే ఉంటుంది. తరువాత అది నశించిపోతుంది. అయితే, భగవంతునకు చేతనాచేతన వస్తువులకు మధ్య ఉండే సంబంధం, అంటే, శరీరాత్మ భావ సంబంధం అనేది ఏ నాటికీ నశించని సంబంధం. అందువల్లనే చేతనా చేతన విశిష్టం బ్రహ్మం, చేతనా చేతనాలను శరీరంగా కలిగినది, చేతనాచేతన వస్తువులకు ఆత్మ అనేది బ్రహ్మమే– అని ఏర్పడింది. ఇదే శాస్త్రాలలో "విశిష్టం బ్రహ్మం" అని చెప్పబడుతున్నది.

ఈ విధంగా భగవానుడు అన్ని వస్తువులను తన శరీరంగా కలిగినవాడు– అనే విషయాన్ని వివరించడం కోసమే అంతర్యామిబ్రాహ్మణం అనే ఉపనిషద్భాగం ఏర్పడింది. "యస్య పృథివీ శరీరం, యస్య ఆపః శరీరం యస్య తేజః శరీరమ్" అని ఈ విధంగా జగత్తులో ఉండే అన్ని వస్తువులను భగవంతుడు శరీరంగా కలవాడు వేరొకడు ఎవ్వడు లేనందువల్ల, బ్రహ్మం విశిష్టం, ఏకమేవ తత్వం. ఇటువంటి ఇతడు ఒక్కడే తత్వం– అని ఏర్పడింది. దీనిని మనసులో పెట్టుకొని మన వేదాంతదేశికులు న్యాయసిద్ధాంజనం అనే తమ గ్రంథంలో ప్రారంభంలో "సమస్తచిదచిత్ప్రకారకం బ్రహ్మ ఏకమేవ తత్వమ్" అని అన్నారు. ఇంతకుముందు చెప్పినట్లుగా విశిష్టం, ఒకటే వస్తువు "–అనేది భగవద్రామానుజ సిద్ధాంతం. "విశిష్టయోః అద్వైతమ్"అనే సమాసం చెప్పి, వేరొక రీతిలో కూడా అర్థాన్ని గ్రహించవచ్చు.

అనాది అయిన ఈ సంసారంలో సృష్టి అని, ప్రళయం అని రెండు దశలు ఉన్నాయి. ప్రళయ దశలో దేవుడు, మానవుడు, చెట్టు, లతలు, ఘటం, ఇల్లు మొదలైన నామాలు లేవు. ఇటువంటి రూపాలు లేవు. అందువల్ల ఆ సమయములో చిత్తు, అచిత్తు అనే రెండూ కూడా సూక్ష్మంగా ఉంటాయి. సృష్టిదశలో ఈ పేర్లు, రూపాలు సూక్ష్మదశనుండి స్థూలదశను పొందుతాయి. ఈ రెండు దశలలోను బ్రహ్మం అనేది చేతనాచేతనాలను శరీరంగా కలిగి ఉన్నందువల్ల, సూక్ష్మ చేతనాచేతన విశిష్టం బ్రహ్మం, స్థూల చేతనాచేతన విశిష్టం బ్రహ్మం –అనేవి రెండు ఉన్నాయి అని తెలుస్తున్నది. అందుచేత, ఒకే బ్రహ్మకు ఈ రెండు దశలు ఏర్పడుతున్నందున, సూక్ష్మ చేతనాచేతన విశిష్ట బ్రహ్మం, స్థూల చేతనా చేతన విశిష్టం బ్రహ్మం అనే రెండు ఒకటే – అనే అర్థాన్ని మన పెద్దలు అంగీకరించారు.

ఈ విధంగా శాస్త్రాలలో చెప్పినప్పటికీ, దీనిని తెలియకుండా పోయారు అద్వైతులు, ద్వై తులు కూడా. అయ్యో! , వారు ఈ సత్యాన్ని తెలియకపోవడం మాత్రమే కాదు, తమకు ప్రతికూలమైన వేదభాగాలను అప్రమాణాలు అని అన్నారు కూడా.

ఆభాసమైన అర్థాలను చెప్పడానికి కూడా వారు సిద్ధపడ్డారు. దీనిని దృష్టిలో పెట్టుకునే "నాన్మఱైయుమ్ నిఱ్కా క్కుఱుంబు శెయ్ నీశరుమ్" అని అముదనార్ అన్నారు.

ఈ విధంగా చేతనా చేతనాలు శరీరం అని, ఈశ్వరుడు ఆత్మ అని, ఈ శరీరాత్మ భావం ఎల్లప్పుడూ ఉంటుంది అని, అది ఏనాటికి నశించదు– అని అంగీకరిస్తే, ప్రళయ కాలంలో కూడా ఈ వస్తువులు ఉండాలి కనుక, అప్పుడు బ్రహ్మం ఒక్కటే, అది అద్వితీయం అని చెప్పే శ్రుతులకు ఏమి గతి? అని అద్వైతులు అడుగుతారు. వారికి సమాధానం చెప్పేటట్లుగా, శ్రీరామానుజమతానికి చెందినవారే విశిష్టాద్వైత మతస్థులు అని భావించనక్కరలేదు. అద్వైతులు కూడా విశిష్టాద్వైత మతస్థులే. అన్ని సిద్ధాంతాల వారు విశిష్టద్వైత మతాన్ని ఒప్పుకొని తీరాలి. ఇందులో సందేహమే లేదు.

ముందుగా అద్వైతులను గమనిద్దాం. వారు, ముగ్గురు. మాయావాదులు, ఉపాధివాదులు, శక్తివాదులు అని. వీరిలో, మాయా విశిష్టం బ్రహ్మం కారణం అని శంకరమతానికి చెందినవారు చెబుతారు. ఉపాధి విశిష్టమైన బ్రహ్మం కారణం అనేది భాస్కర మతానికి చెందినవారు చెబుతారు. శక్తి విశిష్టమైన బ్రహ్మం కారణం అనేది యాదవ మతం. వీరు కూడా ప్రళయ కాలంలో మాయ, ఉపాధి, శక్తి అనే వస్తువులను, బ్రహ్మాన్ని ఒప్పుకోవలసిన ఆవశ్యకత ఉన్నది కనుక, " ఏకం అద్వితీయం " అనే శ్రుతులకు అర్థాన్ని చెప్పడం ఏ విధంగా? అనే ప్రశ్న వస్తుంది. మాయ, ఉపాధి, శక్తి మొదలైనవి బ్రహ్మానికి విశేషణాలు అయినందున, బ్రహ్మం విషయంలో అవి చేరి ఉన్నందున, అవి ప్రత్యేకంగా లేనందువల్ల, "ఏకం తత్వం", అనే శ్రుతి వాక్యానికి ఏ విరోధం లేదు. దండంతో కూడిన పురుషుడు ఒక్కడే ఇంటిలో ఉన్నాడు, కుండలాలను ధరించిన పురుషుడు వచ్చాడు –అని అంటే, దండం, పురుషుడు, కుండలం, పురుషుడు అని రెండు వస్తువులు ఉన్నట్లు అయినది కదా! అని అడిగేవారు ఎవరైనా ఉన్నారా? అని ఈ సందేహాన్ని వారు సమాధానిస్తారు. ఈ సమాధానం "చేతనా చేతన విశిష్టం బ్రహ్మం ఒక్కటే" అని చెప్పే శ్రీరామానుజ మతానికి అనుగుణమే కదా.

శుద్ధబ్రహ్మమే లోకాన్ని సృష్టిస్తున్నది అని ఏ మతంలోనూ చెప్పడానికి సాధ్యం కాదు. స్వయంప్రకాశమైన బ్రహ్మం తనను ఎల్లప్పుడూ యథాతథంగా తెలిసికొన్నందున, తనలో ఏవిధంగా పలు భేద వస్తువులను కల్పించుకుంటుంది? అందుచేత, మాయ అనే ఒక వస్తువు బ్రహ్మాన్ని ఆవరిస్తున్నది అని చెప్పడం వీలు కాదు. వారికి కావలసిన ఉపాధి అనేది లేకుండానే బ్రహ్మమే జీవునిగా మార్పులు పొందుతున్నది–అని అంటే, జీవునకు ఏర్పడే

దోషాలు అన్నీ బ్రహ్మానికి కూడా ఏర్పడతాయి. అందుచేత ఉపాధి, శక్తి అనే వస్తువులను వారు అంగీకరించారు. అన్ని చోట్ల వ్యాపించి ఉండే బ్రహ్మంలో ఏ ప్రదేశంలో ఉపాధి సంబంధం ఏర్పడుతున్నదో, ఆ ప్రదేశమే జీవుడు – అనేది భాస్కర మతంలో వాదం. భోక్తృ శక్తి, భోగ్య శక్తి, నియంతృశక్తి అని మూడు విధాలైన శక్తులతో కూడినది బ్రహ్మం. మాయా అంశాలలో భోక్తృ భోగ్య నియంతృరూపంగా బ్రహ్మమే మార్పును పొందుతున్నది– అనేది యాదవ ప్రకాశమతం. ఈ విధంగానే, జీవులను, అతని పుణ్య పాపాలు అనే కర్మలను ప్రళయ కాలంలో కూడా అందరూ అంగీకరించాలి.

ఈ విధంగా అంగీకరించకుండా జగత్సృష్టిని అంగీకరించినట్లయితే, నూతనంగానే వేరొక జీవుని సృష్టించవలసి వస్తుంది. అప్పుడు ఒకవైపు మనుష్యునిగాను, మృగంగాను, వేరొక వైపు వృక్షంగానూ, గుడ్డివాడుగాను, మూగవాడుగాను జీవులను సృష్టించడానికి ఏది దారి? అనే ప్రశ్న వస్తుంది. దీనికి "వాడు వాడు చేసుకున్న కర్మలే కారణం " అని సమాధానం చెప్పడం తప్ప, వేరు ఏ సమాధానాలు లేవు. అందుచేత, కర్మను, దానిని కలిగిన జీవుని తప్పక అంగీకరించవలసి ఉన్నది. కనుక, పలు వస్తువులను ప్రళయకాలంలో అంగీకరించవలసి వస్తుంది. వీరు అందరూ అద్వితీయశ్రుతిని "విశిష్టం బ్రహ్మం ఒకటే" అని చెప్పే నిర్వహించాలి. ఈ విధంగా అన్ని మతాలలోనూ విశిష్ట బ్రహ్మమే కారణం అని చెప్పవలసి ఉన్నందున, అందరూ విశిష్టాద్వైత మతానికి చెందినవారే. అంగీకరించినవారే అవుతున్నారు.

ఇక్కడ చేతనా చేతనాలు ఉన్నాయి– అని, ఈశ్వరునకు అవి శరీరం –అని, ఈశ్వరుడే ప్రధానం, ఇవి అతనికి లోబడి ఉన్నవి– అని వేదాలలో స్పష్టంగా చెప్పబడి ఉండగా, ఈ అర్థాన్ని వదిలిపెట్టి, మాయ, ఉపాధి, శక్తి మొదలైనవానిని కల్పించి పలికి, అపార్థాన్ని చెప్పడం ఏ రీతిలోనూ యుక్తమైనది కాదు. వేదాలు చెప్పిన అర్థాన్ని విడిచిపెట్టడం, కొత్తగా ఒక అర్థాన్ని సృష్టించడం మొదలైనవి అన్నీ ఇతర మతాలలో దోషాలు అవుతున్నాయి. అందుచేత ఏ మతాలకు చెందినవారికి శ్రీరామానుజులు చూపించిన విశిష్టాద్వైత మతంలో ఏ విధమైన దోషాన్ని చెప్పడానికి సాధ్యం కాదు.

ఈ అర్థాన్ని అధికరణసారావళిలోనూ, తత్త్వముక్తాకలాపంలోనూ మన స్వామి శ్రీవేదాంతదేశికులు చాలా అందంగా తెలియజేశారు.

# ౨౦. తిరుమల కొండపై ఒక అద్భుత దృశ్యం

భక్తి అంటే ఏమి? ఉండే అన్నిటినీ విడచిపెట్టి, భగవంతుడే సర్వం అని తలుస్తూ, ఆ స్వామి దగ్గర అన్ని సమయాలలోనూ కూర్చొని కాలక్షేపం చేయడమేనా? అన్నిటినీ విడచిపెట్టి సన్యాసిగా అయితే తప్ప, భక్తి కుదరదు, అప్పుడు గాని భక్తి ఉన్నట్లు కాదు అని అర్థమా?

సర్వజ్ఞుడు, విచిత్రశక్తి అయిన భగవంతుడు సృష్టించిన ఈ లోకాన్ని, , అందులోని అందాన్ని, అందులోని రహస్యాన్ని దర్శించి ఆనందించడం కూడా భక్తిలో ఒక ప్రకారమే అని అంటున్నారు, పేయాళ్వార్లు.

తాను కన్న కొడుకును పొగిడితే తల్లికి సంతోషం కలుగుతుంది కదా. భగవంతుడు సృష్టించిన ఈ లోకంలోని సౌందర్యాన్ని దర్శించి, ఆనందించి కీర్తిస్తే, దానిని సృష్టించిన భగవంతునకు ఎంతటి సంతోషం కలుగుతుంది! అంతే తప్ప, ఈ జగత్తును, ఇందులోని విశేషాలను విడచిపెట్టి, దూరంగా పెట్టి, పట్టించుకోకుండా ఉంటే, అపుడు భగవంతునకు సంతోషం కలిగుతుందా? ఎంత మాత్రం కలుగదు. . భగవంతుడు సృష్టించిన ఈ లోకం అంతా అక్కర లేనిది, ఆవశ్యకం కానిది అని పక్కకు పెట్టినట్లయితే, అది భగవంతునకు ఏ విధంగా అభిమతం అవుతుంది?

ఆళ్వారుల భక్తిసాహిత్యాన్ని, వారు అనుగ్రహించిన పాశురాలను గమనించినట్లయితే, ఈ విషయం మనకు చక్కగా అర్థం అవుతుంది. ఈ లోకం, ఇందులో ఉండే సౌందర్యం, దానివల్ల గోచరించే భగవంతుని విచిత్ర శక్తి, జ్ఞానం మొదలైన విషయాలను సూక్ష్మంగా దర్శించి ఆనందించి, వారు అనుగ్రహించిన పాశురాలను ఎన్నిటినో మనం గమనించవచ్చు. లోకాన్ని దూరం పెట్టి, దానిని దర్శించలేనివానికి ఇటువంటి అనుభవం కానీ, ఆనందం కానీ ఎంత మాత్రం కలుగదు.

ఈ విషయంగా, పేయాళ్వార్లు అనుగ్రహించిన ఒక పాశురాన్ని గమనిద్దాం. ఆ పాశుర నేపథ్యం ఈ విధంగా ఉన్నది.

తిరుమల కొండపై నిండుగా వానరాలు ఉన్నాయి. అవి అక్కడ ఉండే చెట్లపై పండిన పండ్లను కోసుకొని తింటున్నాయి. ఆ సమయంలో ఒక వానరానికి దాహం కలిగింది. అది అక్కడ ఉండే ఒక కొండ వాగు దగ్గరకు వెళ్లి, అందులో నీరు తాగడం కోసం

వంగింది. అప్పుడు ఆ కొండవాగు నీటిలో ఆ వానరం ప్రతిబింబం దానికి కనిపించింది. వెంటనే అది, వేరొక కోతి వాగులో ఉన్నదని భయపడి, గట్టుమీదకు పరిగెత్తుకొని వచ్చింది. ఆ తరువాత మెల్లిగా మళ్లీ వాగు దగ్గరకు వచ్చి చూచింది. తన చేతిలో పండు ఉన్నట్లుగానే, ఆ ప్రతిబింబం చేతిలో కూడా పండు కనిపించింది. అప్పుడు ఆ వానరం ప్రతిబింబం చేతిలో ఉండే వెలగపండును తనకు ఇమ్మని చేతులు చాచి అడుగుతున్నది. ఇది ఈ పాశురంలోని సన్నివేశం.

తిరుమల కొండలపై గోచరించే ఇటువంటి సహజ సిద్ధమైన, , మనోహరమైన దృశ్యాన్ని పేయాళ్వార్లు మన కంటి ముందు అందమైన ఈ క్రింది పాశురం ద్వారా గోచరింప చేస్తున్నారు.

పార్ త్త కడువన్ శునైనీర్ నిఴల్ కండు
పేర్ త్తోర్ కడువనెన ప్పేర్ న్దు—కార్ త్త
కళఙ్కనిక్కు క్కై నీట్టుమ్ వేంగడమే, మేలొరునాళ్
విళఙ్కనిక్కు క్కన్డెడుత్తాన్ వెఱ్పు

తిరుమల కొండపై ఉండే కొండవాగులలో తన ప్రతిబింబాన్ని చూసిన ఒకానొక వానరం "ఇంకొక వానరం ఆ కొండ వాగులో ఉన్నద" ని భావించి, దూరంగా వెళ్లి, ఆ నీటిలో కనిపించే ప్రతిబింబం చేతిలో ఉండే నల్లని వెలగపండు కోసం తన చేతిని చాచి అడుగుతున్నది. అటువంటి ఈ పర్వతంపై నెలకొని ఉండే స్వామియే పూర్వం ద్వాపర యుగాంతంలో శ్రీకృష్ణుడై అవతరించి, వెలగపండుపై లేగ దూడను విసిరి, ఆ పండును నేలకు రాల్చాడు.

ఈ లోకాన్ని కాదని వదిలిపెట్టి, ఏమి భక్తిని సాధించగలం? వానరం తన నీడను చూచి భయపడి, తరువాత వెలగపండును అడిగే సన్నివేశాన్ని పైపాశురంలో మనకు పేయాళ్వారులు సాక్షాత్కరింపజేశారు.

ఈ పాశురంలో మనకు ఏ భక్తి తత్త్వాన్ని వ్యక్తం చేస్తున్నది? భక్తి అనేది ఈ లోకానికి దూరంగా ఉండేది కాదు. ఈ లోకంలో, నివసిస్తూ ఇందులోని భగవంతుడు మనకు దర్శింపజేసే సౌందర్యాన్ని దర్శించి, వాటిలో భగవత్సంబంధాన్ని గమనిస్తూ, ఆ స్వామిని ఆరాధించడంకూడా భక్తియే. అందువల్లనే ఇక్కడ ఆళ్వారులు ఈ పాశురంలో, కొండమీద వానరాలు చేసే సంచారాలు, అవి చెట్లపై ఉండే పండ్లను కోసి కొని తినడం,

దాహాన్ని తీర్చుకోవడం కోసం కొండవాగు దగ్గరకు వెళ్లడం, అక్కడ ఒక వానరం ఆ నీటిలో తన ప్రతిబింబాన్ని చూచి వేరొక కోతిగా భావించి భయపడి వెనుకకు జంకడం, మళ్ళీ ఆ ప్రతిబింబం దగ్గరకు వెళ్లి ఆ ప్రతిబింబం చేతిలో కనిపించే వెలగపండును కోరుతూ తనకు దానిని ఇమ్మని అడుగుతూ చేతులను చాచడం –అనే ఈ విధమైన, సహజ సిద్ధమైన దృశ్యాలను అన్నిటినీ మనకు దర్శింప చేయడం అంతా భగవత్సృష్టిలోని అందాన్ని దర్శింపచేయడమే, ఆ కొండల్లో అని ప్రతి వస్తువు భగవత్సంబంధాన్ని కలిగినవి అనే భావనతోనే. . ఆళ్వార్లు అందరూ భగవంతుని సంబంధాన్ని కల వస్తువులు, అవి ఈ లోకంలో ఉండేవి అయినప్పటికీ, వాటిలో వాటిని అన్నిటిని దర్శించి, భక్తిపారవశ్యంతో వర్ణిస్తారు. సర్వత్రా భగవత్సంబంధాన్ని దర్శిస్తారు.

★★★★★

# ౨౧. కావేరీనదీవైభవమ్

భగవానుడైన శ్రీమన్నారాయణుడు క్షీరాబ్ధిలో శయనించి ఉంటాడు. అతడు ఒక కరుణాసముద్రుడు. . అవధి లేని కళ్యాణ గుణాలు సంగమించే మహాసముద్రం. సాగరం వలె విస్తరించిన అతని మహిమలను ఎంతగా ప్రయత్నం చేసి వర్ణించినప్పటికీ, వాటిని పలికి పూర్తి చేయడం సాధ్యం కాని విషయం.

తీర్ త్తనుక్క**ற்ற** పిన్ మ**ற்றோார్** శరణిల్లై ఎన్నెణ్ణి
తీర్ త్తనుక్కే తీర్ త్త మనత్తననాకి శె**ழு**మ్ కురుగూర్ శడగోపన్ శొన్న.
తీర్ త్తఙ్గళాయిరత్తుళ్ ఇవై పత్తుమ్ వల్లార్ కళై, దేవర్ వైకల్
తీర్ త్తంగళే ఎన్ను పూశిత్తు నల్ గి యురైప్పర్ తమ్ దేవియర్ క్కే
(తిరువాయ్ మొ**ழி**– 7–10–11)

అని నమ్మాళ్వారులు భగవంతుని ఒక పుణ్యతీర్థంగాను, ఆ స్వామిని ఉద్దేశించి తాము అనుగ్రహించిన ప్రతిపాశురం ఒక్కొక్క తీర్థంగాను చెప్పారు.

ఈ సంసారి జీవులు మనస్సులో పవిత్రతను పొంది, సంసారం అనే చాలా లోతైన సముద్రం నుండి బయటపడి ఉజ్జీవించడం కోసం మనపై చాలా దయను కలిగిన, భగవానుడైన శ్రీమన్నారాయణుడు మనకు పరమ ప్రమాణాలయిన వేదాలను అనుగ్రహించాడు తరువాత, మహనీయులైన ఆళ్వార్లను, ఆచార్యులను అవతరింపచేసి, వారి ద్వారా ఆ వేదాల కణాలుగా పలు తీర్థాలను, అంటే, పలు సూక్తులను మనకు అనుగ్రహించాడు. మనం బాహ్యంగా పవిత్రతను పొందడం కోసం అతడే పలు పుణ్య నదులైన గంగ, యమున, కావేరి, తామరపర్ణి, వేగవతి, వేగైనది వంటి నదులను ఈ భూమిపై ప్రవహింప చేశాడు. చేతనులు అందరూ తమ మనస్సులోని అజ్ఞానాన్ని, దేహంలోని కాలుష్యాన్ని పోగొట్టుకొని, బాహ్యాంతర పవిత్రతను పొంది, తమ స్వరూపానికి అనుగుణంగా తన కైంకర్యాన్ని చేసికొని ఉజ్జీవించడం కోసం తానే స్వయంగా ఆ నదీతీరాలలో అర్చారూపంగా ఆవిర్భవించి, ఈనాటికి వేంచేసి ఉన్నాడు.

మన భారతదేశంలో చాలా పవిత్రతను పొందినదిగా గంగానది కీర్తింపబడుతున్నది. త్రివిక్రమ స్వామి శ్రీపాద తీర్థంగా కీర్తింపబడుతున్నది. ఏదో ఒక నదిలో, చెరువులో స్నానం చేసినప్పటికీ కూడా, ఆ నీటిని గంగగా భావించి స్నానం చేసేటప్పుడు "గంగ గంగ గంగ" అని ఉచ్చరిస్తే వెంటనే, వారి అనాది అయిన పాపాలు అన్నీ తీరిపోతాయి –అని శాస్త్రాలు తెలుపుతున్నాయి. అటువంటి వైభవాన్ని కలిగినది, గంగా నది. సాక్షాత్తు

దానిలో స్నానం చేయకపోయినప్పటికీ కూడా, దాని నామస్మరణ వల్లనే మనకు శారీరకమైన, మానసికమైన పవిత్రత చేకూరుతుందని శాస్త్రాలు తెలుపుతున్నాయి.

"తామ్రపర్ణీనదీ యత్ర కృతమాలా పయస్వినీ,
కావేరీ చ మహాపుణ్యా ప్రతీచీ చ మహానదీ" (శ్రీమద్భాగవతం –11– 5– 39)

ఈ శ్లోకంలో గంగ, తామ్రపర్ణి వంటి నదుల కంటె చాలా పవిత్రతను కలిగినది, కావేరినది– అని శ్రీమద్భాగవతం తెలుపుతున్నది. ఈ అర్థం ఇక్కడ "మహాపుణ్యా" అనే విశేషణం కావేరీ నదికి ప్రయోగింపబడడం ద్వారా స్ఫురిస్తున్నది.

భక్తాంఘ్రిరేణువు అనే పేరు కలిగిన తొండరడి ప్పొడి ఆళ్వార్లు తిరుమాలై ప్రబంధంలోని " గంగైయిల్ పునిదమాయ " అనే 23వ పాశురంలో ఇదే అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు.

ఈ విధంగా గంగానది కంటే కూడా కావేరీ నదికి ఎందువల్ల అంతటి ఎక్కువ పవిత్రత, ఆధిక్యం?

"కావేరి విరజా సేయం వైకుంఠం రంగ మందిరమ్,
స వాసుదేవో రంగేశః ప్రత్యక్షం పరమంపదమ్"

అని శ్రీవైకుంఠంలో ప్రవహించే విరజానదియే కావేరీ నది. శ్రీరంగ విమానమే వైకుంఠం. పరవాసు దేవుడే శ్రీ రంగనాథుడుగా అవతరించాడు –అని శాస్త్రాలు శీరంగ క్షేత్రంలోని గొప్పతనాన్ని పొగడుతున్నాయి.

మన పూర్వాచార్యులలో ప్రముఖులైన శ్రీపరాశర భట్టర్ కూడా శ్రీరంగరాజస్తవం పూర్వ శతకంలో

కావేరీ మవగాహిషీయ భగవద్భోగాంతరాయీభవత్–
కర్మక్లేశఫలాశయ ప్రశమనో ద్వేలామలస్రోతసమ్,
జంతోః సంసారతో ఽ ర్చిరాదిసరణి వ్యాసంగ భంగాశయా
లోకే ఽ స్మిన్ విరజేవ వేల్లితజలా శ్రీరంగ మాలింగతి (20)
దుగ్ధాబ్ధిర్జనకో జనన్యహ మియం శ్రీ రేవ పుత్రీ వరః
శ్రీరంగేశ్వర ఏతదర్హ మిహ కిం కుర్యా మితతీవాకులా,
చంచచ్చామర చంద్ర చందన మహామాణిక్య ముక్తోత్కరాన్
కావేరీ లహరీకరైః విదధతీ పర్యేతి సా సేవ్యతామ్ (21)

అనే రెండు శ్లోకాలలో కావేరి వైభవాన్ని వర్ణించారు. కావేరీ నదికి భర్త పాలసముద్రుడు. అతడే శ్రీ రంగ నాయకి తండ్రి. పాలసముద్రం నుండి లక్ష్మీదేవి ఆవిర్భవించింది కదా. అందువల్ల క్షీరసముద్రునకు పత్ని అయిన కావేరి నది శ్రీ రంగనాయకి తల్లి అయినది. ఈ విధంగా కావేరీ నది తాను కన్న కూతురుగా శ్రీరంగ నాయకి ప్రకాశిస్తున్నది. శ్రీరంగ దివ్యాలయంలో నిత్య వాసం చేస్తున్న శ్రీరంగనాయకికి పతి అయిన శ్రీరంగనాథుడు కావేరీ నదికి అల్లుడు అయినాడు. "నా కూతురు అయిన శ్రీరంగనాయకికి, అల్లుడు అయిన శ్రీ రంగనాథునకు నేను ఏమి కానుకగా తీసుకొని వచ్చి ఇవ్వాలి?, . నా అల్లుడు చాలా గొప్పవాడే! సర్వేశ్వరుడు కదా! , అతని గొప్పతనానికి తగినట్లుగా నేను ఏ విధంగా గొప్ప గొప్ప కానుకలను ఇవ్వగలను?" అని మనసులో కలతను చెందినది, కావేరినది. తరువాత ఒక నిశ్చయానికి వచ్చినది. చందనవృక్షాలు, చామరాలు, పచ్చ కర్పూరం, ముత్యాలు, గొప్ప గొప్ప మాణిక్యాలు అనే వీటిని శ్రీరంగనాథుని సంతోష పెట్టడం కోసం అతనికి కానుకగా తన కెరటాలు అనే చేతులతో తీసుకొని వచ్చి, ఆ శ్రీరంగనాథుని సన్నిధిలో సమర్పిస్తున్నదట, ఈ కావేరి నది. ఈ నది శ్రీరంగానికి ఒక అలంకారంగా ఉన్నది. శ్రీరంగనాథుని నిత్యారాధనకు ఆవశ్యకమైన పవిత్రమైన జలాలను అందిస్తున్నది. తనలో స్నానం చేయడం కోసం వచ్చేవారి కర్మ ఫలాలను పోగొట్టి, వారికి మంచిని కలుగ జేస్తున్నది. ఈ విధంగా శ్రీరంగనాథుని కైంకర్యంలో నిత్యం అన్వయించి, సంబంధాన్ని కలిగిన కావేరీ నదిని మనం అనుదినం స్తుతించి, ధన్యులం అవుదాం– అని అంటూ ఈ శ్లోకాలలో భట్టర్ అనుగ్రహిస్తున్నారు.

ఇక, వేదాంతదేశికులు అయితే, పరమపద సోపానం అనే ప్రబంధంలో

అడర్ ఫుళ్ అరశినుమ్ అందణర్ మాట్టినుమ్, ఇన్నముద
కడల్పుళ్ళితన్నినుమ్ కావిరి ఉళ్ళుమ్ ఉకన్ద పిరాన్
ఇడైప్పిళ్ళై ఆకి ఉరైత్తురైక్కుమ్ ఎతివరనార్
మడప్పళ్ళి వంద మణమ్ఎంగళ్ వార్ త్తైయుళ్ మన్నియదే (1)

అనే పాశురంలో వేదస్వరూపి అయిన గరుడుని వాహనంగా కలిగి, అతనిపై అధిరోహించి భగవానుడు వేంచేసి ఉన్నాడు. అతడే, బ్రాహ్మణులకు ఏనాడు తరగతి ధనంగా ఉండే వేదాల చేత కీర్తింపబడి, వాటిని నిత్యనివాసంగా కలిగి ఉన్నాడు. లక్ష్మీదేవి అవతరించిన క్షీరాబ్ధిలో నిత్యముక్తుల సమూహం చుట్టూ చేరి ఉండగా, ఆదిశేషునిపై శయనించి ఉన్నాడు. వీటి అన్నిటి కంటే అతడు మనసులో సంతోషించి నిత్య వాసం చేసేది

ఎక్కడ అంటే, కావేరీ నదీ తీరంలో ఉండే శ్రీరంగ క్షేత్రంలోనే–< అని మన పూర్వాచార్యులు స్థాపించారు– అని అన్నారు. అంతేకాక, పాదుకా సహస్రంలో

కమపి కనకసింధోః సైకతే సంచరంతం
కలశ జలధికన్యా మేదినీ దత్తహస్తమ్,
అనిశ మనుభవేయం పాదుకే తయ్యధీనం
సుచరితపరిపాకం సూరిభిః సేవనీయమ్ (49)

అనే ఒక అద్భుతమైన శ్లోకంలో –కావేరీ నదీ తీరంలోని ఇసుక తిన్నె పైన, శ్రీరంగ క్షేత్రంలో శ్రీదేవి, భూదేవి అనే ఇద్దరు దివ్యపత్నుల చేతులను ఆలంబనంగా చేసుకొని, శ్రీపాదుకలను ధరించి, శ్రీరంగనాథుడు గంభీరంగా శ్రీరంగనగరవీథులలో సంచారాన్ని చేస్తున్నాడు. పరమపదంలో కూడా ఇటువంటి సేవ లభించదు కనుక, నిత్యులు ముక్తులు సైతం కావేరీనదీ తీరానికి వచ్చి ఈ సేవను సేవిస్తున్నారు– అని అంటూ విరజానదికి, పాలసముద్రానికి లభించని ఒక మహాభాగ్యాన్ని కావేరీ నది పొందింది–అని చాలా రసవత్తరంగా అనుగ్రహించారు.

మణిమాడ క్కోయిల్ అనే దివ్యదేశంలో కావేరీనది అనుగ్రహించే ఔదార్యాన్ని తిరుమంగై ఆళ్వారులు తమ పెరియ తిరుమొழி ప్రబంధంలో ఈ క్రింది పాశురంలో వర్ణించారు.

కొలైప్పుణ్ తలైక్కున్ఱమొన్ఱు ఉయ్య అన్ఱు
కొడుమాముదలైక్కు ఇడర్ శెయ్ దు కొంగు ఆర్
ఇలైప్పుండరీక త్తవళిన్నమ్ అన్నొడు
అణైందిట్ట అమ్మానిడమ్ ఆళరియాల్
అలైప్పుండ యానై మరుప్పుమ్ అకిలుమ్
అణిముత్తుమ్ వెణ్ శామరైయోడు పొన్ని
మలైప్పండ మండత్తిరై యుందు నాంగూర్
మణిమాడక్కోయిల్ వణంగు ఎన్ మననే! (3–8–3)

సింహాలు వేటాడిన ఏనుగుల దంతాలను, అగరు చెట్లను, అందమైన ముత్యాలను, తెల్లని చామరాలను, ఇంకా గొప్ప గొప్ప వస్త్రాలను తన కెరటాలతో కావేరి నది భగవానునకు సమర్పిస్తున్నది అక్కడనుండి ఆర్భాటంగా బయలుదేరి, తిరుప్పుళ్ళమ్ పూదంగుడి దివ్య దేశాన్ని చేరుతున్నది. ఆ క్షేత్రంలో ఆ నది శ్రీరంగనాథుని విశ్లేషించిన

దుఃఖాన్ని కొంత తీర్చుకొని, అక్కడ ఉండే, శయన సన్నివేశంలో సాక్షాత్కరించే స్వామి తేజస్సులో ఆకర్షింపబడి, మోహించి,

తున్ని మణ్ణుమ్ విణ్ణాడుమ్ తోన్ఱాదు ఇరుళాయ్ మూడియ నాళ్
అన్నమాగి అరుమఱైగళ్ అరుళ్ శెయ్ ద అమలనిడమ్,
మిన్ను శోది నవమణియుమ్ వేయిన్ ముత్తుమ్ శామరైయుమ్
పొన్నుమ్ పొన్ని కొణర్ న్దు అలైకుమ్ పుళ్ళమ్ పూదంగుడిదానే
(పెరియ తిరుమొ**ழி**–5–1–9)

అనే పాశురంలో తిరుమంగై ఆళ్వారులు చెప్పినట్లుగా, వెలలే ని ముత్యాలను, చామరాలను, బంగారాన్ని తీసుకొని వచ్చి, అతని శ్రీచరణాలలో సమర్పించి, అక్కడ నుండి బయలుదేరడానికి ఆ స్వామి అనుమతిని పొందుతున్నది.

ఆ తరువాత చోళమండలంలో అనేక దివ్య క్షేత్రాలలోని మార్గాల ద్వారా ప్రవహించి, ఆయా దివ్యదేశాలలో సాక్షాత్కరించే అర్చామూర్తుల శ్రీ చరణాలను స్పృశించి కడిగి, వారి దివ్యారాధనకు ఆవశ్యకమైన తీర్థాన్ని సమర్పించి, తన స్వరూపానికి తగిన కైంకర్యాన్ని చేసికొని, చివరకు సముద్రంలో సంగమిస్తున్నది.

కావేరీ నది ఈ విధంగా "తెళివిలా క్కలంగల నీర్ శూழ்" అనే విధంగా కలత చెందిన నీటిని కలిగి ఉత్తర దేశ ప్రాంతంలో సహ్యా పర్వతంలో పుట్టినప్పటికీ, పలు దివ్య క్షేత్రాలలోని అర్చామూర్తుల శ్రీచరణాలను స్పృశించి, ఆ సంబంధం చేత క్లేశాలను తొలిగినదై, "తెణ్ణీర్ పొన్ని" అనే విధంగా స్వచ్ఛమైన తేటపడిన నీటిని కలిగినదై, ఉజ్జీవనాన్ని పొందింది.

ఈ లోకంలో ఎవరు భగవంతునిపై మిక్కిలి భక్తిని కలిగినవారై, ఆ స్వామి సన్నిధిలో శరణు పొంది, అతని కైంకర్యంలో నిరంతరం అభినివేశాన్ని కలిగి ఉండి, పూర్వాచార్యులు ఉపదేశించిన దారిలో ప్రయాణం చేసి, తమ ఉజ్జీవనాన్ని పొందుతున్నారో, వారు భగవంతునకు మిక్కిలి ప్రీతిపాత్రులై, ఔన్నత్యాన్ని పొందుతున్నారు. ఇదే కదా, ఒక జీవుని ముఖ్యమైన కర్తవ్యం. ఈ తత్వాన్నే కదా ఈ కావేరీ నది తెలుసుకొని, తాను ఆచరించి, మనకందరకు ఉపదేశిస్తున్నది. ఆ నదిలో స్నానమాడి పవిత్రులమై, ఆమె చూపిన దారిలో ప్రయాణం చేసి, మనం కూడా ఉజ్జీవనాన్ని పొందుదాం. రండి. స్వస్తి.

★★★★★